### ఇంత చదవాలని అనుకోవద్దు!

# మనసులోని నా మాట నేరుగా మీతోనే..

### అందుకే ఇంత చెప్పాల్సివస్తోంది!

ఏడేళ్ల వయస్సులో భోజనానికి కూడా ఎన్నో కష్టాలు ఎదుర్కున్నా. పేదరికంలో పెరిగా. చదువుకునే స్థోమత కూడా లేనందువల్ల.. నెల్లూరులో నగలు తయారు చేసే కేంద్రంలో పన్నెండేళ్ల వయస్సులో కూలీగా చేరా. 'తనదాకా వస్తేకానీ.. తెలియదు!' అని చెబుతుంటారు. అది వందశాతం అక్షరసత్యమండి! పేదరికాన్ని అనుభవించినందువల్ల, ఈ రోజుకీ సగటు వ్యక్తి కష్టనష్టాలను అర్థం చేసుకోగలను.

వేళకు తినక, అహర్నిశలు శ్రమిస్తూనే ఉన్నాం, ఎందుకు?.. రక్తపోటు, మధుమేహం వంటి సమస్యలను సైతం లెక్కచేయక శరీరానికి విశ్రాంతి లేకుండా పనిచేస్తున్నామే, ఎందుకు? నాలుగు కాసులు సంపాదించుకోవడానికేగా!.. ఆ డబ్బును పిచ్చుకగూడులా చేర్చుకోవడానికేగా? ఇంటి పనులు చూసుకుంటూ, పిల్లల్ని పెంచి పోషిస్తూ, ఉద్యోగానికి కూడా వెళ్తున్నారే మహిళలు- ఎందుకు? కుటుంబ ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచడానికేగా?.. ఇలా కష్టపడి సంపాదించిన డబ్బును వృథా చేయవచ్చా? ఒక వస్తువును కొనుగోలు చేసేటప్పుడు దానికి న్యాయంగా చెల్లించాల్సిన డబ్బు కన్నా ఎక్కువగా చెల్లించడం తప్పేగా?

మనదేశంలో బంగారం ఓ అలంకార వస్తువు మాత్రమే కాదండి, అది ఇంటికే ఓ భద్రత! అవసరానికి ఆదుకునే ఆపద్బాంధవ పెట్టుబడి. మరి అలాంటి బంగారాన్ని సరైన ధరకు కొనడం ఎంత ముఖ్యం?

నగల వ్యాపారిగా అడగడం లేదు, ప్రజల ఆశిస్సులతో ప్రస్తుతం ఓ మంచి స్థాయికి వచ్చిన తర్వాత కూడా రోజుకు 18 గంటల పాటు శ్రమించే ఓ కుటుంబ యజమానిగా అడుగుతున్నా. అంతేకాదు.. నగల తయారీ రంగంలో తమిళనాడులోని ఓ ప్రముఖ విశ్వవిద్యాలయం నుంచి ఇటీవల డాక్టరేట్‌ను అందుకున్నానన్న విషయాన్ని ఈ సందర్భంగా ప్రస్తావించాలని అనుకుంటున్నా. 5,860 కోట్ల రూపాయలు టర్నోవర్ చేసే, దక్షిణాదిలో ప్రముఖంగా భాసిల్లుతున్న ఓ నగల సంస్థ అధినేతగా, వ్యాపారవేత్తగా అడగడం లేదు. దయచేసి మీలో ఒకడిగా నన్ను భావించండి. నగలను కొనేటప్పుడు అవసరానికి అధికంగా తరుగు చెల్లించవచ్చా? నగదును వృథా చేయవచ్చా? ఆభరణాల విక్రయాలు మాత్రమే మా లక్ష్యం కాదు.. సరైన అవగాహనతో ప్రజలు నగలు కొనాలన్నదే మా ఆశయం.

ఏదో ఆఫర్ ఇస్తున్నారు, నమ్మకంగా చెబుతున్నారు, చాలా రాయితీలు లభిస్తాయి.. అనుకుంటూ మీ దృష్టిని ఏమాత్రం మరల్చకండి. మనం ఎంత నగదు చెల్లిస్తున్నాం.. అందుకు ఎన్ని గ్రాముల బంగారం లభిస్తోంది, ఏ షోరూంలో గరిష్ఠంగా **(NETT PHYSICAL WEIGHT OF GOLD IN GRAMS)** బంగారం ఇస్తారనే విషయంపై మాత్రమే మీరు దృష్టి కేంద్రీకరించాలి. ప్రతి రూపాయికీ లెక్క చూసుకోండి. ఏమాత్రం తప్పులేదు.. ఎందుకంటే అది మీ డబ్బు! ఇంకో విషయం.. **BIS 916** హాల్‌మార్క్ బంగారంతో తయారు చేసిన ఆభరణమేనా అని సరిచూసుకోండి. వజ్రాభరణమైతే **IGI** సర్టిఫికెట్ తప్పకుండా ఉండాలి. ఇది నగాజ్ ఆభరణం, ఇది కాస్టింగ్ ఆభరణం, నగ పనితనం ఎక్కువ అన్న లొసుగులను ఏమాత్రం నమ్మొద్దు. ఎంత పనితనం ఉన్నప్పటికీ మీరు పొందాల్సిన బంగారం బరువులో రాజీ పడొద్దు.




ఇదివరకు ఎంతో శ్రమకోర్చిన నగదును అధిక ధరల నగల కోసం వృథా చేసింది చాలు. ఇకపై వాటికి స్వస్తి పలకండి. తయారీ ధరకే బంగారు నగలు, వజ్రాభరణాలు మరియు వెండి వస్తువులు అందజేస్తుండటం చాలా సంతోషంగా ఉంది. మార్కెట్‌లోనే తక్కువ ధరకే మావద్ద నగలు లభ్యమవుతాయి. భేరమాడే అవసరం మీకు ఏమాత్రం ఉండనంత తక్కువ ధరలకే లభిస్తాయి.

మీ సంతోషం కోసం 1 నుంచి 9% తరుగుతో బంగారు ఆభరణాలు (అతి తక్కువ ఆభరణాలకు 10 నుంచి 17% వరకు), దేశంలోనే అతితక్కువ ధరకు వజ్రాభరణాలు లలితా జ్యువెల్లరిలో అందజేస్తున్నాం. వేలాది, లక్షలాది రూపాయలు ఆదా చేయవచ్చు. అలా ఆదాచేసిన డబ్బు ఆదాయమేగా!

**(Money saved is money earned)**

నేను చెప్పే విషయాన్ని మీరలాగే పాటించాల్సిన అవసరం లేదు. నాలుగు షోరూంలలో పరిశీలించి ఆ తర్వాత లలితా జ్యువెల్లరికి వచ్చి చెక్ చేసుకోండి. మీరు చెల్లించే నగదుకు తగ్గ బరువులో బంగారాన్ని ఇంటికి తీసుకెళ్తున్నారా అని పరిశీలించండి. దయచేసి మీ కుటుంబంలో ఒకరిగా నన్ను భావించండి. లలితా జ్యువెల్లరిలో తక్కువ తరుగుతో నగలును కొనుగోలు చేసి లబ్ధి పొందండి. ఆ విషయాన్ని ఇతరులతో కూడా పంచుకోండి. ఈ పుస్తకాన్ని కూడా ఇతరులకు పంచండి. మీలాంటి వినియోగదారుల సంఖ్య మరింత పెరిగేకొద్దీ.. మా తరుగు ఇంకా తగ్గుతుంది. ఇది కేవలం మాట వరసకు చెబుతున్నానని అనుకోవద్దు.. హృదయపూర్వకంగా చెబుతున్న మాటలివి! ఇకపై మీరు అవసరానికి మించి అధిక నగదు వెచ్చించి నగలు కొనాల్సిన అవసరంలేదు. లలితా జ్యువెల్లరికి మిమ్మల్ని సాధరంగా ఆహ్వానిస్తున్నాం. మీ ఇల్లు బంగారం కావాలని మంచి మనసుతో లలితా జ్యువెల్లరి కుటుంబం తరఫున మనసారా కోరుకుంటున్నాం.



మీ అందరి శుభాభివందనములతో
మీ డా|| యం. కిరణ్ కుమార్
చైర్మన్-మేనేజింగ్ డైరెక్టర్
లలితా జ్యువెల్లరి మార్ట్ ప్రై లిమిటెడ్

మీరు ఎంతో శ్రమకోర్చి సంపాదించిన నగదులో ప్రతి రూపాయి విలువ మాకు బాగా తెలుసు. అందువల్లే, ఇంత తక్కువ తరుగుకు నగలను అందజేస్తున్నాం.

ఏ ఆభరణానికైనా లలితా జ్యువెల్లరిలో ఎస్టిమేట్ స్లిప్‌ను పొందవచ్చు. ఆ తర్వాత నాలుగు షోరూంలకు వెళ్లి పోల్చి చూసుకుని.. ఎక్కడ న్యాయమైన ధరకు నగలు కొనుగోలు చేయాలో మీరే నిర్ణయించుకోండి!

**29-1-75/1, ఆర్‌టీసీ బస్టాండ్, ద్వారకా నగర్, వైజాగ్. ఫోన్: 0891-6600001.**

చెన్నై • మధురై • తిరుచ్చి • పుదుచ్చేరి • కుంభకోణం • బెంగళూరు • రామనాథపురం • కోయంబత్తూరు • తిరుపతి



8

## సౌభాగ్యప్రదం వరలక్ష్మీవ్రతం

చారుమతికి ఆరోజు సాక్షాత్తూ వరలక్ష్మీదేవి కలలో ప్రత్యక్షమైంది. శ్రావణ శుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారంరోజు తనను భక్తితో సేవిస్తే సకలకోరికలూ నెరవేరుస్తానని అభయమిచ్చింది... ఆగస్టు 12వ తేదీ వరలక్ష్మీవ్రతం సందర్భంగా వ్రతకథ విధానం మీకోసం...

48

### చల్లని తల్లి... మన ఉల్లి

పొట్టనిండా విటమిన్లు నింపుకున్న పాయ మన ఉల్లిపాయ. ఐదువేల యేళ్ళనాటిది ఉల్లి చరిత్ర! ఏ రూపంలో తిన్నా దీనివల్ల ఆరోగ్యమే ఆరోగ్యం.

72

### ఇంటర్వ్యూ

భక్తప్రహ్లాద చిత్రంతో ఐదేళ్ళ వయసులోనే జాతీయస్థాయికి ఎదిగి అవార్డులందుకున్న నటి రోజారమణి. నాలుగు దశాబ్దాల ఆమె సినీ కెరీర్ విశేషాలు ఈ వారం...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



*ముఖచిత్రం:* రకుల్‌ప్రీత్‌సింగ్
ఫొటో: గోపీకృష్ణ


*రచనలు, కథలు పంపవలసిన చిరునామా*

**నవ్య వీక్లీ,** *ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33.* email: navyaweekly@andhrajyothy.com





### భరించలేని అవమానం

ఆఫీసర్‌తో అనేక మాటలు పడి, ఇంటికి చేరుకున్నాడతను. ఏడుస్తూ కనిపించింది శ్రీమతి.

"ఏమైందే! ఎందుకు ఆ ఏడుపు?" విసుక్కున్నాడు.

"మీ అమ్మ నన్ను ఎంత మాటన్నదో తెలుసా? ఎంతగా అవమానించిందో తెలుసా?"

"మా అమ్మ...నిన్ను అవమానించిందా? అదెలా సాధ్యం? మా అమ్మ మా అక్కా వాళ్ళింట్లో కలకత్తాలో ఉంది కదే." అన్నాడతను.

"ఆ సంగతి నాకూ తెలుసు. అయితే పొద్దున మీ పేరుతో అక్కణ్ణించే ఓ ఉత్తరం వచ్చింది. మీ అమ్మ రాసింది. అందులో ఏంవుందోనని చించి చదివాను."

"ఏంవుంది అందులో?"

"ఏంవుందో మీరు చదువుకోండి, నేను చచ్చినా చెప్పను. కాకపోతే ఆఖర్లో ఏం రాసిందో తెలుసా మీ అమ్మ?"

"ఏం రాసింది?"

"పి.ఎస్: కోడలుపిల్లా! ఉత్తరం చదివితే చదివావుగాని, దయచేసి ఈ ఉత్తరాన్ని మా అబ్బాయికి ఇవ్వడం మరిచిపోకు అని రాసింది. దాంతో తల కొట్టేసినట్టైంది." అంది శ్రీమతి ఏడుపు కొనసాగిస్తూ.

### ఏది ముందు?

**కో**డి ముందా? గుడ్డు ముందా? ఏది ముందు అని తల బద్దలు కొట్టుకుంటున్నాడు నరేష్. పిచ్చెక్కిపోతున్నాడు. అలాంటి స్థితిలో అతన్ని కలిశాడు అప్పారావు.

"ఏమైందిరా? ఎందుకు అంత టెన్షన్‌గా ఉన్నావు?" అడిగాడు.

"కోడి ముందా? గుడ్డు ముందా?"

"ఏది ముందు ఆర్డర్ చేస్తే అదొస్తుంది. దానికంత తల బద్దలు కొట్టుకోవడం దేనికి?" అని, తనకి ఓ ప్లేటు చికెన్ *65* తెమ్మని సర్వర్‌కి ఆర్డర్ చేశాడు అప్పారావు.

### అంతే చాలు!

నిండుచూలాలు భార్యసహా జ్యోతిష్కుని కలిశాడు భర్త. భార్య చేయి చూసి జోస్యం చెప్పమన్నాడు. ఆమె చేయి చూసి చెప్పాడిలా జ్యోతిష్కుడు.

"నువ్వు ప్రసవించిన మరుక్షణం నీ బిడ్డ తండ్రి మరణిస్తాడు."

"మా వారు క్షేమంగా ఉంటారు కదా! నాకది చాలు." అన్నది భార్య.

-వైనతేయ

w m w w

# నవ్య

సంపుటి: 13 సంచిక: 24
17-8-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



## మొదటి పేజీ

# చిట్కా

జానకిరావుకి డెబ్బయి ఏళ్ళు. అయినా గట్టిగానే ఉంటాడు. బీపీ లేదు. షుగర్ లేదు. తిన్నది అరగకపోవడం లేదు. నిద్ర పట్టక పోవడం లేదు. జలుబు లేదు. జ్వరం లేదు. ఎంత దూరమైనా నడుస్తానంటాడేగాని, లిఫ్ట్ ఇస్తానన్నా తీసుకోడు. పొట్టిగా సన్నగా ఉంటాడు జానకిరావు. ఓ చేతిలో గొడుగూ, మరో చేతిలో పెద్దసైజు సంచీ ఉంచుకుని కాలనీ అంతటా తిరుగుతూ ఉంటాడు. ఏ సాయానికైనా ఏ వేళనైనా పిలిస్తే పలుకుతాడు. పని అంటే చాలు! ముందుంటాడు. పదిమందితో కలివిడిగా ఉంటాడు.

రావడం రావడమే జానకిరావు కాలనీకి ఒంటరిగా వచ్చాడు. సింగిల్ బెడ్‌రూం ఫ్లాట్ తీసుకుని, సింగిల్‌గానే ఉంటున్నాడు. భార్యాబిడ్డలు ఉన్నారో లేదో తెలియదు. ఆ వివరాలు అడిగితే నవ్వే అతని సమాధానం అవుతుంది. ఎవరో చెప్పారు, అతనికి భార్యా, ఓ కొడుకూ, ఓ కూతురూ ఉన్నారని. అయితే వాళ్ళంతా అమెరికాలో ఉంటున్నారట! జానకిరావు కూడా రెండేళ్ళక్రితం వరకూ అమెరికాలోనే ఉన్నాట్ట! తర్వాతే అక్కడ ఉండడం కష్టం అనిపించి ఇక్కడికి వచ్చేశాట్ట! కూడా భార్య రావాలిగా? రాలేదా? అంటే ఆమె రానన్నదనీ, కూతురింట ఉండిపోతానన్నదనీ చెప్పారు.

జానకిరావుకి వంట వచ్చు. అన్నీ చక్కగా వండుకుంటాడు. పొద్దుటిపూట ఎప్పుడూ ఇడ్లీనే తింటాడు. ఇడ్లీలను పువ్వుల్లా మెత్తగా పెట్టుకుంటాడు. మధ్యాహ్నం లంచ్‌కి రెండుకూరలూ, పచ్చడీ, పులుసూ ఉండి తీరాలి. ఓపిగ్గా చేసుకుంటాడవన్నీ. సాయంత్రం స్నాక్స్ పెద్దగా అక్కర్లేదుగాని, రాత్రి డిన్నర్‌కి మాత్రం మూడు చపాతీలూ, అంత పప్పూ ఉండాల్సిందే! దానికి ముందు రెండు పెగ్గులు బ్రాందీ పడాలి. అది లేకపోతే గంగ వెర్రులెత్తిపోతాడు జానకిరావు. అయితే ఆ రెండు పెగ్గులూ ఒక్కడూ కూర్చుని తాగడు. దానికి కంపెనీగా ఒకరిద్దరు మిత్రులుండాలి. వారి మందు ఖర్చు కూడా తానే భరిస్తానంటాడతను.



రాత్రి పన్నెండు గంటల వేళ మంచి నిద్రలో ఉంటాడు జానకిరావు. తలుపు తడతారెవరో! ఏంవిటమ్మా? ఏంవైందంటే...మా మామగారికి ఏం బాగాలేదు సార్! హార్టెటాక్ అనుకుంటాను, మెలికలు తిరిగి పోతున్నారంటే... నిద్రమత్తు వదిలించుకుని జానకిరావు తక్షణ చర్యలు తీసుకుంటాడు. అంబులెన్స్ పిలుస్తాడు. అంబులెన్సు వచ్చేంత వరకూ పేషెంట్ దగ్గర ఉండి, జాగ్రత్తలన్నీ తీసుకుంటాడు. పేషెంట్‌ని ఆసుపత్రిలో జాయిన్చేసి, అవసరమైతే ఆపరేషన్‌కి డబ్బు సర్దుతాడు. ఆపరేషన్ సక్సెస్ అయి, పేషెంట్ బతికి బట్టకడితే స్వీట్లు పంచిపెడతాడు. ఈ వ్యవహారంలో నాలుగైదు రోజులు నిద్ర ఉండదు. సరైన తిండి ఉండదు. రాత్రి మందు ఉండదు. పట్టించుకోడు జానకిరావు. చిరాకు పడడు. అయ్యా! మా కోడలు పిల్ల నొప్పులు పడుతోంది! అబ్బాయి టూర్లో ఉన్నాడు. ఇంటికి మగదిక్కు లేదు. మీరే చూడాలంటే...జానకిరావుకి పట్టపగ్గాలు ఉండవు. కోడలు పిల్లను ఆసుపత్రిలో జాయిన్చేసి, ఆమెకు పథ్యం పెట్టేంత వరకూ బిజీబిజీగా ఉంటాడు. బారసాలనాడు హడావుడి అంతా అతనిదే! పిల్లాడికి ఏం పేరు పెట్టాలి దగ్గర నుంచి వాడికి ఆ రోజు కానుకగా తాను ఏమివ్వాలన్న విషయమై జానకిరావు ఎంతగా హైరానా పడతాడో మాటల్లో చెప్పలేం.

కట్టుకున్న పెళ్ళాన్నీ, కన్నవాళ్ళనీ అమెరికాలో వదులుకుని, ఇక్కడ ఏమీ కాని వాళ్ళకోసం ఇంతగా హైరానా పడుతున్నావే ఎందుకయ్యా ఇదంతా? అని జానకిరావుని ఇంతవరకూ ఎవరూ అడగలేదు కాని, అడిగితే:

కట్టుకున్నది కూతురింట ఉండిపోయింది. ఆమె అక్కడే ఉండాలి. ఆమె అవసరం అక్కడ చాలా ఉంది. మనవణ్ణీ మనవరాలినీ చూసుకోవాలామె. నేను కొడుకు ఇంట్లోనే ఉండాలి. కొడుకూ కోడలూ ఇద్దరూ ఉద్యోగులవడంతో ఆ ఇంట్లో నేను ఒంటరిగా ఉండలేకపోయాను. ఒంటరిగా జీవించడం అంటే కావాలని అనారోగ్యాన్ని కొని తెచ్చుకోవడమే! పక్షవాతాన్నీ, గుండె జబ్బుల్నీ కౌగిలించుకోవడమే! పైగా పదిమందితో కలివిడిగా ఉండేందుకు వీలులేని పరిస్థితి అక్కడ. అది ఇక్కడ లేదు, ఉండదు. అందరూ కావాలనుకోవడం మంచి ఆరోగ్యచిట్కా. అదే నా ఆరోగ్య రహస్యం. అందుకే వచ్చేశానిక్కడికి అన్నది జానకిరావు సమాధానం అవుతుంది.




## ఒక్క అవకాశం!

తెలిసో తెలియకో, ఆవేశంవల్లనో తప్పులు చేస్తుంటారు కొంతమంది. నేరస్థులై జైలు శిక్ష అనుభవిస్తుంటారు. అయితే చేసిన తప్పులకు పశ్చాత్తాపంతో కొత్త జీవితం ఆరంభించాలని తపించే వారిపై కూడా వివక్ష చూపడం సరికాదంటున్నాడు ఓ యువకుడు.

అమెరికాకు చెందిన బ్రాండన్ క్రోటోస్కీ ఆవేశంతో నేరం చేసి జైలుకు వెళ్ళాడు. తప్పు గ్రహించి పశ్చాత్తాపపడ్డాడు. జైలులో ఉన్నప్పుడే న్యాయమూర్తి ఇచ్చిన అవకాశం అతడి జీవితాన్ని మార్చేసింది. జైలు బైటకొచ్చాక క్లీవ్స్‌లాండ్‌లో ఎడ్విన్స్ రెస్టారెంట్ ప్రారంభించాడు. అదే ఇప్పుడు వేలమంది నేరస్థుల జీవితాల్లో వెలుగులు నింపుతోంది. నేరాలకు పాల్పడి శిక్ష అనుభవించి వచ్చినవారు సరైన ఉపాధి అవకాశాలు



లభించక, ఉద్యోగాలు ఇచ్చే వాళ్ళు లేక తిరిగి అదే బాట పడుతున్నారు. వక్ర మార్గంలో బతుకుతూ నేరస్థులుగానే మిగిలిపోతుంటారు. చేసిన తప్పులు సరిదిద్దుకునే అవకాశం వాళ్ళకు లభించటం లేదు. ఆ విషయం గ్రహించిన బ్రాండన్ జైలు శిక్ష అనుభవించి, బయటకు వచ్చినవాళ్ళు సమాజంలో గౌరవంగా బతికేలా చేయడమే లక్ష్యంగా కార్యకలాపాలు సాగిస్తున్నాడు. వాళ్ళు సమాజంలో తలెత్తుకుని జీవించేందుకు చేయూతనందిస్తున్నాడు. రెస్టారెంట్ నిర్వహిస్తూ, జైలు నుంచి బయటకు వచ్చినవారి కోసం లీడర్‌షిప్ అండ్ రెస్టారెంట్ ఇనిస్టిట్యూట్ ద్వారా వంటల తయారీ, హోటల్ మేనేజ్‌మెంట్‌లో ప్రత్యేక శిక్షణ ఇస్తున్నాడు. ఆరు నెలల పాటు వారికి శిక్షణ యిచ్చి సొంత రెస్టారెంట్‌లోనే ఉపాధి అవకాశాలు కల్పిస్తున్నాడు బ్రాండన్.

న్యూయార్క్, చికాగో, పారిస్‌లో ఎడ్విన్స్ రెస్టారెంట్ ద్వారా ఇప్పటికే వందలాది మంది హోటల్ మేనేజ్‌మెంట్ డిగ్రీ అందుకున్నారు. ప్రస్తుతం లీడర్‌షిప్ అండ్ రెస్టారెంట్ సంస్థ ద్వారా బయటి కొచ్చిన వారంతా సరికొత్త జీవితం ప్రారంభించి నైపుణ్యం గల నలభీములుగా, ప్రశస్తమైన వంటగాళ్ళుగా గుర్తింపు తెచ్చుకున్నారు. నేరం చేసినవారు ఋజు మార్గంలో జీవించేందుకు సమాజం ఒక్క అవకాశం ఇవ్వాలనే ఆలోచన అందరిలో తీసుకు వచ్చేందుకే బ్రాండన్ ప్రయత్నిస్తున్నాడు. ఒకప్పుడు జైలుశిక్ష అనుభవించినప్పుడు న్యాయమూర్తి ఒక అవకాశమిచ్చి తన జీవితాన్ని మలుపు తిప్పినట్టే తాను కూడా శిక్షపూర్తిచేసి వచ్చినవారికి అవకాశం కల్పిస్తున్నట్లు చెబుతున్నాడు బ్రాండన్. హ్యాట్సాఫ్ టు హిమ్!

నవ్య

# మెయిల్ బాక్స్

### ఆహా! ఓహో!

నవ్య వీక్లీ నవకాంతులు వెదజల్లుతోంది. సహజ సంప్రదాయ రచనలనందిస్తోంది. పాఠక హృదయాలకు ఆహ్లాదం, యువతరానికి ఉత్తేజం, మహిళా లోకానికి మహత్తర ఆదరణ. అక్షరామృతం శర్మగారి సంపాదకీయం. అద్భుతం కవర్‌పేజీ అందం. అందుకే ఈ పలుకులు ఆహా! ఓహో!

*-పువ్వాడ హనుమాన్‌ప్రసాద్, హైదరాబాద్*

### వారం వారం చక్కని కథలు

జయపాల్‌రెడ్డిగారి 'తిరిగిరాద తనే వసంతం' కథ వినూత్నాంశంతో ఆకట్టుకుంది. ఈ కథలో భార్యను కోల్పోయిన చంద్రం పెళ్ళిచూపులకు వెళ్ళి భర్త అకాల మరణంతో ఏకాకిగా మిగిలిన వధువు దీనావస్థను ఆకళించుకుని ఆమెను భార్యగా స్వీకరించడం, ఆ తల్లీకూతుళ్ళకు ఆసరా ఇవ్వడం హృద్యంగా ఉంది. ధీరా ధీరా చక్కని కథాంశంతో ఆకట్టుకుంది. ఈ కథలో యజమాని తీరు ఎంతో ప్రశంసనీయం. వారం వారం ఎంతో మంచి కథలు అందిస్తున్న మీకు ధన్యవాదాలు.

*-సూరినాగరాజు, బెంగళూరు-48*

### అరణి రామాయణం అనితర సాధ్యం

అరణి రామాయణ రచన ఆశ్చర్యం గొలుపుతోంది. త్రేతాయుగంలో జరిగిన రామాయణ ఘట్టాలను నేత్రపర్వంగా, అందులోని వివిధ పాత్రల పేర్లు యథాతథంగా రాస్తున్న ఆయన ప్రతిభ అనితర సాధ్యం. యుద్ధ ఘట్టాలు తెరపై చూపించడం ఒకతీరైతే, పుస్తక రచనలో వాటిని వర్ణించడం సుసాధ్యంగా మలుచుకున్న రచనా పటిమ అరణిగారిదే. ఇంత చక్కని గాథను అందిస్తున్న నవ్య వీక్లీ నిత్య నూతనంగా ఉంటూ చదువరులను ఆకట్టుకోవడం అభినందనీయం.

*-యం.రమణకుమారి, హైదరాబాద్*

### రామరావణ యుద్ధం చూసి ధన్యులమయ్యాం

రామరావణ యుద్ధం కళ్ళకు కట్టినట్టు ప్రత్యక్ష ప్రసారంలో చూపించారు అరణి. ఆ యుద్ధం చూసి ధన్యులమయ్యాం. మొదటిపేజీ కథలో తాళం వేసిన ఇంటిచుట్టూ అల్లుకున్న అనుబంధాలతో మా హృదయాలు ముప్పిగొన్నాయి. నోబెల్‌కథలో ఇద్దరు డాక్టర్లు చిన్నపిల్ల ప్రాణాలు కాపాడిన వైనం ఆదర్శప్రాయం.

*-లక్ష్మీప్రసన్న, పేర్రాజుపేట*

### అవాక్కయ్యాం

మార్నింగ్ కాఫీలో నెయ్యిముసల్ది తెలివితేటలు చదివి అవాక్కయ్యాం. మొదటిపేజీలో తాళం వేసిన ఇల్లు చివరికి ఎవరికి దక్కాలో వారికి దక్కడం కాకతాళీయమైనా సమంజసమే. వెట్టి, హవేలీ సీరియల్స్ మంచిపట్టుమీద కొనసాగుతున్నాయి. చద్దన్నాన్ని ఈ తరంవారికి గుర్తుచేసినట్టయింది. కార్టూన్‌లన్నీ ఆకట్టుకున్నాయి. హన్సిక, కిన్నెరల ఇంటర్వ్యూలు నచ్చాయి.

*-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం*

### మనిషిని కాచివడబోస్తున్న గేమ్ ఆఫ్ లైఫ్

నవ్య వీక్లీ ఎప్పటికీ మా ఫేవరేటే. ఇంటిల్లపాదీ చదువుతాం. దాంతోపాటు కెరీర్ గైడెన్స్ వ్యాసాలు మరీ మరీ ఉపయోగకరంగా ఉన్నాయి.

**గే.మ్.ఆ.ఫ్.లై.ఫ్**

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి

మీరు ప్రచురిస్తున్న గేమ్ ఆఫ్ లైఫ్ జీవితాన్ని కాచివడబోసి చెబుతున్న సారాంశం. ప్రవర్తన, దృక్పథం గురించి చెబుతున్న విషయాలు యువకులే కాదు, అమ్మలూ, నాన్నలూ కూడా చదివి తీరాలి. రచయితకు ధన్యవాదాలు. మరీ ముఖ్యంగా అరణి రామాయణకథ ఎంతో బాగుంటోంది.

*-వల్లీపద్మావతి, సనత్‌నగర్, హైదరాబాద్*

### ఇది లైఫ్ టానిక్

ముఖచిత్రాలు ఆకర్షణీయంగా ఉంటున్నాయి. కార్టూన్లు, జోకులు బాగు బాగు. కథలన్నీ ఓకే. వెట్టి సీరియల్ అదిరింది. కంఠంనేని రాధాకృష్ణమూర్తిగారి గేమ్ ఆఫ్ లైఫ్ నిత్యజీవితంలో ఎలా బతకాలో చెబుతోంది. ఇది లైఫ్ టానిక్ లాంటిది. మన దృక్పథాన్ని ఎలా మార్చుకోవాలో, వ్యక్తిత్వాన్ని, ఆలోచనల్ని ఎలా మెరుగుపరుచుకోవాలో చెబుతున్నారు. సినిమా ఇంటర్వ్యూలు, సురభి వింతలూ బాగుంటున్నాయి.

*-ఎస్.జనార్దనరావు, తాడేపల్లిగూడెం*

### కిన్నెర మాటలు సమంజసమే

కిన్నెర ఇంటర్వ్యూ బాగుంది. చివరిలో ఆవిడ సూచన, సలహా వాస్తవాన్ని ప్రతిబింబించింది. ఆమె కోరినట్లు స్పాట్‌లో డైలాగ్స్ పద్ధతి కాకుండా ముందుగా ప్రిపేర్ అయ్యే అవకాశం ఇస్తే ఆర్టిస్టులు నాలుక్కాలాలపాటు నిలదొక్కుకోగలుగుతారు. ఫ్లాపులూ, అట్టర్‌ఫ్లాపులూ చాలా తగ్గుతాయి.

*-డాక్టర్ ఎం.పురుషోత్తమాచార్య, నల్గొండ*

### ఉత్సాహం ఉప్పొంగింది

మార్నింగ్ కాఫీ చదివాక ఉత్సాహం ఉప్పొంగింది. పెళ్ళికూతురేకాకుండా, కిరాణా దుకాణం ముసలమ్మకూడా సందర్భానికి తగిన తెలివి ప్రదర్శించింది. బాల్యవివాహాన్ని ఎదుర్కొని చదువుకోవాలన్న ఆశయంతో జార్ఖండ్ బాలిక కృషి నిజంగా వావ్ అనిపించింది. మనవైన అన్నింటినీ హేళనచేసే యువత చద్దన్నంలో పోషకాలు చదివి చద్దన్నం అలవాటు చేసుకుంటే బాగుంటుంది.

*-సుభాష్, శ్రీనగర్*

# కూర్చుని తింటే ప్రయోజనాలెన్నో!

కాలం మారిపోయింది. అనేక పద్ధతులు, అలవాట్లలో కూడా మార్పులు వచ్చాయి. అప్పట్లో అందరూ  కలిసి నేలపై కూర్చుని భోజనాలు చేసేవారు. కానీ ఇప్పుడు పెళ్ళిళ్ళు, పేరంటాలు ఏం జరిగినా పంక్తి భోజనాలు కనుమరుగయ్యాయి. బఫే సిస్టమే అన్నిట్లో కనిపిస్తోంది. కనీసం ఇంట్లో కూర్చుని అయినా భోజనాలు చేస్తారా అంటే డైనింగ్‌టేబుల్‌పైనే భోజనాలు చేస్తున్నారు. ఆరోగ్యం సహకరించనివారు తింటున్నారంటే పర్వాలేదు అనుకోవచ్చు కానీ ఆరోగ్యం బాగాలేనివారు, బాగున్నవారు అందరూ డైనింగ్ టేబుల్ ఉపయోగించో లేక బఫేలోనో తినేవారే!

కానీ మన పూర్వీకులు పాటించిన ఈ పద్ధతి చాలా ఉపయోగకరమని ఇటీవలే పరిశోధకులు వెల్లడించారు. మరి నేలపై కూర్చుని తినడం వల్ల కలిగే ప్రయోజనాలేంటో మీరూ చదవండి! వాటిని గుర్తించి కనీసం వీలున్నప్పుడన్నా కింద కూర్చుని తినడానికి ప్రయత్నించండి.

భోజనం చేయడానికి కింద కూర్చున్నప్పుడు కాళ్లు మడిచి సుఖాసనంలో కూర్చుని తింటారు. దీన్నే అర్ధ పద్మాసనం అంటారు. తినే సమయంలో ఈ ఆసనం వేయడం వల్ల జీర్ణక్రియ మెరుగు పడుతుందట.

తినే కంచం నేలపై ఉండడం వల్ల మన శరీరం ఆహారం తీసుకోవడానికి కిందకు వంగుతుంది. తీసుకున్న తర్వాత మళ్లీ వెనక్కు వస్తుంది. ఇలా ముందుకూ వెనక్కీ వంగడం వల్ల పొట్టలో ఉన్న కండరాలు యాక్టివ్ అవుతాయి. దీనివల్ల ఆహారం త్వరగా సులువుగా జీర్ణ మవుతుంది.



ఇలా నేలపై కూర్చుని తినడం వల్ల విస్తరిలో ఉన్న ఆహారపదార్థాలపైనే మన మెదడు ప్రధానంగా దృష్టి కేంద్రీకరిస్తుంది. దీనివల్ల ఎంత పరిమాణంలో తింటున్నామన్న అవగాహన మనకు ఏర్పడుతుంది. ఇలా ఇష్టపూర్వకంగా ఆహారాన్ని ఆస్వాదిస్తూ తినగలుగుతామని పరిశోధనల్లో తేలింది.

పద్మాసనంలో కూర్చుని తినడం వల్ల నడుము కింద భాగం, పొట్ట చుట్టూ ఉన్న కండరాల నొప్పులు తగ్గుతాయి. జీర్ణవ్యవస్థ రిలాక్స్‌గా ఉండేందుకు సహాయపడుతుంది.

ఇలా రోజూ కిందకూర్చుని తింటే కండరాలు, కీళ్లపై ఒత్తిడి తగ్గుతుందట. నడుము నొప్పి కూడా తగ్గుతుంది.

నేలపై కూర్చుని తినడం వల్ల ఎక్కువకాలం బతుకుతారట. అవునండీ, చాలా రకాల అధ్యయనాలు ఈ విషయాన్ని నిరూపించాయి. ఎలాంటి ఆధారం లేకుండా సుఖాసనాన్ని పద్మాసనాన్ని మనకు తెలియకుండా వేస్తాం. దీనివల్ల జీవనప్రమాణ రేటు పెరుగుతుందని పరిశోధనలు వెల్లడించాయి.

నేలపై తినడం వల్ల గుండెకు రక్తప్రసరణ బాగా జరుగుతుంది. అదే డైనింగ్ టేబుల్ లేదా చెయిర్‌పై కూర్చుని తింటే రక్తప్రసరణ గుండెకి సరిగ్గా ఉండదట.

అయితే ఆరోగ్యం సహకరించిన వారు మాత్రమే నేలపై కూర్చుని భోజనం చేయడం మంచిది. లేకుంటే ఇతరత్రా సమస్యలను కొనితెచ్చుకున్నవారవుతారు.

నేలపై కూర్చుని అందరితో కలిసి తినడం వల్ల సామాజిక అనుబంధాలు విస్తరించి ఆహ్లాదకరమైన వాతావరణం ఏర్పడుతుంది. మానసిక ప్రశాంతత కలుగుతుంది. ఈ విషయాన్ని కూడా అనేక రకాల పరిశోధనలు వెల్లడించాయి.

అంతేకాదు మోదుగ, అరటి లాంటి ఆకుల్లో భోజనం చేయడం వల్ల రకరకాల పోషకాలు అందడమే కాదు తినే పదార్థాల్లో ఏవైనా విషతుల్యమైనవి ఉంటే వెంటనే తెలిసిపోతుందట కూడా. పైగా ప్లాస్టిక్ కన్నా పర్యావరణానికి రక్షణ కలిగించే ఇలాంటి ఆకుల్లో తినడమే బెటర్!

నవ్య



ఆగస్టు 12న వరలక్ష్మీవ్రతం సందర్భంగా...

# సౌభాగ్యప్రదం వరలక్ష్మీవ్రతం

## శ్రీ వరలక్ష్మీ వ్రత కల్పము

ఓం సిద్ధి బుద్ధి సమేత శ్రీ మహాగణాధిపతయే నమః
ఓం లక్ష్మీ నారాయణాభ్యాం నమః
ఓం ఉమామహేశ్వరాభ్యాం నమః
ఓం వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః
ఓం శచీపురంధరాభ్యాం నమః
ఓం మాతాపితృచరణ కమలేభ్యో నమః
ఓం కులదేవతాభ్యో నమః
ఓం ఇష్టదేవతాభ్యో నమః
ఓం స్థాన దేవతాభ్యో నమః
ఓం వాస్తు దేవతాభ్యో నమః
ఓం సర్వేభ్యో దేవేభ్యో నమః
ఓం సర్వేభ్యో బ్రాహ్మణేభ్యో నమః

ఏవంగుణ విశేషణ విశిష్టాయామస్యాం, శుభ తిథౌ, అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం సత్సం తాన సౌభాగ్య శుభఫలా వాప్త్యర్థం వర్షే వర్షే ప్రయుక్తాం వరలక్ష్మీ ముద్దిశ్య వరలక్ష్మీ ప్రీత్యర్థం భవి ష్యోత్తర పురాణ కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే, తదం గత్వేన కలశపూజాం కరిష్యే.

### ఏవం కలశపూజా

కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలేతత్ర స్థితో బ్రహ్మమధ్యేమాతృగణాఃస్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేదస్సామవేదోహ్యథర్వణః
అంగైశ్చ సహిత స్సర్వే కలశాంబు సమాశ్రితాః

ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావాపః పశవ ఆపోన్న మాపోమృత మాపస్స మ్రడాపో విరాడాప స్స్వరాడాపశ్చందాగ్ం స్యాపో జ్యోతిగ్ష్యాపో యజూగ్ంష్యాప స్సత్యమాప స్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్

ఆయాంతు లక్ష్మీ పూజార్థం దురితక్షయకారకాః
గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు



**ధ్యానం**

సహస్రదళ పద్మాస్యాం స్వస్థాంచ సుమనోహరాం
శాంతాంచ శ్రీహరేః కాంతాం తాం భజే జగతాం ప్రసూం
పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణప్రియే దేవి సుప్రీతాభవ సర్వదా
క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలాలయే
సుస్థిరా భవ మే గేహే సురాసుర నమస్కృతే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి

**ఆవాహనం**

సర్వమంగళ మాంగళ్యే విష్ణువక్షస్థలాలయే
ఆవాహయామి దేవి త్వాం సుప్రీతాభవ సర్వదా
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఆవాహయామి, ఆవాహనం సమర్పయామి

**రత్నసింహాసనం**

సూర్యాయుత నిభస్ఫూర్తే స్ఫురద్రత్న విభూషితే
సింహాసన మిదం దేవి స్థీయతాం సురపూజితే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః రత్నసింహాసనం సమర్పయామి

**అర్ఘ్యం**

శుద్ధోదకం చ పాత్రస్థం గంధ పుష్పాది మిశ్రితం
అర్ఘ్యం దాస్యామితే దేవి గృహాణ సురపూజితే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః అర్ఘ్యం సమర్పయామి

**పాద్యం**

సువాసిత జలం రమ్యం సర్వతీర్థ సముద్భవం
పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవ సమస్కృతే
శ్రీవరలక్ష్మీ దేవాతాయై నమః పాద్యం సమర్పయామి

**ఆచమనీయం**

సువర్ణకలశానీతం చందనాగరు సంయుతం
గృహాణాచమనం దేవి మయాదత్తం శుభప్రదే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఆచమనీయం సమర్పయామి

**పంచామృతం**

పయోదధిఘృతోపేతం శర్కరామధు సంయుతం
పంచామృతస్నానమిదం గృహాణ కమలాలయే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః పంచామృత స్నానం సమర్పయామి

**శుద్ధోదక స్నానం**

గంగాజలం మయానీతం మహాదేవశిరః స్థితం
శుద్ధోదక స్నానమిదం గృహాణ విధుసోదరి
శ్రీవరలక్ష్మీ దేవతాయైనమః స్నానం సమర్పయామి

**వస్త్రయుగ్మం**

సురార్చితాంఘ్రియుగళే దుకూలవసనప్రియే
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ హరివల్లభే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః వస్త్రయుగ్మం సమర్పయామి

**ఆభరణం**

కేయూర కంకణే దివ్యే హారనూపురమేఖలాః
విభూషణాన్య ముల్యాని గృహాణ ఋషి పూజితే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఆభరణాని సమర్పయామి

**ఉపవీతం**

తప్తహేమకృతం సూత్రం ముక్తాదామ విభూషితం
ఉపవీతమిదం దేవి గృహాణ త్వం శుభప్రదే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఉపవీతం సమర్పయామి

**గంధం**

కర్పూరాగరుకస్తూరీ రోచనాది భిరన్వితం
గంధం దాస్యామ్యహం దేవి ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం
శ్రీవరలక్ష్మీ దేవాతయై నమః గంధం సమర్పయామి

**పుష్పపూజ**

మల్లికా జాజికుసుమై చంపకైర్వకుళైస్తథా
శతపత్రైశ్చ కల్హారైః పూజయామి హరిప్రియే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః పుష్పాణి సమర్పయామి

## అథాంగపూజ

| | |
|---|---|
| ఓం చంచలాయై నమః | పాదౌ పూజయామి |
| ఓం చపలాయై నమః | జానునీ పూజయామి |
| ఓం పీతాంబరధరాయై నమః | ఊరుః పూజయామి |
| ఓం కమలవాసిన్యై నమః | కటిం పూజయామి |
| ఓం పద్మాలయాయై నమః | నాభిం పూజయామి |
| ఓం మదనమాత్రే నమః | స్తనౌ పూజయామి |
| ఓం లలితాయై నమః | భుజద్వయం పూజయామి |
| ఓం కంబుకంఠ్యై నమః | కంఠం పూజయామి |



| | |
|---|---|
| ఓం శ్రియై నమః | ఓష్ఠౌ పూజయామి |
| ఓం సుముఖాయై నమః | ముఖం పూజయామి |
| ఓం సునాసికాయై నమః | నాసికాం పూజయామి |
| ఓం సునేత్రాయై నమః | నేత్రే పూజయామి |
| ఓం రమాయై నమః | కర్ణౌ పూజయామి |
| ఓం కమలాయై నమః | శిరః పూజయామి |
| ఓం వరలక్ష్మై నమః | సర్వాణ్యంగాని పూజయామి |

## శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామావళిః

ఓం ప్రకృత్యై నమః
ఓం వికృత్యై నమః
ఓం విద్యాయై నమః
ఓం సర్వభూత హితప్రదాయై నమః
ఓం శ్రద్ధాయై నమః
ఓం విభూత్యై నమః
ఓం సురభ్యై నమః
ఓం పరమాత్మికాయై నమః
ఓం వాచే నమః
ఓం పద్మాలయాయై నమః
ఓం పద్మాయై నమః
ఓం అనఘాయై నమః
ఓం హరివల్లభాయై నమః
ఓం అశోకాయై నమః
ఓం అమృతాయై నమః
ఓం దీప్తాయై నమః
ఓం లోకశోక వినాశిన్యై నమః
ఓం ధర్మనిలయాయై నమః
ఓం కరుణాయై నమః
ఓం లోకమాత్రే నమః
ఓం పద్మప్రియాయై నమః
ఓం పద్మహస్తాయై నమః
ఓం పద్మాక్ష్యై నమః
ఓం పద్మసుందర్యై నమః
ఓం పద్మముఖ్యై నమః
ఓం పద్మనాభ ప్రియాయై నమః
ఓం రమాయై నమః
ఓం పద్మమాలాధరయై నమః
ఓం దేవ్యై నమః
ఓం పద్మిన్యై నమః
ఓం పద్మగంధిన్యై నమః
ఓం పుణ్యగంధాయై నమః
ఓం సుప్రసన్నాయై నమః
ఓం ప్రసాదాభిముఖ్యై నమః
ఓం శుచయై నమః
ఓం స్వాహాయై నమః
ఓం సుధాయై నమః
ఓం ధన్యాయై నమః
ఓం హిరణ్మయ్యై నమః
ఓం లక్ష్మై నమః
ఓం నిత్యపుష్టాయై నమః
ఓం విభావర్యై నమః
ఓం ఆదిత్యై నమః
ఓం దిత్యై నమః
ఓం వసుధాయై నమః



ఓం వసుధారిణ్యై నమః
ఓం చంద్రవదనాయై నమః
ఓం చంద్రాయై నమః
ఓం చంద్ర సహోదర్యై నమః
ఓం చతుర్భుజాయై నమః
ఓం చంద్రరూపాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం ఇందు శీతలాయై నమః
ఓం ఆహ్లాద జనన్యై నమః
ఓం పుష్ట్యై నమః
ఓం శివాయై నమః
ఓం శివకర్యై నమః
ఓం సత్యై నమః
ఓం విమలాయై నమః
ఓం విశ్వజనన్యై నమః
ఓం తుష్ట్యై నమః
ఓం దారిద్ర్యనాశిన్యై నమః
ఓం ప్రీతి పుష్కరిణ్యై నమః
ఓం శాంతాయై నమః
ఓం శుక్లమాల్యాంబరాయై నమః
ఓం శ్రియై నమః
ఓం భాస్కర్యై నమః
ఓం బిల్వనిలయాయై నమః
ఓం వరారోహాయై నమః
ఓం యశస్విన్యై నమః
ఓం వసుంధరాయై నమః
ఓం ఉదారాంగాయై నమః
ఓం హరిణ్యై నమః

ఓం హేమమాలిన్యై నమః
ఓం ధనధాన్యకర్యై నమః
ఓం సిద్ధయే నమః
ఓం స్త్రైణ సౌమ్యాయై నమః
ఓం శుభప్రదాయై నమః
ఓం నృపవేశ్మ గతానందాయై నమః
ఓం వరలక్ష్మై నమః
ఓం వసుప్రదాయై నమః
ఓం ప్రభాయై నమః
ఓం హిరణ్య ప్రాకారాయై నమః
ఓం సముద్ర తనయాయై నమః
ఓం జయాయై నమః
ఓం మంగళాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం విష్ణు వక్షః స్థల స్థితాయై నమః
ఓం ఓం విష్ణుపత్న్యై నమః
ఓం ప్రసన్నాక్ష్యై నమః
ఓం నారాయణ సమాశ్రితాయై నమః
ఓం దారిద్ర ధ్వంసిన్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం సర్వోపద్రవవారిణ్యై నమః
ఓం నవదుర్గాయై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం బ్రహ్మవిష్ణు శివాత్మికాయై నమః
ఓం త్రికాలజ్ఞాన సంపన్నాయై నమః
ఓం భువనేశ్వర్యై నమః
ఓం శ్రీ దేవ్యై నమః

లక్ష్మీ అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి
ఇతి లక్ష్మి అష్టోత్తర శత నామావళిః సమాప్తః

**ధూపం** దశాంగం గుగ్గులోపేతం సుగంధం చ సుమనోహరం
ధూపం దాస్యామి దేవేశి వరలక్ష్మి గృహాణతం
శ్రీవరలక్ష్మీ దేవాతాయై నమః ధూపం సమర్పయామి

**దీపం** ఘృతవర్తి సమాయుక్తం అంధకార వినాశకం
దీపం దాస్యామితే దేవిగృహాణ ముదితాభవ
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః దీపం సమర్పయామి

**నైవేద్యం** నైవేద్యం షడ్రసోపేతం దధి మధ్వాజ్యసంయుతం
నానాభక్ష్యఫలోపేతం గృహాణ హరివల్లభే..
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః నైవేద్యం సమర్పయామి

**పానీయం** ఘనసారసుగంధేన మిశ్రితం పుష్పవాసితం
పానీయం గృహ్యతాం దేవి శీతలం సుమనోహరం
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః పానీయం సమర్పయామి

**తాంబూలం** పూగీఫలసమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం
కర్పూర చూర్ణసంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతాం
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః తాంబూలం సమర్పయామి

**మంత్రపుష్పం** పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణప్రియే దేవి సుప్రీతాభవ సర్వదా
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః అష్టోత్తర మంత్ర
పుష్పం సమర్పయామి

**ప్రదక్షిణ నమస్కారాన్** యానికానిచ పాపాని జన్మాంతరకృతాని చ
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే
నమస్తే లోకజననీ నమస్తే విష్ణువల్లభే
పాహిమాం భక్త వరదే వరలక్ష్మీ నమోనమః
శ్రీ వరలక్ష్మీ దేవతాయై నమః ప్రదక్షిణ
నమస్కారాన్ సమర్పయామి

## అథ తోరగ్రంథి పూజ

| | | |
|---|---|---|
| కమలాయై నమః | ప్రథమ గ్రంధిం | పూజయామి |
| రమాయై నమః | ద్వితీయ గ్రంధిం | పూజయామి |
| లోకమాత్రే నమః | తృతీయ గ్రంధిం | పూజయామి |
| విశ్వజనన్యై నమః | చతుర్థ గ్రంధిం | పూజయామి |
| మహాలక్ష్మ్యైనమః | పంచమ గ్రంధిం | పూజయామి |
| క్షీరాబ్ధి తనయాయై నమః | షష్టి గ్రంధిం | పూజయామి |
| విశ్వసాక్షిణ్యై నమః | సప్తమ గ్రంధిం | పూజయామి |
| చంద్రసోదర్యై నమః | అష్టమ గ్రంధిం | పూజయామి |
| హరివల్లభాయై నమః | నవమ గ్రంధిం | పూజయామి |

**తోరబంధన మంత్రం:** బధ్నామి దక్షిణేహస్తే నవసూత్రం శుభప్రదం
పుత్ర పౌత్రాభి వృద్ధించ సుసౌఖ్యం దేహిమే రమే..

**వాయనవిధి** : ఏవం సంపూజ్య కళ్యాణీం వరలక్ష్మీ స్వశక్తితః
దాతవ్యం ద్వాదశాపూపం వాయనం హి ద్విజాయతే

**వాయనదానమంత్రః:** ఇందిరా ప్రతిగృహ్ణాతు ఇందిరావై దదాతిచ
ఇందిరా తారాకోభాభ్యాం ఇందిరాయై నమోనమః

## వరలక్ష్మీ వ్రత కథ

ఇది తరతరాలనుంచి భారతీయ సంప్రదాయంలో కలిసిపోయిన వరలక్ష్మీ వ్రత కథ. స్త్రీలకు సౌభాగ్యాన్ని ప్రసాదించే ఈ వ్రతాన్ని గురించి కైలాసంలో శివుడు పార్వతికి చెప్పాడు. భగవత్ సమానులైన ఋషుల ద్వారా ఈ కథ భూలోక వాసులకు తెలిసింది. నాటినుంచి ఏటా కోట్లాది మంది ముత్తైదువులు శ్రావణ శుక్రవార నోము నోచిన రోజు వరలక్ష్మీ వ్రత కథను పారాయణం చేస్తున్నారు.

ఈ కథను శౌనకాది మహామునులకు సూతపౌరాణికుడు చెప్పాడు.

"స్త్రీలకు వరలక్ష్మీ వ్రతం సౌభాగ్యాన్ని కలుగ చేస్తుంది. ఈ శుభ కరమైన వ్రతాన్ని శ్రావణ శుక్లపక్ష పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారం రోజున చేయాలి" అని పార్వతీదేవికి పరమేశ్వరుడు చెప్పాడు. పార్వతీ దేవికి వరలక్ష్మీ వ్రతం గురించి ఇలా చెప్పాడు.

# వ్రత విధానం



వరలక్ష్మీ వ్రతం ఆచరించే రోజు ఉదయాన్నే తల స్నానం చేసి ఇంటిని శుభ్రం చేసుకోవాలి. ఇంట్లోని పూజ గదిలో కానీ గదిలో ఒక మూల గానీ మండపం ఏర్పాటు చేసుకోవాలి. ఈ మండపం పైన బియ్యపు పిండితో ముగ్గు వేసి కలశం ఏర్పాటు చేసుకోవాలి. తోరాలు, అక్షతలు, పసుపు గణపతిని, పూజా సామాగ్రి సిద్ధం చేసుకుని అమ్మవారి ఫోటో మండపంలో ఉంచాలి.

**కావలసిన వస్తువులు**

పసుపు, కుంకుమ, ఎర్రటి జాకెట్టు బట్ట, గంధము, పూలు, పండ్లు, ఆకులు, వక్కలు, తోరానికి అవసరమైన దారము, టెంకాయలు, దీపపు కుందులు, ఐదు వత్తులతో హారతి ఇవ్వడానికి అవసరమైన పంచహారతి, దీపారాధనకు నెయ్యి, కర్పూరం, అగరవత్తులు, బియ్యము, శనగలు.

**తోరం ఇలా తయారు చేసుకోవాలి**

తెల్లటి దారాన్ని ఐదు లేక తొమ్మిది పోగులు తీసుకొని దానికి పసుపు రాసుకోవాలి. ఆ దారమునకు ఐదు లేక తొమ్మిది పువ్వులతో ఐదు లేక తొమ్మిది ముడులతో తోరాలను తయారు చేసుకొని పీఠం వద్ద ఉంచుకోవాలి. పసుపు, కుంకుమ, అక్షతలు వేసి తోరాలను పూజించాలి. ఈ విధంగా తోరాలను పూజించిన అనంతరమే పూజకు ఉపక్రమించాలి.

"ఓ పార్వతీ, వరలక్ష్మీ కథను చెబుతున్నాను. శ్రద్ధగా విను. మగధ దేశంలో కుండినంబ అనే పట్టణంలో చారుమతి అనే బ్రాహ్మణ స్త్రీ ఉండేది. ఆమె భర్తనే దైవంగా భావించుకునేది. ప్రతి రోజూ తెల్లవారు జామునే నిద్ర లేచి స్నానాదులు పూర్తి చేసి భర్తను పూలతో పూజించేది. అనంతరం అత్త మామలను సేవిస్తూ, ఇరుగు పొరుగు వారితో స్నేహంగా ఉంటూ జీవనం సాగించేది.

చారుమతికి ఒక రోజు కలలో వరలక్ష్మీదేవి కనిపించి "నేనమ్మా.. వరలక్ష్మీదేవిని. నీ భక్తికి ప్రసన్నురాలినై ప్రత్యక్షమయ్యాను. శ్రావణ శుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం రోజున నన్ను భక్తితో సేవిస్తే నీ కోరికలు నెరవేరుస్తాను" అని చెప్పింది.

చారుమతి ఆనందంగా భక్తిభావంతో వరలక్ష్మీదేవికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి -

"నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే
శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాలయే

ఓ జగన్మాతా! నీ దయ వలన ప్రజలు ధనధాన్య సంపన్నులు అవుతున్నారు. విద్వాంసులై సకల శుభాలు అందుకుంటున్నారు. నేను గత జన్మలలో చేసిన పుణ్యఫలంగా నీ దర్శన భాగ్యం కలిగింది. ఇక నా జన్మ ధన్యమైంది" అంది కలలోనే.

చారుమతి భక్తికి వరలక్ష్మీదేవి మెచ్చి అనేక వరాలు అనుగ్రహించి అంతర్ధానమైంది.

చారుమతి నిద్రనుంచి లేవగానే తనకు వరలక్ష్మీదేవి ప్రత్యక్షమై వరాలు ఇచ్చిన విషయం గుర్తు వచ్చింది. కలలో తనకు వరలక్ష్మీదేవి చెప్పిన విషయాలను అత్తమామలకును, ఇరుగుపొరుగు వారితోనూ చెప్పింది. శ్రావణ మాసం రాగానే వరలక్ష్మీ వ్రతం సంప్రదాయబద్ధంగా చేద్దామని చెప్పింది.



చారుమతి చెప్పినప్పటి నుంచి స్త్రీలు శ్రావణమాసం కోసం ఎదురు చూడడం ప్రారంభించారు. కొంతకాలం తర్వాత వీరు ఎదురు చూస్తున్న శ్రావణమాసం వచ్చింది. ఆ నెలలో పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారాన్ని వరలక్ష్మీదేవి చెప్పిన రోజుగా భావించారు. ఆ రోజు తెల్లవారు జామునే లేచి స్నానాదులు పూర్తి చేశారు. కొత్త దుస్తులు కట్టుకున్నారు. పూజగదిలో పీట వేసి దానిపైన బియ్యం పోశారు. అందులో కలశం ఏర్పాటు చేసి వరలక్ష్మీ దేవిని ఆవాహన చేశారు.

ఆ రోజు సాయంత్రం చారుమతి తోటి స్త్రీలతో కలసి "పద్మాసనే పద్మకరే సర్వలోక పూజితే నారాయణప్రియే దేవి సుప్రీతా భవసర్వదా" అని ధ్యానించి వరలక్ష్మీ దేవిని ఆవాహన చేసింది. షోడశోపచార పూజలు పూర్తి చేసి తొమ్మిది సూత్రాలున్న పసుపు దారాలను ధరించింది. పలు రకాల భక్ష్యభోజ్యాలను వరలక్ష్మీదేవికి నివేదించి ప్రదక్షిణలు చేసింది.

ఇలా మొదటి ప్రదక్షిణ పూర్తికాగానే ఆ స్త్రీలందరి కాళ్లలో ఘల్లు ఘల్లుమనే శబ్దం వినిపించింది. ఆ స్త్రీలందరూ ఆశ్చర్యంగా తమ కాళ్లవైపు చూసుకున్నారు. వారి కాళ్లకు గజ్జెలున్నాయి. ఇది వరలక్ష్మీదేవి కటాక్షమేనని చారుమతి, మిగిలిన స్త్రీలు చాలా సంతోషించారు. రెండవ ప్రదక్షిణ చేయగా వాళ్ల చేతులకు నవరత్నాలు పొదిగిన బంగారు ఆభరణాలు వచ్చాయి. మూడవ ప్రదక్షిణతో వారికి సర్వాలంకారాలు అమరాయి. చారుమతి ఇల్లు మొత్తం బంగారము, రథ, గజ, తురగ వాహనాలతో, సౌభాగ్యంతో నిండిపోయింది.

వ్రతంలో పాల్గొన్న స్త్రీలను తీసుకుపోవటానికి గుర్రాలు, ఏనుగులు, రథాలు వచ్చి చారుమతి ఇంటివద్ద నిలిచాయి. తమచేత శాస్త్ర ప్రకారం వ్రతం చేయించిన బ్రాహ్మణోత్తముని గంధం, పుష్పాలతో పూజించారు. దక్షిణ, తాంబూలము, పన్నెండు భక్ష్యములు వాయనం ఇచ్చి ఆశీర్వాదం పొందారు. వరలక్ష్మీదేవికి నివేదన చేసిన భక్ష్యభోజ్యాలను బంధువులతో కలసి భుజించాక వాహనాలలో స్త్రీలు తమ తమ ఇళ్లకు వెళ్లిపోయారు.

ఆ రోజునుంచి చారుమతితో పాటు పలువురు స్త్రీలు ప్రతి సంవత్సరం వరలక్ష్మీదేవిని పూజిస్తూ, సకల సంపదలతో సుఖంగా ఉన్నారు. ఈ వ్రతం చేసిన వారికి సర్వసంపదలు కలుగుతాయి. ఈ వ్రతాన్ని అన్ని కులాల వారూ చేయవచ్చు. ఈ కథను విన్నవారికీ, చదివిన వారికి వరలక్ష్మీదేవి అనుగ్రహం లభించి సకల శుభాలు కలుగుతాయి. ఇది సౌభాగ్య దాయకం. సర్వరోగాలు, సకల రుణాలు హరించి సర్వత్రా రక్ష చేకూరుతుంది." అని పార్వతీదేవికి చెప్పాడు శివుడు.

(ఈ కథ అనంతరం అక్షతలు శిరస్సున ధరించి, పసుపు కుంకుమలను గడప మధ్యలో పెట్టాలి)

# గోచరం

సింహాప్రసాద్



"ముబారక్‌హో సలీంభాయ్"

ఆర్టీసీ బస్‌డిపోలో అడుగుపెట్టానో లేదో మిత్రుడు బ్రహ్మం ఎదురొచ్చి నన్ను సంబరంగా గుండెలకు హత్తుకున్నాడు.

మిగతా సహోద్యోగులూ వచ్చి అభినందనలతో ముంచెత్తారు. వారి ప్రేమాభిమానాలలో తడిసి ముద్దవుతూ మిఠాయిలు పంచాను.

"తల్లీ బిడ్డా బావున్నారు కదా!" అడిగారొకరు.

"చక్కగా ఉన్నారు. కడప అమీన్‌పీర్ దర్గా దర్శించి వచ్చాం. మా ముంతాజ్ కడుపు పండింది. పండంటి మగ బిడ్డ పుట్టాడు" అక్షరాలా గాలిలో తేలిపోతూ వివరంగా చెప్పాను.

నా ఆనందాన్ని మాటల్లో వర్ణించలేను.

నాకు పెళ్లై పదకొండేళ్ళయ్యింది. ఇక పిల్లలు పుట్టరనే అనుకున్నాం. ఇన్నేళ్ళూ దిగులు దిగ మింగుతూ వస్తున్నాం. మా ఊరెళ్ళినప్పుడల్లా ఇంకో నిఖా చేసుకోమని అమ్మీజాన్ గోల చేసేది. "ఈ జన్మకి ముంతాజ్ ఒక్కతే" అని తెగేసి చెప్పే వాణ్ణి.

అసలు ముంతాజ్‌ని ముందుగా చూడ కుండానే కేవలం పేరు వినే షాదీకి ఒప్పుకున్నా.

# నవ్యవీక్లి- నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కథ

"సలీం ముంతాజ్‌ని గాక ఇంకెవర్ని పెళ్లి చేసు కుంటాడు" అని నవ్వారు కజిన్స్.

ఆర్టీసీ డ్రైవర్ని అయినా నన్నో హీరోగా భావిస్తూ ఉంటుంది నా బేగమ్. నా మీద ఈగని కూడా వాలనివ్వదు. నాకు తలనొప్పి వస్తే నాకన్నా ముందుగా తనకి తెలిసిపోతుంది. జండూ బామ్‌తో ప్రత్యక్షమవుతుంది.

ఏమైతేనేం మా తపన, తపస్సు ఇన్నేళ్ళకి ఫలిం చాయి. నిన్న ఆసుపత్రిలో బిడ్డనీ నన్నూ హత్తు కుని ముంతాజ్ ఎన్ని కడవల ఆనందబాష్పాలు రాల్చిందో చెప్పలేను!

"నీ కొడుకు గురించి ఊహలల్లుకుంటూ కూర్చుంటే కాదు, మాకు దావత్ ఇవ్వాల్సిందే" అన్నాడు బ్రహ్మం.

"మేమిద్దరం తరచూ 27వ నెంబరు రూట్‌కి డ్రైవరూ కండక్టర్లుగా వెళ్తుంటాం.

"ఏం కావాలో చెప్పు భాయ్, అరేంజ్ చేసేస్తా".

"రంజాన్ మాసంలో హలీం తినిపించు" అన్నాడు కళ్ళు చికిలించి నవ్వుతూ.

"నువ్వు తినాలిగాని రోజూ తెచ్చిపెట్టనూ! ఈ మధ్య వెజిటేరియన్ హలీం తయారుచేస్తున్నారు. ఈసారి తినిపిస్తాలే"

నా మాటలకు ఖుష్ అయిపోయాడు. "ఆ మాట చాలు. తినేసినంత హ్యాపీగా ఉంది సలీం".

"డ్యూటీకి టైమవుతోంది పద.."

ఇద్దరం 27వ నెంబరు బస్సెక్కాం.

బస్‌స్టేజిల దగ్గర యాంత్రికంగా బ్రేకు వేస్తు న్నాను. మళ్ళీ ముందుకు దూకిస్తున్నాను. నా మనసంతా ఆసుపత్రిలో ఉన్న ముంతాజ్ మీదా, జాండీస్ వచ్చిందని చెప్పి ప్రత్యేక కేర్‌లో ఉంచిన నా చిన్నారి బిడ్డ మీదా ఉంది.

నా బుజ్జికొండకి ఎంచక్కని బట్టలు కొనాలి. ఎన్నో బొమ్మలు కొనాలి. వాడి బోసి నవ్వులు చూసి మురిసి పోవాలి. ముంతాజ్ వాడికి పాలు ఇస్తూ ఫోజు కొడుతోంటే, చందమామను చూపించి గోరు ముద్దలు తినిపిస్తోంటే, లాలిపాటలు పాడి నిద్రపుచ్చు తోంటే, వాడినీ వాడి ముద్దు మోమునీ, వాడి ఎదుగు దలనీ చూసి ఆకాశం అందినట్టు పొంగిపోవాలి.

వాడు మాకు లభించిన బంగారు వరం! మా ఆశాదీపం! ఆనంద పథం!

అకస్మాత్తుగా ఏవో కేకలు విన్పించాయి. ఇహానికొస్తూనే సడన్ బ్రేకు వేశాను. టైరు కింద ఏదో పడింది. బస్సులోంచి అమాంతం కిందకి దూకాను.

ముందు చక్రం కింద రక్తపు మడుగులో ఆవుదూడ...!

గుండెల్లో పదివేల పర్వతాలు ఒకేసారి బద్దలయ్యాయి. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. వజ వజ వణుకుతూ గుండెలు చిక్కబట్టుకుంటూ చూశాను.

నుదుట బొట్టులా నారింజరంగు మచ్చ ఉన్న ఆ దూడ కళ్ళు నా వంకే - కాదు నన్నే చూస్తు న్నాయి!

దాని కళ్ళనుండి కన్నీరు కారటం ఆగింది. నా గుండెల మీద ఆమ్లవర్షం కురవటం మొదలైంది!

ఆ దారుణ బీభత్స దృశ్యం చూడలేక ఎడంగా జరిగాను. నా కళ్ళల్లో గంగా గోదావరి పొంగు తున్నాయి.

జనం పోగవుతున్నారు. పక్కనేగల కాయ గూరల మార్కెట్ నుంచి మరెందరో గబగబా వస్తున్నారు. 'ఘోరం!' 'దారుణం' 'కళ్ళు మూసు కుని డ్రైవ్ చేశాడు!' 'కలికాలం!' 'పాపం కాదు పాతకం!'

జనం రకరకాల వ్యాఖ్యానాల ఈటెలు విసురుతోంటే, బ్రహ్మం గబగబా వచ్చి నన్ను దూరంగా తీసుకుపోయాడు.



"పెద్దఘోరం జరిగిపోయింది..." ఏడ్చేశాను.

ఇంతలో తల్లి ఆవు 'అంబా' అని అరుస్తూ అక్కడికి వచ్చింది. తుళ్ళిపడి చూశాం. బస్సు చక్రం కింద చలనరహితంగా పడి ఉన్న బిడ్డని చూసి స్థాణువయింది. హోరెత్తి దిక్కులు పిక్కటిల్లేలా ఆర్తనాదాలు చేసింది.

నా గుండెల్ని మొండికత్తితో కసబిసా పొడి చేస్తున్నంత బాధ! సుళ్ళు తిరిగిపోయాను!

'అటు చూడకు సలీం. ఇక్కడుంటే ప్రమాదం. వెళ్ళిపో. నేను చూసుకుంటాగా. త్వరగా వెళ్ళిపో.'

ప్రజల మత విశ్వాసానికి దెబ్బతగిలితే ఏం జరిగేది ఊహించగలను. ఆవు దూడ మరణానికి ఒక ముస్లిం డ్రైవరే కారణమని తెలిస్తే ఇంకేమైనా ఉందా! మిన్ను విరిగి మీద పడటం ఖాయం!

గబగబా నడుస్తున్నాను. ఎటు వెళ్తున్నానో కూడా పట్టించుకోలేదు.

మసీదు కన్పించింది. శుక్రవారం... నమాజ్ టైమ్...

జేబులోంచి టోపీ తీసి తలకి పెట్టుకుని లోపలి కెళ్ళాను. రొటీన్‌గా ప్రార్థించాను గాని ఏకాగ్రత కుదర్లేదు. ఏవో కళ్ళు వెంటాడుతున్నట్టు... ఏదో అశాంతి! మరేదో అంతఃఘర్షణ!

తెలియక చేసిన నేరాన్ని మన్నించమని అల్లాని అశ్రునయనాలతో వేడుకున్నాను.

ఏదో తెలీని ధైర్యం వచ్చింది. తిన్నగా పోలీస్ స్టేషన్ కెళ్ళాను.

"సిటీ బస్సు డ్రైవర్ని. యాక్సిడెంటు చేశాను" ఇన్‌స్పెక్టర్ ఎదుటికెళ్ళి చెప్పాను.

నిలువునా కంపిస్తోన్న నా వంక చూసి పీసీకి సైగచేశాడు. అతడు మంచినీళ్ళు తెచ్చివ్వగా ఒక్క గుక్కలో తాగేశాను.

"ప్రాణం పోయిందా?"

తలాడించాను.

సర్రుమని కోపం దూసుకురాగా కళ్ళు మూసుకుని నా మీద పడ్డాడు. "నువ్వు మనిషివా దున్నపోతువా? గుద్దితే ప్రాణాలు పోతాయన్న జ్ఞానం లేకుండా ర్యాష్‌గా బస్సు తోల్తావా? ఫుల్లుగా తాగావా? ఒక మనిషి నిండు ప్రాణం నిలువునా తీసేయడానికి నీకు చేతులెలా వచ్చాయిరా?"

"మనిషి కాదు సార్, ఆవు దూడ.." తడబడుతూ చెప్పాను.

పరమాశ్చర్యపోయాడు. పిమ్మట మిర్రి చూశాడు. రిలీఫ్‌గా ఫీలయ్యాడు. "దానికే మర్డర్ చేసినట్టు వణికిపోతున్నావా?" తలొంచుకున్నాను.

"రిపోర్టు రాసియ్యి.."

రాసిచ్చాను. అంతా చదివి చివర్లో నా పేరు చూసి అదిరి పడ్డాడు.

"నువ్వు ముస్లిమ్‌వా? తెలుగు బాగా మాట్లాడుతోంటే అనుమానమే రాలేదు. ఇప్పుడు నాకు చచ్చే చావొచ్చి పడినట్టే. మీడియాకి తెలిస్తే గాలి విత్తి సుడిగాలి మొలిపిస్తారు. దీన్ని క్షణాల్లో జాతీయ సమస్య చేసేస్తార్రా దేవుడా...! స్పాట్‌లో

**ఒక్కసారిగా నలువైపుల నుండీ ఎన్నో ఆవులు కమ్ముకొచ్చేశాయి. బస్సుమీద దాడి చేశాయి. కొమ్ములతో బస్సును కుమ్మేయసాగాయి. బస్సు నొక్కుకుపోతోంది. లోపల అతనొక్కడే ఉన్నాడు. ఊపిరి సలపడంలేదు. గిలగిలమని తన్నుకుంటూ ఆర్తనాదాలు చేస్తున్నాడతను! అంతలో కెవ్వున మరో అరుపు! అసలేమిటిదంతా? అతను ఎవరు? ఆవుల మంద ఆ బస్సుపై ఎందుకు దాడి చేసింది?**

జరగలేదని బుకాయించాను గాని ఆమె విశ్వసించలేదు.

"జరక్కూడని ఘోరమేదో జరిగింది. నువ్వు దాస్తున్నావ్. మన బిడ్డమీద ఒట్టేసి చెప్పు".

దుఃఖం తన్నుకొచ్చింది. బావురుమన్నాను. తనూ ఏడ్చేసింది. మెల్లగా తమాయించుకుని జరిగిందంతా వివరించాను.

"యా అల్లా!" అరచేతుల్లో ముఖం కప్పుకుని ఏడ్వసాగింది.

"ప్లీజ్ ఊరుకో... కావాలని చెయ్యలేదు. నేనెలాంటివాడినో నీకు తెలీదూ! మార్కెట్లోంచి హఠాత్తుగా వచ్చి టైరుకింద పడింది"

నా చెయ్యి గట్టిగా పట్టుకుని బిగ్గరగా రోదిస్తోంటే అంతా గుమిగూడారు. ఏమైందేమైందని ప్రశ్నించారు. బిడ్డకేమైనా అయిందేమోనని భయపడ్డారు.

## తమ్మూ కాదు... బంతిపూల జానకి?

*'జనతాగ్యారేజీ'లో ఐటెంసాంగ్ విషయంలో కన్‌ఫ్యూజన్‌కి తెరపడినట్లే అంటోంది చిత్ర యూనిట్. ఈ సినిమాలో ఐటెంసాంగ్ కోసం ముందు తమన్నాని సంప్రదించారు. తమన్నా దాదాపు ఓకే చెప్పేసిందనే వార్తలు వచ్చాయి. కానీ మధ్యలో తమన్నా మనసు మార్చుకుని చేయను అని చెప్పిందట! దాంతో ఈ అవకాశం కాజల్‌కి వచ్చి చేరింది. అయితే ఐటెంసాంగ్ కోసం కాజల్ కోటి రూపాయలు డిమాండ్ చేసిందని అంటున్నారు. ఈ మొత్తం దగ్గరే కొద్దిగా అనుమానంగా ఉంది తప్ప దాదాపు కాజల్ కన్‌ఫామ్ అయిపోయిందనే చెబుతున్నారు. చేతిలో పెద్దగా సినిమాల్లేని కాజల్‌కి అంత ఇచ్చుకోవాలా? లేక వేరే హీరోయిన్‌ని ప్రయత్నించాలా? అన్న మీమాంసలో పడ్డారట! అయితే టైం ఎక్కువగా లేనందున యూనిట్ కాజల్‌కే ఓటు వేసిందని అంటున్నారు.*



ఇంకెవరున్నారు?" కంగారుగా అడిగాడు.

"మా కండక్టర్ బ్రహ్మం ఉన్నాడు.."

"నెంబరు కలిపివ్వు".

ఇచ్చాను. "ఎవరడిగినా డ్రైవర్ పేరు సత్యం అని చెప్పు, తెల్సిందా. సత్యం. గుర్తుంచుకో".

తిరిగి నాతో అన్నాడు. "రెండ్రోజులు సెలవు పెట్టి ఇంట్లో కూర్చో, బయటికి రాకు సుమా".

స్టేషన్లోంచి బయటపడి ఆసుపత్రి కెళ్ళాను.

"ఏం జరిగింది?" నన్ను చూస్తూనే ఆందోళనగా అడిగింది ముంతాజ్.

ఏమీలేదని, మరేమీ

"లేదు లేదు...!" బిగ్గరగా అరచి స్పెషల్ కేర్ రూం వైపు దూసుకెళ్ళాను.

నర్సు వారిస్తున్నా వినకుండా లోపలికెళ్ళాను.

మా బిడ్డ క్షేమంగా ఉన్నాడు. హాయిగా నిద్రపోతున్నాడు. గాఢంగా నిట్టూర్చి వచ్చాను.

"బాగున్నాడు కదా?"

"ఖుదా హమారే సాత్ హై" ముంతాజ్‌ని కావలించుకుని ఆమె నుదుట ముద్దు పెట్టుకున్నాను.

నర్సు వచ్చి, "నీకు పాలు వస్తున్నాయా?" అడిగింది.

తల అడ్డంగా ఊపింది ముంతాజ్. రెండు వేడి కన్నీటి బొట్లు ఆమె కనుకొలకల్లుంచి రాలి పడ్డాయి. నా గుండె పట్టేసింది.



## నమ్మించి మోసం చేశాడట!

సుదీర్ఘ సినీ అనుభవం....త్రిషకు ఏ విషయంలోనూ అక్కరకు రావడంలేదు! త్రిష తాజా సినిమా 'నాయకి' సోదిలోకి కూడా లేకుండా పోయింది. ఈ సినిమా తనని ఎక్కడికో తీసుకువెడుతుందని ఆశపడింది. కానీ అదేమీ జరగలేదు. సినిమా కథ దగ్గర నుంచి త్రిష మోసపోయిందట! ఎలాగంటే... ఈ సినిమా ఆమె మేనేజర్ నిర్మాణంలో తీశారు. మొదట్లో ఈ సినిమాకి తను సూటవుతుందో లేదో అని త్రిష కొద్దిగా సంశయించిందట! కానీ మేనేజర్ తన మాటలతో ఆమెను మాయ చేశాడని... అంతే కాకుండా ఈ సినిమాకి సంబంధించి త్రిష రెమ్యునరేషన్ తీసుకోకుండా తమిళ హక్కులు కావాలని కోరిందట! ఇక్కడ కూడా ఆమె మేనేజర్ ఆమెను మాటలతో మోసం చేశాడట! తమిళ హక్కులకన్నా తెలుగు హక్కులైతే లాభాలు ఎక్కువగా ఉంటాయని ఆమెని నమ్మించి తెలుగు హక్కులు కట్టబెట్టాడట! తీరా ఈ సినిమా తెలుగులో అడ్రస్ లేకుండా పోయింది. కోలీవుడ్‌లోనే కాస్త మెరుగైన రివ్యూలు సొంతం చేసుకుంది. ఆ విధంగా తెలుగులో త్రిష బొక్కబోర్లా పడితే, ఆమె మేనేజర్ కొద్దిగా సేఫ్ అయ్యాడని అంటున్నారు.

"పచ్చి బొప్పాయి కూర తింటే త్వరగా పాలు పడతాయి..." అంటూ కొన్ని సూచనలిచ్చి వెళ్ళింది.

ముంతాజ్ మంచం దిగి, నేలమీద కూర్చుని, తలమీదకి చున్నీ లాక్కుని మక్కావైపు తిరిగి అరచేతులు దోసిలిగా పట్టుకుని నమాజు చేసింది. ఆమె నా గురించే ప్రార్థించిందని ఊహించగలను. అశ్రు నయనాలతో అభిమానంగా చూస్తుండిపోయాను.

మా అదృష్టవశాత్తూ ఆ ప్రమాదం గొడవగా మారలేదు. బ్రహ్మానికి ప్రత్యేకంగా 'థాంక్స్' చెప్పాను.

మూడో రోజున డ్యూటీలో జాయినయ్యాను. అంతా దాన్నో యాదృచ్ఛిక ఘటనగా భావించడం చూసి నిశ్చింతగా ఫీలయ్యాను.

మళ్ళీ అదే బస్సు. అదే రూటు. స్టీరింగు పట్టుకున్నాను గాని ఎంచేతో చేతులకి చెమటలు పట్టాయి. ధైర్యాన్ని కూడదీసుకున్నాను.

బస్సు వెజిటబుల్ మార్కెట్ ప్రాంతాని కెళ్తోంది. నా గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

అమాంతం ఒక ఆవు పరుగు పరుగున బస్సుకెదురు రాసాగింది. బ్రేకువేసి గుటకలు మింగుతూ భయం భయంగా చూశాను.

ఆవు బస్సు చుట్టూ తిరిగింది. దాని దూడ మీంచి వెళ్ళిన ముందరి టైరుని నాకింది. మౌనంగా కన్నీరు కారుస్తూ నిలబడిపోయింది.

నా గుండెలల్లారిపోతోంటే బ్రహ్మం వంక బేలగా చూశాను. బస్సులోని ప్రయాణికులంతా వింతగా చూడసాగారు.

బ్రహ్మం కోరగా కొందరు జనం ముందుకొచ్చి ఆవుని అదిలించారు. అది కొంచెం దూరం వెళ్ళి వెనుదిరిగి, బస్సు వంకే చూడసాగింది. అద్దంలో 'అదేం చేస్తుందా' అని ఊపిరి బిగపట్టి ఉత్కంఠతో చూస్తోంటే, 'రైట్ రైట్' అన్నాడు బ్రహ్మం. బ్రేకు మీంచి కాలు తీస్తూ గేరు మార్చాను.

అన్యమనస్కంగా టీ తాగుతోంటే "టైర్లన్నీ శుభ్రంగా కడిగారు. అయినా అదే బస్సు, అదే చక్రం అని ఆ ఆవుకెలా తెలిసిందో!" అన్నాడు బ్రహ్మం. అతడి ముఖంలోని ఆందోళన నన్ను భయపెట్టింది. గుటకలు మింగాను.

"నాకూ చిత్రంగానే అన్పిస్తోంది. ఈ బస్సుని రేపు ఇంకో రూటుకి మార్చమంటాను" అన్నాను.

"అదే మంచిది.."

●●●

ముంతాజ్‌నీ బిడ్డనీ ఆసుపత్రి నుంచి డిశ్చార్జి చేశారు.

మందులూ మాకులూ వాడినాసరే తనకి పాలు పడలేదు. ముప్ఫైఏళ్ళు దాటాక గర్భం దాల్చిన కొందరికి ఇలాగే జరుగుతుందని చెప్పారు. ఆవు పాలు తల్లిపాలతో సమానమనీ, తేలికగా జీర్ణమవుతాయనీ చెప్పి వాటిని పట్టించమన్నారు.

మా బిడ్డకు తల్లిపాలు తాగే యోగం లేకపోవడం మమ్మల్ని తీవ్రంగా కలచి వేసింది. వాడికి ఇదేం శాపమో అర్థం గాకుండా ఉంది.

మా బాధని వేదనని కళ్ళల్లోనే అణచుకుని డెయిరీ ఆవుపాలు పట్టించాం. గొట్టంలా విరోచనాలవ్వసాగాయి. రెండ్రోజులకే డీలాపడి కళ్ళు తేలేశాడు.

వాణ్ణి తీసుకుని ఆసుపత్రికి పరిగెత్తాం. సెలైన్ ఎక్కించాక కుదుట పడ్డాడు.

"డెయిరీ పాలు వాడొద్దు. నిల్వ ఉండటానికి ఏవేవో కెమికల్స్ కలుపుతారు. అవి అందరు పిల్లలకీ పడవు. ఒంటికి మంచిదీ కాదు. అప్పుడే పొదుగు పిండిన పాలకోసం ట్రై చెయ్యండి" డాక్టరమ్మ సలహా ఇచ్చింది.

వాకబు చేయగా ఒకచోట చిన్న డెయిరీఫాం ఉందని తెలిసింది. స్టీలు కేరియర్ తీసుకుని వెళ్ళాను.

అయిదు ఆవులున్నాయి. వాటిని చూడగానే ప్రాణం లేచొచ్చింది. కాని ఎంచేతో అవన్నీ ఒకేసారి తలెత్తి నా వంక 'అదోలా' చూశాయి.

నా గొంతు తడారిపోయింది. తలొంచుకునెళ్ళి రైతుని కలిశాను. రోజుకి అరలీటరు చొప్పున నాకు పాలు పోయడానికి అంగీకరించాడు.

బాబుకి ఈ పాలు పడ్డాయి. అవి తాగి కాళ్ళూ చేతులూ ఆడిస్తూ ముచ్చటగా నవ్వసాగాడు.

ఎలాగైతేనేం వాడి ఆహార సమస్య తీరినందుకు ఎంతో సంతోషించాం.

వారం రోజుల గ్యాప్ తర్వాత 27వ నెంబరు రూటుకి అదే బస్సుని డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళాను.

ఆ ఆవు ఈ పాటికి బిడ్డ చావుని మరచిపోయి ఉంటుందని ధీమాగా ఉన్నాను. అయినా బస్సు మార్కెట్‌ని సమీపిస్తోంటే మనస్సునిండా ఒకటే అలజడి! అపరాధ భావన!

సరిగ్గా ఆ స్పాట్‌లో బస్సు ఆగిందో లేదో ఉరుకులు పరుగులు మీద ఆ ఆవు వచ్చేసింది. అది బస్సు చుట్టూ కల తిరుగుతోంటే నా కళ్ళనుంచి కన్నీళ్ళు ధారలు కట్టాయి. ఎవరో కొరడాతో చెళ్ళుచెళ్ళున కొడుతున్నట్టు అన్పించి మధనపడ్డాను.

'హారన్ కొట్టు సలీం. పశువుల్ని ఊరికే రోడ్డు మీద వదిలేస్తారు. పొరబాటున వాటిని గుద్దితే మన పీక పట్టుకుంటారు" కండక్టర్ సుబ్బారావు అన్నాడు. అతడికి అవాళ జరిగిన ఘోరం గురించి తెలీదు!

నేను బస్సు దిగివెళ్ళి చిన్నగా అదిలించాను. ఎడంగా వెళ్ళి నా వంక కోపంగా కాదు - దీనంగా చూసింది.

అశ్రునయనాలు తుడుచుకుంటూ బస్సెక్కి ముందుకు దూకించాను. కన్నీటి తెరలోంచి రోడ్డు అస్పష్టంగా కన్పిస్తోంది. అయినా పట్టించుకోలేదు.

ఆ మర్నాడు మళ్ళీ అదే బస్సులో అదే రూట్‌కి వెళ్ళాను. ఒక పొడవాటి కర్ర కూడా బస్సులో పెట్టుకున్నాను. ఆ ఆవు చూపుల కొరడాల దెబ్బలు తట్టుకునే శక్తి నాకింక లేదు గాక లేదు. అందుకనే దాన్ని దూరంగా ఎప్పుడూ నా కంటబడనంత దూరానికి తరిమెయ్యాలని నిశ్చయించుకున్నాను.

కావాలనే మార్కెట్ దాటాక ఆ స్పాట్‌లో బస్సు నాపి ఆవు కోసం చుట్టూ కలయజూశాను. బస్సులోని జనం నా వంక వింతగా చూస్తున్నా లెక్క చెయ్యలేదు. కనుచూపు మేరలో ఆవు కన్పించలేదు. బహుశా ఎక్కడికో పారిపోయి ఉంటుందనుకుంటూ గేరు మార్చబోయానో లేదో ఎన్నో ఆవులు ఒక్కుమ్మడిగా నలువైపుల్నుంచీ బస్సుమీద దాడి చేశాయి. కొమ్ముల్తో బస్సుని కుమ్మేయసాగాయి. బస్సు నొక్కుకుపోతోంది. లోపల నేనొక్కణ్ణీ ఊపిరాడక గిలగిల తన్నుకుంటూ ఆర్తనాదాలు చేస్తూ...!

కెవ్వున అరుస్తూ లేచి కూర్చున్నాను. ఒళ్ళంతా ముచ్చెమటలతో తడిసి ముద్దయింది. బిక్కచచ్చి చుట్టూ బిక్కుబిక్కుమని చూస్తోంటే బాబు సైతం కెవ్వుమని ఏడవసాగాడు.

"అలా అరిచావేంటి? పీడకల వచ్చిందా?" బాబుని సముదాయిస్తూనే ఆందోళనగా అడిగింది ముంతాజ్‌?

నా నోట్లోంచి మాట రాలేదు. నోరు పిడచ కట్టుకుపోయింది!

నేరపూరిత భావన నన్ను నిలువునా నలి పేస్తోంటే భయం భయంగా చూస్తుండిపోయాను!

•••

నా భయాన్ని ఆవేదనని బ్రహ్మం ముందు వెలిగక్కాను.

"అలాంటి పాపాలకు మీ మతంలో ఏదో ప్రాయశ్చిత్తం ఉండి ఉంటుందిగా. అది చేస్తాను. నువ్వే హెల్ప్‌చెయ్యాలి బ్రహ్మం"

"నాకు తెలిసిన శాస్త్రిగారున్నారు. అయన్ని కలుద్దామా?"

"ఆయన నా తపన, ఆరాటం అర్థం చేసుకుంటా రంటావా?"

"మతం వేరు, నమ్మకాలు వేరు. ఆత్మచింతన వేరు, ప్రాపంచిక చింతన వేరు. కడప, కర్నూలు జిల్లా ల్లోని కొందరు ముస్లింలు బీబీ నాంచారిని పెళ్ళా డాడు గనుక తిరుపతి వేంకటేశ్వరుణ్ణి తమ అల్లుడిగా భావిస్తారు. కానుకలూ సమర్పిస్తారు. అంతెం దుకు, వేంకటేశ్వర స్వామికి ప్రతి మంగళవారం చేసే అష్టదళ పాద పద్మారాధనకి ఉపయోగించే 108 బంగారు పుష్పాలు ఒక మహ్మదీయ భక్తుడు బహూకరించినవే"

బ్రహ్మం సమాధానం నన్ను సమాధాన పరిచింది. నా అంతఃసంఘర్షణ నుంచి నన్ను విముక్తి చేసే ఆశారేఖ కళ్ళముందు మెరిసింది.

మేం వెళ్ళేసరికి శాస్త్రిగారు పట్టుబట్టలు ధరించి, నుదుట నామం దిద్దుకుని, వీధి అరుగుమీద పద్మాసనం వేసుకుని ఏదో గ్రంథం పఠిస్తున్నారు.

నేను మెట్లమీదే ఆగిపోయాను. బ్రహ్మం అరుగు ఎక్కి ఆయనకి నమస్కరించి జరిగిన దంతా వివరించాడు.

"తెలిసి చేసినా, తెలియక చేసినా గోహత్య మహాపాపమే. పాతకమే. దానికి నిష్కృతి లేదు. గోమాత శుభానికి, పవిత్రతకి చిహ్నం. గోక్షీరం, గోమూత్రం, గోపేడ అన్నీ పవిత్రమైనవే. గోవు విషం తిన్నా సరే అది కంఠంలోకి, కండరాల్లోకి వెళు తుంది తప్ప పాలు, మూత్రం, పేడలలో కలవదు. ఆక్సిజన్‌ పీల్చుకుని, తిరిగి ఆక్సిజన్‌ని విడిచే ఏకైక ప్రాణి ఆవు. అందుకే పరమ పవిత్రమైనదైంది. గోవు చరించిన ప్రాంతమెప్పుడూ పాడి పంటలతో సుభిక్షంగా ఉంటుంది. హుంc వాటి విలువ, గొప్ప తనం ఇతగాడికేం తెలుస్తుందీ!" వ్యంగ్యంగా నవ్వారు.

ఆయన మాటలు నా గుండెల్లో శూలాల్లా దిగాయి. భయోద్విగ్నుడనై ఆయన వంకే ప్రాధేయ పూర్వకంగా చూశాను.

"చాలా ఫీలవుతున్నాడు. పశ్చాత్తాపపడు తున్నాడు. మీరే ఏదో మార్గం చూడాలి.."

బ్రహ్మం మాటలకి నా ముఖంలోకి చూశారు శాస్త్రిగారు.

"అతడి ముఖంలో గోచర స్పష్టంగా గోచ రిస్తోంది. గోచర అంటే గోవు నడకేకాదు అంత రాత్మ తెలుసుకొనుట, విషయ జ్ఞానం అని కూడా అర్థాలున్నాయి. అతడి అంతరాత్మ అతణ్ణి నిలు వునా దహించేస్తోంది!" తీక్షణ దృక్కుల్తో నన్ను చూస్తూ కఠినంగా అన్నాడు.

అగ్నిశిఖరం మీంచి మంచులోయలోకి తోసేయ బడినట్టు విలవిల్లాడాను.

"అందుకనే మిమ్మల్ని ఆశ్రయించాం. అన్నీ తెలిసిన వారు. సహనం, సహిష్ణుత గలవారు. పెద్ద మనస్సు చేసుకుని ఏదో దారి.."




హేళనగా నవ్వారు. "ఇతగాడు గోదారి ఈద లేదు, దాటలేదు. అదేమీ సులభ సాధ్యమైంది కాదు. వేయి గోవుల్ని దానం చేసినా ఇతడి పాపం పోదు. ఒక గోవు తన జీవితకాలంలో 4,10,400 మందికి ఒక పూట భోజనం ఇస్తుందన్నది ఇత గాడి ఊహకి అందుతుందా? గోహత్య సునా యాసంగా చేసెయొచ్చు. ఏదీ, ఒక్క గోమాతకి ప్రాణం పోయమను చూద్దాం. అసంభవాన్ని సంభవం చేసే శక్తి నాకు లేదు. మహాపాపాన్ని పరిహరించే యుక్తి నాకు తెలీదు. ఎంతటి వారైనా సరే ఎవరి కర్మను వాళ్ళు అనుభవించక తప్పదు!"

బ్రహ్మం నిస్సహాయంగా నా వంక చూశాడు. నేనక్కణ్ణుంచి విసవిసా వచ్చేశాను.

మరో ఆలోచన లేకుండా తిన్నగా కబేళాకి వెళ్ళాను. ఎన్నో జంతువుల్ని తీసుకొస్తున్నారు. అమ్మేస్తు న్నారు. వెళ్ళిపోతున్నారు. మూగజీవాల ఆక్రందన నిశ్శబ్దంగా ప్రతిధ్వనిస్తోంది.

గుండెలు బిగబట్టుకుని నిరీక్షించాను. ఒక ట్రక్కులో ఇతర పశువులతో బాటు బక్కచిక్కిన ఒక ఆవుని కూడా తీసుకొచ్చారు. ఏ కరువు ప్రాంతం నుండి తీసుకొచ్చారో మరి!

వారి దగ్గరికెళ్ళి ఆ ఆవుని నాకు అమ్మమని కోరాను.

"ఇలాంటిది దానంచేస్తే ఎలాంటి పుణ్యమూ రాదు. దానమిచ్చిన ఆవు పాలు దానం తీసుకున్న వారి కుటుంబం తాగితేనే ఫలం ఉంటుంది".

వాదనకి దిగలేదు. దాన్ని కొనుక్కుని మినీ ట్రక్కులో ఇంటికి తోలుకెళ్ళాను.

ఆవును చూసి బోలెడు సంబరపడిపోయింది ముంతాజ్‌. "నువ్వెంత మంచివాడివి. మన బాబు కోసం ఏకంగా ఆవునే కొనుక్కొచ్చేశావా!"

"ఇది పాలు ఇవ్వదు. ప్రాణంతో ఉందంతే!'

మా ఇంటి పెరట్లో కాస్త జాగా ఉండటం మాకు బాగా కలిసొచ్చింది. అక్కడ దాన్ని కట్టేసి పచ్చ గడ్డి తెచ్చివేశాను. ఆబగా తిని ఇన్ని నీళ్ళు తాగింది.

ఆ దృశ్యం చూస్తూనే ముంతాజ్‌ సంబరంగా అరిచింది. "నా జాకెట్టు పాలతో తడిసిపోయింది!"

పట్టరాని ఆనందంతో ఆవు ఒళ్ళు నిమిరాం. ముద్దు పెట్టుకున్నాం.

మరింత అపురూపంగా పెంచసాగాం. మా బుజ్జోడు కూడా దాని వంక ఇంతింత కళ్ళతో చూస్తు న్నాడు. చిరునవ్వులు చిందిస్తున్నాడు.

అదేమి చిత్రమోగాని ఆ తర్వాత అదే బస్సులో అదే రూట్లో ఎన్నిసార్లు వచ్చినా, ఆ ఆవు మరి కన్పించలేదు!

మా ఆవు చక్కగా తయారైంది. పుష్టిగా ఉంది. ఎదకు వచ్చింది. పశువులాసుపత్రికి తీసు కెళ్ళాను. వాళ్ళు సంపర్కం ఏర్పాటు చేశారు. కొద్ది రోజులకే సూడిదయ్యింది.

మా సంతోషానికి అవధులు చెరిగిపోయాయి.

ఆవు కళ్ళు మమ్మల్ని చల్లగా దీవిస్తూ చూస్తు న్నాయి. ఆవు మా కళ్ళముందు సంచరిస్తూ అను నిత్యం ఆనందామృతాన్ని దోసిళ్ళతో పంచుతోంది. ఒక వ్యాపకం కల్పించటమే గాక మాకు తెలీ కుండానే మా కుటుంబ సభ్యురాలైపోయింది.

"గాయ్‌ని కొన్నావుట. ఏమిటి విశేషం?" మా ఇంటికొచ్చిన దోస్త్‌ అడిగాడు.

'ఆవు పాలలో రసాయనం, ఆవు నెయ్యిలో అమృతం ఉన్నాయి. ఆవు మాంసం తింటే రోగిస్టు లవుతారు' అని మహమ్మద్‌ ప్రవక్త చెప్పాడని ఎవరో ఎప్పుడో చెబితే విన్నది గుర్తొచ్చింది. మౌనంగా ఉండిపోయాను.

ముంతాజ్‌ నెలలు నిండుతోన్న ఆవు గురించి గొప్పగా చెప్పింది. ప్రూన్నడి విన్నాడతడు!

మా ఆవు ఈనింది. చిన్ని దూడకి జన్మ నిచ్చింది. ఈ దూడ అచ్చంగా ఆ దూడలానే ఉంది. ముఖం మీద బొట్టులా నారింజరంగు మచ్చ సైతం ఉంది!

నా పాపమంతా పటాపంచలైనట్టు పొంగి పోయాను. వెర్రి సంబరంతో ఆవు మెడ చుట్టూ చేతులు చుట్టి కావలించుకున్నాను.

ఆవు కళ్ళల్లోకి చూస్తూ మూట్టె నిమురుతూ అన్నాను "నిన్నూ నీ సంతతినీ సంరక్షిస్తాను. అల్లాకే కసమ్‌!"

సెల్‌:98490 61668

ప్రైమ్ హాస్పిటల్స్
హైదరాబాద్





డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 84999 91829 / 040-4959 4959

# తుంటి మార్పిడితో నొప్పులకు విముక్తి అందుబాటులోకి అధునాతన వైద్య ప్రక్రియలు

మన శరీరంలో మోకాలు, తుంటి కీలు అత్యంత ధృఢమైన కీళ్ళు, నడిచినా, కూర్చున్నా, మెట్లెక్కినా ఏ చిన్న కదలికైనా కీళ్ళపైనే ఆధారపడాలి. కీళ్ళు ఆరోగ్యంగా ఉన్నంతసేపు వాటి గురించి అంతగా పట్టించుకోము. అయితే కీళ్ళలో ఏదైనా సమస్య తలెత్తి నొప్పి రావడం ప్రారంభమైతే రోజువారి కార్యకలాపాలు కూడా సరిగ్గా చేసుకోలేని పరిస్థితి తలెత్తుతుంది. ఈ సమస్యను ప్రాథమిక దశలో గుర్తించి సకాలంలో చికిత్స చేయించుకుంటే మెరుగైన ఫలితాలు పొందగలుగుతారు. ప్రస్తుతం తుంటి సమస్యలకు అధునాతన వైద్య ప్రక్రియలు అందుబాటులోకి వచ్చాయి.

## రక్తప్రసరణే ముఖ్యం :

తుంటికీలులోకి బంతికి రక్తప్రసరణ చాలా ముఖ్యం. ఈ బంతికి అనుసంధానమై ఉండే నెక్‌లో ఏదైనా సమస్య తలెత్తితే బంతికి వెళ్ళే రక్తప్రసరణ పూర్తిగా దెబ్బతింటుంది. రుమటాయిడ్ అర్థరైటీస్ వల్ల, తుంటి అరుగుదలవల్ల, పిల్లల్లో ఇన్‌ఫెక్షన్ సోకడంవల్ల, ఫ్రాక్చర్‌వల్ల తుంటి కీలులోని బంతికి రక్త ప్రసరణ నిలిచిపోయే అవకాశం ఉంటుంది. చాలావరకు ప్రమాదాలలో నెక్ ఫ్రాక్చర్ అయితే బంతికి రక్తప్రసరణ దెబ్బతింటుంది.



## లక్షణాలు :

తుంటిలో సమస్య ఉన్నవారిలో నొప్పి వస్తుంటుంది. దాంతోపాటు నడుస్తున్నప్పుడు, కూర్చుని లేచినప్పుడు నొప్పితో బాధపడుతుంటారు. విశ్రాంతి తీసుకుంటూ ఉన్నా నొప్పి వస్తూ ఉండడం, పట్టేసినట్లు అనిపించడం వంటి లక్షణాలు కనిపిస్తుంటాయి.

## నిర్ధారణ పరీక్షలు :

తుంటి ఎక్స్-రేతో ఎమ్.ఆర్.ఐ., బోన్‌స్కాన్‌తోపాటు మూత్ర పరీక్షలు, రక్త పరీక్షలు నిర్వహించి తుంటి సమస్యను నిర్ధారిస్తారు.

## తుంటి మార్పిడితో సాధారణ జీవితం :

తుంటి సమస్య ముదిరి రోజురోజుకు నొప్పి పెరుగుతూ ఉండడం, తుంటి కీలు కదలికలు తగ్గిపోయినప్పుడు తుంటికి రక్తప్రసరణలో ఆటంకం ఏర్పడి దైనందిన కార్యక్రమాలు చేసుకోలేని పరిస్థితి తలెత్తుతుంది. ఇలాంటి సందర్భాలలో తుంటిమార్పిడి శస్త్రచికిత్స నిర్వహిస్తారు. తుంటిమార్పిడి శస్త్రచికిత్సలో తుంటిలోకి బంతిని తొలగించి, దాని స్థానంలో కృత్రిమ బంతిని అమర్చుతారు. సరైన సమయంలో సర్జరీ చేయించుకోవడం ద్వారా ఎలాంటి ఇబ్బంది లేకుండా సాధారణ జీవితం గడపగలుగుతారు.

## అపోహాలు వీడండి....!

తుంటి మార్పిడి శస్త్రచికిత్స అంటే పెద్ద ఆపరేషన్ అని, చాలా పనులు చేసుకోలేమని, ఎక్కువ రోజులు విశ్రాంతి అవసరమని చాలామంది అపోహ పడుతుంటారు. కానీ అవన్నీ కేవలం అపోహలే. ప్రస్తుతం అందుబాటులోకి వస్తున్న అత్యాధునిక వైద్య ప్రక్రియలతో సురక్షితంగా తుంటి మార్పిడి ఆపరేషన్ నిర్వహించగలుగుతున్నారు. సర్జరీ తర్వాత వైద్యులు సూచించిన కొన్ని జాగ్రత్తలు పాటిస్తూ అందరిలాగే సాధారణ జీవితం గడపగలుగుతారు.

## ఎక్కువ రోజులు విశ్రాంతి అవసరం...?

ఆపరేషన్ తరువాత ఎక్కువ రోజులు విశ్రాంతి అవసరమనేది కేవలం అపోహ మాత్రమే. అత్యాధునిక విధానాలలో ఆపరేషన్ నిర్వహించడం ద్వారా సర్జరీ అయిన రోజునే రోగిని నడిపిస్తారు. రెండుమూడు రోజుల్లో రోగి సొంతంగా నడవగలుగుతారు. తుంటి మార్పిడి సర్జరీ తర్వాత కొన్ని వారాలపాటు వైద్యుల సలహాలు, సూచనలు పాటిస్తూ జాగ్రత్తలు తీసుకోవాలి. ఆపరేషన్ జరిగిన ఆరువారాల తర్వాత వైద్యులను సంప్రదించి విధులకు హాజరుకావచ్చు.

## మెట్లెక్కవచ్చా...?

తుంటి మార్పిడి సర్జరీ తర్వాత పూర్తిగా మెట్లు ఎక్కకూడదు అనేది కేవలం అపోహ మాత్రమే, సర్జరీ జరిగిన కొద్ది రోజుల తర్వాత మెట్లు ఎక్కడంతోపాటు వాకింగ్, స్విమ్మింగ్ వంటి వ్యాయామాలు కూడా చేయవచ్చు.

## జాగ్రత్తలు తప్పనిసరి :

తుంటి మార్పిడి శస్త్రచికిత్స అనంతరం జాగ్రత్తగా వ్యవహరించడం చాలా అవసరం. సర్జరీ తర్వాత చేయకూడనివి, చేయగలిగే పనులు వైద్యులను అడిగి తెలుసుకోవాలి. తుంటి మార్పిడి ఆపరేషన్ చేయించుకున్నవారు వెస్ట్రన్ టాయిలెట్‌ను వాడాలి. సాధ్యమైనంతవరకు కింద కూర్చోకూడదు. సర్జరీ చేయించుకున్న వారికి మధుమేహం, రక్తపోటు వంటి ఆరోగ్య సమస్యలు ఉంటే వాటిని అదుపులో ఉంచుకోవాలి. ఆపరేషన్ తర్వాత దంతాలకు సంబంధించిన చికిత్సగానీ, శస్త్రచికిత్సగానీ చేయించుకోవాల్సి వస్తే సర్జరీ జరిగిన విషయాన్ని వైద్యులకు తెలియజేయాలి.




**'సామాన్యంగా పోలీసుల దగ్గరికి వాళ్ళు పోరు. పోలీసులే వాళ్ళ దగ్గరికి వచ్చి చేతులు కట్టుకుని నిలబడుతూ ఉంటారు. పద్ధతికి విరుద్ధంగా కనిపిస్తోంది వాళ్ళ ప్రవర్తన' తనలో తను అనుకుంటున్నట్టు పైకే అన్నాడతను.**

**'విరుద్ధమో సరుద్ధమో... లోపలికి పోతున్నారు. ఎందుకో చెప్పగలవా?' అడిగింది ఆ అమ్మి.**

'కంకర రోడ్డు మీద పలుకురాళ్ళతో మొఖాలు పగల గొట్టించుకున్నామని చెప్పటానికి మాత్రం కచ్చితంగా అయ్యుండదు. ఈ భూ ప్రపంచంలో తమను ఎదిరించి, ప్రాణాలతో అవతలికి పోగలిగిన వాళ్ళు ఎవరూ ఉండరని వాళ్ళ నమ్మకం. దెబ్బలు తిన్నామని చెప్పుకుంటే పరువు తుంగలో కలిసిపోతుందని భయం' అన్నాడు అతను.

'అయితే మరెందుకు?' కనులు చిట్లిస్తూ అడిగింది ఆమె.

ఉన్నట్లుండి చిన్నగా నవ్వాడు అతను.

గిరుక్కున తలతిప్పి మహా రోషంగా చూసిందామె అతని ముఖంలోకి. 'ఎందుకు నవ్వటం?' విసురుగా అడిగింది.

'తల్లీ.. నీకు అన్నీ తెలుసని చెప్పావు. నీ తల వెనక కూడా కళ్ళుంటాయని వత్తివత్తి మాట్లాడావు. వాళ్ళు ఏం చేయబోతున్నారో తెలుసుకోవటం నీకు చాలా తేలికేకదా..' అన్నాడు అతను.

పెదవులు బిగించి చాలా విసురుగా తలను విదిలించింది ఆమె. వదులుగా ఉన్న తలకట్టు ఒక్కసారిగా కదిలి, సిల్కు వస్త్రంతో ముఖాన్ని మరుగు పరిచినట్లు తలనంతా కమ్ముకుంది.

'తల్లీ... ముందు నువ్వు నీ తలకట్టును గట్టిగా మెలి పెట్టి ముడివేసుకో' వెంటనే రిక్వెస్టు చేశాడు అతను.

'ఎందుకు వేసుకోవాలి? నా జుట్టు నా ఇష్టం. నీకేమిటి సంబంధం?' కోరగా చూస్తూ అడిగింది ఆమె.

'నేను పుట్టి బుద్ధెరిగినప్పటి నుంచీ ఇటువంటి తలకట్టు ఇప్పటివరకు చూసింది లేదు. నేనే కాదు. ఈ చుట్టుపట్ల ఎవరూ ఏనాడూ చూసి ఉండరనే నా నమ్మకం. ఒకసారి చూస్తే జీవితమంతా గుర్తుండి పోతుంది. నిద్రలో నుంచి లేపి కూర్చోబెట్టినా తడుముకోకుండా చెప్పేస్తారు' మృదువుగా అన్నాడు.

'నన్ను చూసినవాళ్ళు మర్చిపోకుండా బాగా గుర్తుపెట్టుకుంటారని భయపడుతున్నావు?' అడిగింది ఆమె.

తల ఊపాడు అతను.

'ఎవరికీ కనిపించకుండా దొంగ మాదిరి రహస్యంగా నడుచుకోవాల్సింది నేను కాదు, నువ్వు. ముందు నీ అవతారాన్ని మార్చుకో. చినిగిపోయిన దుస్తుల్ని వదిలి, కాస్త మంచివి వేసుకో. ప్రపంచంలోని బాధలన్నిటినీ నువ్వు ఒక్కడివే అనుభవిస్తున్నట్టు దిగులుగా చూడటాన్ని మానుకో. నవ్వుతూ ఉండు అప్పుడప్పుడు" ఉపన్యాసం ఇస్తున్నట్టు ముఖం పెట్టింది ఆ అమ్మి.

అతని పెదవుల మీదకి మళ్ళీ వచ్చేసింది నవ్వు.

'తల్లీ.. ఏదో అదృష్టం బాగుండి ఆ మొక్కజొన్న తోట యజమాని వల్ల దక్కిన నూట యాభై తప్ప ఇంకొక్క రాగి నాణెం కూడా నా దగ్గర లేదు. ఈ పూటకి తిండి ఖర్చులకు సరిపోతాయి. మళ్ళీ రేపు మనం ఉపవాసం ఉండవలసిందే.. ముఖం మీదికి నవ్వు రమ్మని అంటే ఎక్కడినించి వస్తుంది' అంటూ కనులు చిట్లించాడు అతను.

రోడ్డుకు అవతలగా ఉన్న పోలీస్ స్టేషన్లో నుంచి వారిని అనుసరిస్తున్న హీరోలు వెలుపలికి రావటమే అందుకు కారణం.

ఇద్దరు కానిస్టేబుల్స్ కూడా వచ్చారు వారితోపాటు. చేతులు జాచి ఆ వీధి చివరికి చూపిస్తూ ఏదో వివరించి చెప్పారు వారందరికీ.

'జీప్ మాయం అయ్యిందని రిపోర్టు చేసి ఉంటారు. నెంబరుతో సహా వివరాలన్నీ చెప్పే ఉంటారు. ఇప్పుడు గనుక మనం వీధిలోకి వెళితే చిటికెలో పట్టుబడిపోతాం' కొంచెం ఆందోళన నిండిన కంఠంతో అన్నాడతను.

'ఈ ఊరు ఏమంత పెద్దదేమీకాదు. మనం జీప్‌లో వచ్చిన సంగతి ఈ పాటికి సగం మందికి తెలిసిపోయే ఉంటుంది. ఇంకో పది నిమిషాలపాటు ఇక్కడే ఉంటే పోలీసులకు కూడా తేటతెల్లం అయిపోతుంది' అంటూ గేరు మార్చి యాక్సిలేటర్‌ని మృదువుగా అదిమింది ఆ అమ్మి.



## జరిగిన కథ

తనను తిరిగి బానిసగా మార్చాలని ప్రయత్నం చేస్తున్న గూండా ముఠాలకు కనిపించకుండా తప్పించుకు తిరుగుతూ ఉంటాడు వెట్టి. బస్సు ప్రమాదంలో చిక్కుక్కున్న ప్రయాణికుల్ని ప్రాణాలకు తెగించి కాపాడి ఆ ఊరివాళ్ళ ఆదరణ పొందుతాడు. ఎక్కడినుంచో ఆ ఊరికి వచ్చి నాగదేవతగా ఊరివాళ్ళ ప్రేమాభిమానాలు పొందుతుంది ఒక అమ్మి. వెట్టిని ఆ ఊరు నుంచి దూరంగా తీసుకుపోయి గూండాల బారిన పడకుండా కాపాడుతుంది. ఆమె తెగువ, నైపుణ్యం చూసి అబ్బురపడతాడు వెట్టి. అసలు ఆమె ఎవరో, ఏమిటో, తనను ఎందుకు కాపాడిందో తెలియక తికమక పడతాడు. తర్వాత......

గురగురమని చప్పుడు చేస్తూ కదిలింది జీప్. మెయిన్ రోడ్డు మీదికి కాదు.. ఏ సందులోకి పోయి ఆగిందో, ఆ సందు చివరి భాగంలో కనిపిస్తున్న పెద్ద చెరువుగట్టు దగ్గరికి.

'చెరువుల్లో నీళ్ళు కనిపించడం చాలా కష్టం. సరైన వర్షాలు పడి రెండు సంవత్సరాలపైన అయ్యింది' డాష్‌బోర్డు మీది ఐరన్ రాడ్డును గట్టిగా పట్టుకుంటూ చెప్పాడు అతను.

'వాళ్ళని గురించి నేను మాట్లాడలేదు. వాళ్ళతో ఇప్పుడు నీకు నాకు అవసరం లేదు. ఊళ్ళోకి పోకుండా దూరంగా వెళ్ళేందుకు ఏదైనా డొంకదారి కనిపిస్తుందేమోనని నా ఆలోచన' అంటూ మరి కొంచెం వేగం పెంచింది ఆమె.

గుర్‌గుర్‌మని చిన్నగా శబ్దం చేస్తూ పెళ్ళి నడక నడుస్తున్న జీప్ ఉన్నట్లుండి వేగం పుంజుకుంది. దుమ్ము తెరల్ని రేపుతూ సునాయాసంగా చెరువుగట్టు మీదికి ఎక్కేసింది.

వెడల్పు ఏమంత ఎక్కువగా లేని గట్టు అది. ఏ మాత్రం అజాగ్రత్తగా ఉన్నా పన్నెండు అడుగుల పల్లంలోకి తలకిందులుగా పల్టీ కొట్టేయటం జరుగుతుంది.

ఆ పని జరిగిన తర్వాత ఎదురయ్యే పరిస్థితుల్ని తలుచుకునేసరికి, వేపాకులు నమిలినట్లు చేదుగా తయారయింది అతని నోరు.

'ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలియని ఈ గట్టుదారిలో ప్రయాణం చేయడం కంటే, ప్రాణాలకు తెగించి ఊరి మధ్యలో నుంచి పొయ్యుంటే చాలా



బాగుండేది. జాగ్రత్త తల్లీ...' గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుంటూ వేడుకున్నాడు.

'నువ్వు నాకు ఎదురు పడినప్పటి నుంచీ నీ గురించే ఆలోచిస్తున్నాను. ఒంటిమీది దెబ్బలవల్ల జ్వరం వచ్చిందంటావు. కళ్ళు తిరిగి కిందపడిపోతూ ఉంటావు. ఒంటిచేత్తో బస్సులో ఉన్న వాళ్ళందరినీ బయటికి తేగలిగానంటావు. మళ్ళీ కళ్ళు తేలేస్తావు ... అసలు నువ్వు ఎవరివి? ఏమిటి నీ బాధ?' ఉన్నట్లుండి అతనివైపు చూస్తూ అడిగింది ఆమె.

'అదేంటి తల్లీ.. అన్నీ తెలిసినట్లే మాట్లాడావు కదా. మర్చిపోయావా?' తన మనసులోని ఆందోళన మటుమాయం అయిపోతుండగా నవ్వుతూ అడిగాడతను.

'మనసులోకి వచ్చిన ప్రతీ మాటను గుర్తు పెట్టుకోవాలంటే నాకున్న ఈ ఒక్క తలకాయ చాలదు. కనీసం ఇంకో పది పన్నెండు ఉండి తీరాలి' కనులు చిట్లిస్తూ అన్నదామె.

ఆ చిట్లింపును చూసేసరికి అతని ఒళ్ళు జలదరించింది. ఆచార్లుగారి పాకలోనుంచి తాను పారిపోవటానికి బయలు దేరినప్పుడు, ఎలా చూస్తూ ఎదురయిందో అచ్చం అలాగే ఉంది ఇప్పుడు చూస్తున్న చూపు.

అర్జెంటుగా మాట మార్చి ఆమె ఆలోచనల్ని పక్కదారి పట్టించకపోతే, నోటికి వచ్చినట్టు మాట్లాడే ప్రమాదం పొంచి ఉంది.

'తల్లీ... అదిగో... గట్టుమీది నుంచి కిందికి పోయే దారి. అటు పోనీ..' ఉన్నట్లుండి ముందుకు చూపిస్తూ బిగ్గరగా అన్నాడు.

అలవోకగా జీపుని అటుపోనిచ్చింది ఆమె. చెరువు గట్టు మీది నించి దింపి పది అడుగుల వెడల్పున్న ఒక మట్టి రోడ్డు మీదికి తీసుకుపోయింది.

'ఎవరైనా ఎదురైతే కాస్తంత బ్రేకు వెయ్యి తల్లీ. ఇది ఎక్కడికి తీసుకుపోతుందో అడుగుదాం' అన్నాడు అతను.

'అడగవలసిన అవసరం లేదు. నాకు తెలుసు. ఇది బంగిడి పక్కనుంచి అడవిలోకి పోతుంది' చెప్పింది ఆమె.

కరెంటు షాకు కొట్టినట్లు జలదరించింది అతని శరీరం. ఆ ఊరి పేరు చెవుల పడిన వెంటనే అతనికి తెలియకుండానే బిగుసుకున్నాయి పిడికిళ్ళు. కనుకొలనులు ఎర్రబడ్డాయి.

'ఏమయింది నీకు? ఎందుకు అలా బిగుసుకుపోతున్నావు? తల పక్కకు తిప్పి, అతని ముఖంలోకి చూస్తూ ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

తల విదిలించి తనలో వచ్చిన మార్పును క్షణాల మీద తుడిచేసుకున్నాడు అతను. 'తల్లీ.. మనం అటుగా వెళ్ళటం మంచిది కాదు. ఇంకోదారి ఏదైనా ఉందేమో తెలుసుకుందాం' ఆమె వైపు చూడకుండా, సూటిగా రోడ్డు మీదికే చూస్తూ అన్నాడు.

'ఇంకోదారి అంటూ ఏదీ లేదు. బంగిడివెళ్ళిన తర్వాతనే బోలెడన్ని కనిపిస్తాయి. ఇంతకీ అటుకేసి ఎందుకు వెళ్ళకూడదు?' రెట్టించి అడిగింది ఆమె.

'చెంబేడులో మనం తప్పించుకు వచ్చిన వాళ్ళు తప్పకుండా బంగిడికే వస్తారు. అక్కడ వాళ్ళ వాళ్ళు ఇంకా చాలామంది ఉన్నారు. అందరూ కలిసి మన వెంటపడతారు. తట్టుకోవటం చాలా కష్టం' అన్నాడు అతను.

ఉన్నట్టుండి జీప్‌ని ఆపింది ఆమె. చిందర వందర అవుతున్న తలకట్టును గట్టిగా మెలిపెట్టి ముడి వేసుకున్నది.

'ఈ నాటు రోడ్డుమీద మనల్ని గమనించేవాళ్ళు ఎవరూ ఉండరు. ఊళ్ళో ఉండగా చేయవలసిన పనిని అడవిలో చేయటం దేనికి?' అడిగాడు అతను.

'పగవాళ్ళు ఎవరో మందలు మందలుగా ఉన్నారంటివిగా.. వేగంగా వెళ్ళిపోవాలి. ఎవరూ మనల్ని గుర్తుపెట్టుకోకూడదు. అందుకే.' నవ్వుతూ చెప్పి జీప్‌ని ముందుకు కదిలించింది ఆమె. ఒట్టిగా కాదు. యాక్సిలేటర్‌ని అడుగుకుంటా అదిమి మరీ కదిలించింది.

ఎగుడుదిగుడు రోడ్డు మీద ఎగిరెగిరి పడుతూ మహా వేగంగా పరిగెత్తటం మొదలుపెట్టింది జీప్. చీకటిపడిన రెండు గంటలకు వారి ఎదుట ప్రత్యక్షం అయింది బంగిడి.

●●●

ఎర్రటి దుమ్ముతెరలు రేపుతూ వేగంగా వచ్చి బంగిడి బస్‌స్టేషన్ పక్కన ఉన్న మూడు అంతస్తుల పెద్ద భవనం ముందు ఆగింది ఒక క్వారీ లారీ.

డ్రైవర్ పక్క నుంచి కిందికి దూకారు ఇద్దరు వ్యక్తులు. లారీ వెనుక నిలబడి ఉన్నారు ముగ్గురు. వెనుక నుంచి కిందికి దిగి వారిని కలుసుకున్నారు.

'ఓరిఓరి... ఇదేంట్రా... ఎటూగాని సమయంలో ఇలా ఊడి పడ్డారు.. ఏమైంది మీ జీపు?' అని అడుగుతూ ఆ బిల్డింగ్ ముందు భాగంలో నుంచి బయటికి వచ్చాడు ఒక లావుపాటి వ్యక్తి.

అన్నీ వివరంగా చెప్తాం. ముందు ఈ లారీని పంపించేయాలి అంటూ తన దుస్తుల్లో నుంచి ఒక కరెన్సీ నోటును తీసి లారీ డ్రైవర్‌కి అందించాడు



**జీప్‌తోపాటు వెట్టి పారిపోయాడనీ, ఎక్కడ దొరికినా పట్టుకోమనీ పోలీస్‌స్టేషన్‌లో తమ త్రైనాతీలకు చెప్పి వెళ్ళారు ఆ దృఢకాయులు. తమ నాయకుడికి కూడా ఆ విషయం తెలియజేయడంతో రహదారిమీద మరో బృందాన్ని కాపలా ఉంచాడా నాయకుడు. వారికి దొరక్కుండా కాలినడకన బయలుదేరాడు వెట్టి. మరి ఆ అమ్మి ఏమైపోయింది? అతను ఎక్కడికి బయల్దేరినట్టు?**

కిందికి దిగిన వారిలో ఒక వ్యక్తి.

'మా జీప్ నెంబరు గుర్తుంది కదా.. ఎక్కడ కనిపించినా వెంటనే ఫోన్ కొట్టు.. కొడ్తావ్ కదా?' అని అడిగాడు.

తల ఊపాడు లారీ డ్రైవర్. కరెన్సీనోటును షర్టు జేబులో పెట్టుకుని, దూరంగా తీసుకు వెళ్ళిపోయాడు లారీని.

'నీ మొఖం చూస్తుంటే జొరం వచ్చినట్టు ఉండాది. ఏమైందిరా?' ఆ వ్యక్తిని అడిగాడు బిల్డింగ్‌లో నుంచి బయటకు వచ్చిన వ్యక్తి.

'జొరం వస్తే చాలా బాగుండి ఉండేది. అంతకంటే చాలా ఛండాలం. పాము కాటేసింది. తల రాత తిన్నగా ఉండి ఇంజక్షన్ దొరికింది. దొరక్కుండా ఉన్నట్లయితే ఈపాటికి పెద్దల్లో కలిసిపోయి ఉండేవాడు' అంటూ కంకరరోడ్డు దగ్గర పొదల్లో జరిగిన సంఘటనను ఆ మనిషికి చెప్పాడు ఇంకో వ్యక్తి.

"అరేయ్... మీకు బుద్ధి లేదు. వెళ్ళిన పని వదిలేసి ఆడాళ్ళెనకాల పడితే ఇట్టాంటివే జరుగుతయ్. చేతికి దొరకాల్సినోడిని వదిలి పెట్టేశారు. దేబె మొఖాలు వేసుకుని తిరిగి వచ్చారు. నడిచినడిచి కాళ్ళు తీపులతో తల్లకిందులు కావాల్సిన ఆడికి, నొప్పి తెలియకుండా పారిపోయేందుకు జీపు కారు చేతికి అందించి మరీ వచ్చారు కదూ?" కోపంగా అడిగాడు ఆ మనిషి.

'అనుకోకుండా జరిగిపోయిందన్నా... చెంబేడు స్టేషన్లో చెప్పి వచ్చాం. ఆడు అటుగా పోలేడు.. అక్కడినించి మెయిన్ రోడ్డు మీద వచ్చాం. వాడు అడవి దారి వెంటే రావాలి. ఎటుపోవాలన్నా ఈడకే వచ్చి తీరాలి. మనోళ్ళని పంపి రెడీగా ఉంటే దొరికిపోతాడు" అన్నాడు ఆ వ్యక్తి.

'చేతిలో ఉన్న పిట్టను వదిలేసి పొదల్లో ఉన్న కుందేలు వెనకపడ్డట్టు ఎనకటికి నీలాంటోడు... అప్పజెప్పిన పనిని వదిలేసి కొత్తకొత్త ఆలోచనలు చేస్తే ఇలాగే ఉంటుంది.' అంటూ తన జేబులోంచి ఫోన్‌ని బయటికి తీశాడు ఆ మనిషి. ఒక దాని వెనక ఒకటిగా పది నెంబర్లను నొక్కి చిన్నకంఠంతో ఏవేవో ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చాడు.

'లోపలికి వచ్చి ముందు ఏదైనా తిని కొంచెం రెస్టు తీసుకోండి. తర్వాత తలా ఒక పక్కకిపోయి కాపలా కాయండి. ఆడు ఇటుగావస్తే మనకి దొరికి తీరాలి. దొరక్కుండా మళ్ళీ మాయం అయినాడంటే, మీరు ఉండరు. మీతోపాటు నేను కూడా ఉండను. జాగ్రత్త..' అంటూ వారందరినీ బిల్డింగ్‌లోకి పంపి, తను పక్కనే స్టాండ్ వేసి ఉన్న మోటార్ బైక్‌మీద

బస్‌స్టేషన్ ఆవలి పక్కకు పోయాడు.

నీళ్ళులేని వాగు, దాని మీద ఒక చిన్నవంతెన ఉన్నాయి అక్కడ. చెంబేడు చెరువుగట్టు దాటిన తర్వాత ప్రారంభం అయ్యే అడవి దారి అటు తిరిగి ఇటు తిరిగి ఆ వంతెన మీదుగానే బుంగిడి పట్టణం లోకి ఎంటర్ అవుతుంది.

మోటార్ బైక్ మీద వచ్చిన మనిషిని చూడగానే, గబగబా ఎదురుపోయారు ఆల్రెడీ అక్కడ నిలబడి ఉన్న అరడజను మంది దృఢకాయులు.

'మీరు ఫోను చేయగానే వచ్చి నిలబడ్డాం. ఇంతవరకూ ఎవరూ ఇటుగా రాలేదు. ఒక్క జీపు కాదు గదా. తోపుడు బండి కూడా కనిపించలేదు' వినయంగా నిలబడి విషయం ఏమిటో చెప్పాడు వారిలో ఒకతను.

బైక్ దిగి స్టాండు వేశాడు ఆ మనిషి. వేగంగా ఒక అడుగు ముందుకు వేసి ఆ వ్యక్తి చెంప పగిలిపోయేటట్టు కొట్టాడు. ఒకటే దెబ్బ. కరెంటు స్తంభం ఏదో పక్కకు వంగి తన చెంపకు తగిలినట్లు తగిలి ఒక పక్కకు పడిపోయాడు ఆ వ్యక్తి. వెనుక ఉన్న వాళ్ళు అదిరిపడి గట్టిగా పట్టుకోబట్టి కాళ్ళు నిలదొక్కుకున్నాడు గాని, లేకపోతే వంతెన మీద నుంచి వాగులోకి పల్టీకొట్టి ఉండేవాడు.

'ఎందుకు కొట్టారు? ఏం తప్పు జరిగింది?' చెంపను తడుముకుంటూ అస్పష్టంగా అడిగాడు అతను.

'తప్పా తప్పున్నరా?.. దివిటీలు పట్టుకుని నిలబడినట్టు వంతెనకు అడ్డంగా మీరు నిలబడితే ఆడు తలకాయ వంచుకుని ఇటుగా వచ్చేస్తాడా? మీరు ఎవరో ఎందుకు ఇక్కడ నిలబడ్డారో తెలుసుకోలేనంత చవట అనుకున్నారా? గట్టిగా మాట్లాడితే వచ్చిన దారినే వెనక్కి తిరిగి మళ్ళీ చెంబేడు పొలిమేరల్లోకి వెళ్ళిపోయి ఉంటే ఏం చేస్తారు? మతిలేని వెధవలు మీరందరూ. ముందుచూపులేని మట్టి బుర్రలు...' అంటూ మొదలుపెట్టి, వాళ్ళు గగుర్పొడిచే తిట్లను కూడా ఉపయోగించాడు ఆ మనిషి.

'తప్పయిపోయింది. అంత దూరం ఆలోచించలే... వెనుకాముందు చూసుకోకుండా వచ్చేస్తాడని అనుకున్నాం" అంటూ పక్కకు తిరిగి తన వారందరికీ సైగ చేశాడు ఆ వ్యక్తి.

వంతెన మీదినుంచి అవతలికి పరిగెత్తారు అందరూ. మట్టి రోడ్డుకు అటూఇటూ ఉన్న చెట్ల చాటుకు పోయి నిలుచున్నారు.

'మీరు వెళ్ళిపోవచ్చు. పని పూర్తి అయిపోగానే ఫోను కొడతా?' తన చెంప పగలకొట్టిన మనిషికి చెప్పాడా వ్యక్తి.

'జాగ్రత్తగా ఉండండి. తేడా వచ్చిందంటే మీ అందరినీ ఈ వంతెన కిందే పూడ్చిపెట్టాల్సి వస్తుంది' అంటూ బైక్ స్టాండు తీసి బస్‌స్టేషన్ వైపు పోనిచ్చాడు ఆ మనిషి.

'ఏంటన్నా... ఉట్టి పుణ్యానికి చెంపదెబ్బ తిన్నావు. మనం చేసిన తప్పేంటి?' మోటార్ బైక్ కనుచూపు మేర దాటి పోయేదాకా చెట్లచాటునే నిలబడిన వాళ్ళు, అది కనుమరుగు అయిన వెంటనే తిరిగి రోడ్డు మీదికి వస్తూ ఆ వ్యక్తిని అడిగారు.

'అప్పచెప్పిన పనిని పూర్తి చేసిన తర్వాత అడుగుతాను. ఏదిఏమైనా ఈ మధ్య ఈళ్ళకి చెయ్యి విసురుడు జాస్తి అయిపోయింది. ఇక తలచుకోవటం అనవసరం' అంటూ చేయి ఊపాడు ఆ మనిషి.

ఒకరి తరువాత ఒకరుగా మళ్ళీ చెట్లచాటుకు

## లావణ్యే కావాలన్న హీరో



**టా**లీవుడ్‌లో జోరు మీదున్న హీరోయిన్లలో లావణ్య త్రిపాఠి పేరు ముందు వినిపిస్తోంది. మొదటి సినిమాతోనే ప్రేక్షకుల మనసు దోచిన ఈ అందాల రాక్షసి చేసిన సినిమాలు తక్కువే అయినా, సక్సెస్ రేటు సూపర్‌గా ఉండడంతో చాలామంది హీరోలకు లావణ్య మంచి ఆప్షన్ అయింది. టాలీవుడ్‌లో కొందరు హీరోలు లావణ్యే కావాలని పట్టుపడుతున్నారట కూడా! ఆ జాబితాలో వచ్చి చేరాడు శర్వానంద్. మినిమం గ్యారంటీ హీరోగా పేరున్న శర్వానంద్ తన కొత్త సినిమాలో లావణ్య కావాలని పట్టుపట్టాడట! ఈ సినిమాలో అక్ష కూడా ఓ లీడ్ రోల్ చేస్తోంది. ఈ సినిమాలో మెయిన్ హీరోయిన్‌గా లావణ్యను ఎంపిక చేశారన్నది తాజా సమాచారం! ఈ సినిమాకు చాలా మంది హీరోయిన్ల పేర్లు పరిశీలనలోకి వచ్చినప్పటికీ లావణ్య పేరుకే శర్వానంద్ ఓటు వేశాడట! లావణ్య డేట్లు కొద్దిగా ఇబ్బంది అయినా సర్దుకుపోవడానికి రెడీ అని చెప్పాడట కూడా!

బయలు దేరారు అందరూ. అంతకుముందు మాదిరి వేగంగా పోయి నిలబడి ఉంటే చాలా బాగా ఉండేది. తాపీగా తీరికగా అడుగులు వేసేసరికి - తమ గుట్టురట్టు అయినట్లు గమనించడం వారెవరికీ సాధ్యపడలేదు.

●●●

'ఆపు తల్లీ.. ఇంజన్‌ని ఆపేయ్' ఉన్నట్లుండి హెచ్చరించాడు అతను. ఒక చేత్తో నుదుటి మీదికి వాలుతున్న ముంగురులు సవరించుకుంటూ, రెండవ చేత్తో సుతారంగా స్టీరింగ్ కంట్రోల్ చేస్తున్న పిచ్చమ్మి అదిరిపడినట్లు బ్రేకుల మీద కాలువేసి జీప్‌ని ఆపేసింది.

ఆమె కంటే వేగంగా చేతిని జాచి ఇంజన్ ఆఫ్ చేసేశాడు అతను.

'ఎందుకు? ఏమయిందిప్పుడు?' అతను ఎందుకు అలా చేశాడో అర్థం కానట్టు అయోమయంగా చూస్తూ అడిగింది ఆమె.

'చీకటి రాత్రి. చీమ చిటుక్కుమన్నా పెద్దగా వినబడేంత నిశ్శబ్దం. ఇంజన్ మోత చాలాదూరం వినిపిస్తుంది' కనులు చిట్లించి ముందుకు చూస్తూ అన్నాడతను.

'లైట్లు వేయలేదు. బండి వస్తున్నట్టు తెలియదు కదా' అప్పటికి అరగంట నుంచీ హెడ్‌లైట్లు వేయకుండా బండి నడుపుతున్న సంగతి అతనికి గుర్తుచేసింది ఆమె.

'అలాగా... అయితే అటు చూడు..' అంటూ చేతిని ముందుకు జాచాడు అతను.

తలను ముందుకు వంచి పట్టిపట్టి చూసింది ఆమె. పది క్షణాల తరువాత ఆశ్చర్యపోతున్నట్లు గుండెల మీద చెయ్యి వేసుకుంది.

'చీకట్లో కలిసిపోయినట్లు కదలకుండా నిలబడ్డారు. నీకు ఎలా తెలిసింది?' అతన్ని అడిగింది.

'అదృష్టం బాగుండి చెట్లచాటుకు వెళ్ళకముందే కనిపించారు' అంటూ సీట్లో నుంచి కిందికి దిగాడు అతను.

'రోడ్డు మధ్యన ఉంటే ఎవరికైనా కనిపించే ప్రమాదం ఉంది. పక్కకు పెట్టేదాం' అంటూ జీప్ వెనక్కి పోయి బలంగా ముందుకు నెట్టే పని మొదలు పెట్టాడు.

సున్నితంగా స్టీరింగ్ తిప్పి అతను కోరుకున్న ప్రదేశంలోకి జీప్‌ని చేర్చింది ఆమె. తను కూడా కిందికి దిగి ప్రశ్నార్థకంగా చూసింది.

తిండి తిప్పలు అనే అవసరాల గురించి పట్టించుకోకుండా ప్రయాణం చేస్తున్నాడు గాని, కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది అతని ముఖంలో విపరీతమైన నీరసం.

'ఇదేమాదిరి ఇంకో రెండుమూడు గంటలు జీప్‌లో కూర్చుంటే నిన్ను ఎవరోవచ్చి ఏదో చేయవలసిన అవసరం లేదు. నీ అంతట నువ్వే కళ్ళు తేలవేసి కిందపడిపోతావు' తన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా అతనికి చెప్పింది ఆమె.

'నా అంతట నేనుగా కళ్ళు తేలవేయటానికి నాకు ఎటువంటి అభ్యంతరం లేదు తల్లీ. వాళ్ళ చేతులకి చిక్కి మాత్రం ప్రాణాలు వదిలేది లేదు. ఇంకోసారి ఆ ప్రత్యక్ష నరకంలో అడుగుపెట్టేది అంతకన్నా లేదు. నాయాళ్ళూ, నలుగురినైనా నాతో పాటు తీసుకుపోతాను.. అంతే' కచ్చగా అన్నాడు అతను.

'ప్రత్యక్ష నరకం? ఏమిటది?' ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

'అది నీకు అనవసరం తల్లీ. తెలియకుండా ఉండటమే చాలా మంచిది' అంటూ అటూ ఇటూ చూశాడు అతను.

పది అడుగుల దూరంలోనే ఉంది ఒక మర్రిచెట్టు. ఎవరో కావాలని అక్కడ అమర్చి ఉంచినట్లు పెద్ద బండరాయి ఒకటి దాని కింద కనిపిస్తోంది.

'నేను పది పదిహేను నిమిషాల్లో వచ్చేస్తాను తల్లీ. అంతవరకూ నువ్వు ఈ బండమీద కూర్చో. ఎట్టి పరిస్థితిలోను నా వెనకాల రావద్దు' అంటూ చనువుగా ఆమె చేయి పట్టుకుని బండమీద కూర్చోబెట్టాడు' నేను రావటం ఆలస్యం అయితే నువ్వు ఇక్కడ ఆగాల్సిన అవసరం లేదు. జీప్‌ని వదిలేసి ఊళ్ళోకి వెళ్ళిపో' అన్నాడు.

'ఎందుకు వదిలేయాలి? జీప్‌లోనే ఎందుకు పోకూడదు?' అడిగింది ఆమె.

'జీప్ గుర్తుపట్టారంటే, నువ్వు నాకు సాయం చేసినట్టు వాళ్ళకి తెలిసిపోతుంది. నా మీది కచ్చ నీ మీదకి కూడా వచ్చేస్తుంది. నేను తిరిగి రాకపోతే, నీ దారి ఏదో నువ్వు చూసుకోవటం బాగుంటుంది' అంటూ జేబులో నుంచి తన సంపాదన బయటికి తీసి ఆమె చేతిలో పెట్టాడు.

'ఇప్పుడు ఇవి దేనికి నాకు?' అడిగింది ఆమె.

'నేను రాకపోతే... ఇవి నాకు ఉపయోగపడవు. నీ దగ్గర ఉంటే నీకు ఉపయోగపడతాయి, ఉంచుకో'

అంటూ ఆమె సమాధానం కోసం ఎదురుచూడ కుండా రోడ్డు పక్కనే నడుస్తూ ముందుకు వెళ్ళి పోయాడు అతను.

అతను తన చేతిలో పెట్టిన నోట్లు మూడింటినీ చిన్న ఉండగా చుట్టి పట్టుకుంటూ కనులు చిట్లించి అతను వెళుతున్న వైపే చూస్తూ కూర్చుంది ఆమె.

●●●

'అన్నా... ఒకసారి అలా కొంచెం ముందుకు పోయి వస్తాను' ఉన్నట్లుండి అడిగాడు చెట్లచాటున నిల బడి ఉన్న దృఢకాయుల్లో ఒకతను తమ లీడర్‌ని.

'ఇప్పటిదాకా బాగానే ఉన్నావ్. ఇంతట్లోనే ఏమ యిందిరా నీకు' ఆశ్చర్యంగా అడిగాడు అతన్ని లీడర్.

'అడ... ఆ మర్రిచెట్టు దగ్గర ఏదో కదిలిందే. అదేంటో ఓపాలి చూసి వస్తా' అన్నాడు ఆ అనుచరుడు.

'సర్లే. రోడ్డు ఎక్కకు. పక్కల్నించి పో. చప్పుడు చేయొద్దు' అన్నాడు లీడర్.

సగం మడిచి ఉన్న పంచె మరింత గట్టిగా బిగించుకుంటూ, తాను చూసిన మర్రిచెట్టు దగ్గరికి బయలుదేరాడు ఆ అనుచరుడు.

పిచ్చమ్మిని తను మర్రిచెట్టు కింద ఉన్న బండ మీద కూర్చోబెట్టే సమయంలో ఆ మనిషి తమ కద లికల్ని గమనించాడని అర్థం అయిపోయింది ముందుకు




వస్తున్న వెట్టికి.

అడుగులు వేయటం ఆపి, ఒక చెట్టుచాటున నిలబడి పోయాడతను ఊపిరి బిగపట్టి.

దృష్టినంతా దూరంలో ఉన్న మర్రిచెట్టు మీదనే కేంద్రీకరించి వస్తున్న ఆ మనిషికి తెలియలేదు ఆ విషయం.

రెండు అడుగుల దూరంలోకి వచ్చిన వెంటనే, కంటికి కనిపించనంత వేగంతో కదిలాడు వెట్టి. ఒక చేతిని అతని నడుము చుట్టూ చుట్టాడు. రెండవ చేతిని నోటి మీద వేసి అదిమాడు.

వదిలించుకోవటానికి అతను ప్రయత్నించక ముందే చెట్టు వెనక్కి లాగి వేయాలని, తెలివి తప్పే టట్లు బలంగా రెండు దెబ్బలు వేయాలని అతని ఆలోచన.

గంటలు గడుస్తున్న కొద్దీ అధికం అయి పోతున్న నీరస పరిస్థితిని అతను సరిగ్గా అర్థం చేసు కోలేకపోవడం వల్ల వచ్చింది ఆ చిక్కు.

నోరు అదమబడినా, నడుము బంధింపబడినా లెక్కచేయలేదు ఆ దృఢకాయుడు. ఒక్కసారిగా గాలి లోకి ఎగిరి అతని పట్టులోనుంచి బయటపడ్డాడు.

కళ్ళు బైర్లు కమ్మినంత పని అయింది వెట్టికి - తూలి పక్కకు పడిపోబోయి, అతి ప్రయత్నం మీద నిలదొక్కు కున్నాడు.

'రండిరోయ్... వచ్చేయండి... వచ్చేయండి' చెవులు చిల్లులు పడిపోయేటట్లు అరవటానికి నోటిని తెరి చాడు దృఢకాయుడు. అరుస్తూనే రోడ్డు మధ్యకు జంప్ చేయబోయాడు.

దబీమని అతని తల మీద పడింది గొర్రె తలకాయంత లావుగా ఉన్న బండరాయి ఒకటి. సుకు మారంగా ఉన్న చేతులు రెండు అతని షర్టు ముందు భాగాన్ని వడిసి పట్టుకుని విసురుగా చెట్టు వెనక్కి లాగేశాయి.

అరుపు బయటికి రాకముందే కళ్ళు తిరిగి, తెలివి తప్పిపోయింది దృఢకాయుడికి. చొప్పదంట్ల మోపు తూలినట్లు ముందుకు తూలి చెట్టు వెనుక భాగంలో ఉన్న పల్లపు ప్రదేశంలో బోర్లా పడిపోయాడు.

చీలమండల్ని దాటి కాలిబొటన వేళ్ళను కూడా కవర్ చేస్తున్న చీర అంచు తన కదలికలకు అడ్డుపడ కుండా ముని వేళ్ళతో కుచ్చిళ్లను కొద్దిగా ఎత్తి పట్టు కుని, ఎడమ పాదంతో ఆ వ్యక్తి గొంతును బలంగా అదిమింది పిచ్చమ్మి.

'నిన్ను బండమీది నుంచి కదలవద్దని చెప్పాను కదా తల్లీ. నువ్వెందుకు వచ్చావ్?' బ్యాలెన్స్ సరి చేసు కుని ముందుకు వంగుతూ చిరుకోపంతో అడిగాడు వెట్టి.

'నేను కదలకుండా అక్కడే కూర్చున్నట్లయితే, నువ్వు ఈ పాటికి ఈ లోకంలో నుంచి ఇంకేదో లోకంలోకి వెళ్ళిపోయి ఉండేవాడివి. అరిచి అందరినీ హెచ్చరించే వాడు' నడుము మీద చేతులు వేసుకుని, నవ్వుతూ చెప్పింది ఆమె.

మరింత కోపంగా చూడబోయి, ఆ పని చేత కాక తను కూడా నవ్వేశాడు అతను. 'రెండోసారి రక్షిం చావు నన్ను. గట్టిగా గుర్తుపెట్టుకో.. నేను తిరిగి ఈ బాకీ తీర్చేటప్పుడు మాట తేడా రాకూడదు' అంటూ మళ్ళీ ముందుకు నడవటం మొదలుపెట్టాడు.

'వట్టి చేతులతో నువ్వు ఎవరినీ ఏమీ చేయలేవు' చిన్నగా చెప్పింది ఆమె అతని వెనకే నడుస్తూ.

కిందికి వాలి ఉన్న ఒక కొమ్మను విరిచాడు అతను. అడ్డంగా ఉన్న రెమ్మల్ని దూసేసి, బాణాకర్ర మాదిరి పట్టుకున్నాడు.

●●●

'ఏడిరా వాడు? వెళ్ళి చాలా సేపయింది. ఇంకా రాడే మిటి?' విసుగునిండిన కంఠంతో మిగిలిన వారిని అడిగాడు దృఢకాయుల లీడర్.

'ఇదేదో వింతగానే ఉంది. అందరం కలిసి అటు పోయి చూస్తే బాగుంటుంది' వెంటనే సమాధానం ఇచ్చాడు ఒక అనుచరుడు.

పదిక్షణాలు ఆలోచించి తల ఊపాడు లీడర్. జీప్ వస్తున్న శబ్దం మనకి ఇంపార్టెంటు. అందుకు రెడీగా ఉండండి. వినబడగానే రెడీ అయిపోవాలి' అంటూ తనే అందరికంటే ముందుగా నడిచాడు.

'అన్నా అదిగో... అదిగో జీప్... అదిగో' వంద అడు గుల దూరం పోయిన వెంటనే బిగ్గరగా అరిచాడు ఒక అనుచరుడు.

అదిరిపడి అతను చూపించిన వైపు చూశా రందరు. రోడ్డు పక్కన ఆగి ఉన్న జీప్‌ని చూడగానే, రయ్‌మంటూ అటుకేసి పరుగు మొదలు పెట్టారు.

నాలుగు అడుగులే వేశాడు ఒకతను. ఉన్న ట్లుండి రోడ్డు పక్క నుంచి విసురుగా వచ్చి అతని ముఖానికి తగిలింది పచ్చిగా ఉన్న చెట్టుకొమ్మ.

పగిలిపోయింది ముఖం. కళ్ళముందు రంగు రంగుల మెరుపులు ప్రత్యక్షం అయ్యాయి కాబోలు, చేతులతో ముఖాన్ని, కళ్ళను అదుముకుంటూ కింద పడిపోయాడు అతను.

'ఎవరు? ఎవరు? ఏమిటి?' కంగారుగా అరుస్తూ గిరుక్కున వెనక్కి తిరిగారు అందరూ.

చెట్లచాటు నుంచి రోడ్డు మీదికి వచ్చేశాడు వెట్టి. ఊపిరి బిగపట్టి చెట్టుకొమ్మని గిర్రుగిర్రున తిప్పాడు.

అటువంటి పరిస్థితి ఎదురవుతుందని ఊహించక పోవడం వల్ల, ఆత్మరక్షణ చేసుకోలేకపోయారు దృఢ కాయులు అందరూ, లీడర్‌తో సహా.

తలలు పగిలిపోయాయి. సమ్మెట దెబ్బలు పడినంత గట్టిగా గుండెల మీద పడ్డాయి దెబ్బలు.

జీపులో వచ్చే మనిషిని కాళ్ళు చేతులు కదల కుండా కట్టి పడవేసి తమతో తీసుకుపోవాలన్న కోరికతో వచ్చినవాళ్ళు కాస్తా, తమ ప్రాణాలు దక్కితే చాలని అనుకున్నట్లు దూరంగా పరుగులు తీశారు.

'ఎంతో దూరం పోరు. మళ్ళీ వెనక్కి వచ్చే స్తారు. ఫోన్లు చేసి ఊళ్ళో ఉన్నవాళ్ళని హెచ్చ రిస్తారు' వెట్టిని హెచ్చరించింది పిచ్చమ్మి.

చెట్టుకొమ్మని అవతలికి విసిరేసి, ముఖం మీది నించి కనులలోకి జారుతున్న చెమటను చేతులతో అద్దుకున్నాడు వెట్టి.

'జీప్‌లో పోతే తేలికగా గుర్తు తెలిసిపోతుంది. పరి గెత్తటమే చాలా మంచిది' అంటూ ఆమెను వంతెన కేసి కదలమని సైగ చేశాడు.

'నేను వెళతాను సరే. మరి నువ్వు?" అడిగింది ఆమె.

'సాధ్యమైనంతవరకూ నువ్వు నేను కలిసి వీళ్ళ కంట పడకూడదు తల్లీ. నువ్వు ముందు నేను వెనక! నువ్వెవరివో, నేనెవరినో... ఎవరైనా అడిగితే' అంటూ వేగంగా నడక మొదలు పెట్టాడు వెట్టి.

ఆరు నిమిషాలు పట్టింది. పిచ్చమ్మి వంతెనను దాటి బస్‌స్టేషన్ ముందుకు పోవటానికి. వంతెనను అధిగమించి, రోడ్డు పక్కనే ఉన్న కరెంటు స్తంభం చాటుకు పోయాడు వెట్టి.

బుర్రుబుర్రుమని మోతలు చేసుకుంటూ ఆ స్తంభం పక్కనుంచి మట్టిరోడ్డు మీదికి దూసుకు పోయాయి నాలుగు మోటార్ సైకిళ్ళు.

రెండు నిమిషాల తరువాత ఒక జీప్, దాని వెనుక ఒక అంబాసిడర్ అతి వేగంగా వచ్చేశాయి.

**(ఇంకావుంది)**

# బ్రిస్క్‌వాక్‌తో జ్ఞాపకశక్తి

బ్రిస్క్‌వాక్ వల్ల రొమ్ము కేన్సర్ వ్యాధిగ్రస్తులకు పలు లాభాలు చేకూరుతాయని అంటున్నారు పరిశోధకులు. రొమ్ము కేన్సర్ వ్యాధిగ్రస్తుల్లో ఒత్తిడి, ఆందోళన వంటివి ఎక్కువగా ఉంటాయనీ, అంతే కాకుండా వారిలో జ్ఞాపకశక్తి కూడా తక్కువగా ఉంటుందనీ పరిశోధకులు అంటున్నారు. దీని కారణంగా వీరు వ్యాధి నివారణకు ఉపయోగించే మందులు మరిచిపోవడం లేదా ఒకటికి రెండుసార్లు వేసుకోవడం లాంటి పనులు చేస్తుంటారని చెబుతున్నారు. వ్యాధిగ్రస్తులు ఈ పరిస్థితిని అధిగమించాలంటే బ్రిస్క్‌వాక్ లేదా జాగింగ్ చేయాలని వారు అంటున్నారు. కొంతమంది రొమ్ముకేన్సర్ వ్యాధిగ్రస్తుల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిలో కొందరిచేత ప్రతిరోజూ కొంత సమయం బ్రిస్క్‌వాక్, జాగింగ్ చేయించారు. మరికొందరిచేత ఎలాంటి వ్యాయామం చేయించలేదు. కొన్ని నెలల అనంతరం వీరి ఆరోగ్యపరిస్థితిని పరిశీలించగా, వ్యాయామం చేసిన వారిలో ఆత్మవిశ్వాసం పెరగడంతో పాటు జ్ఞాపకశక్తి మెరుగుపడిన విషయాన్ని గుర్తించారు. వ్యాయామం చేయని వారిలో పై రెండు లక్షణాలను పరిశోధకులు గుర్తించలేదు.






# పళ్ళు తింటే సంతోషం!

పళ్ళు తినడం వలన ఆరోగ్యంతో పాటు సంతోషం కూడా కలుగుతుంది అంటున్నారు లండన్ యూనివర్సిటీ పరిశోధకులు. రోజువారీ ఆహారంలో మనం ఎంత మేర పళ్ళను చేర్చుకుంటామో మన ఆనందం అంత మేర పెరుగుతుందని వీరి పరిశోధనలో వెల్లడైంది. సుమారు రెండువేలమంది మీద వీరు సుదీర్ఘ పరిశోధనలు నిర్వహించారు. వీరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి ప్రతిరోజూ ఆహారంతో పాటు ఐదురకాల పళ్ళు అందించారు. రెండవ గ్రూపు వారికి కేవలం ఆహారం మాత్రమే అందించారు. కొన్ని నెలల అనంతర వీరి శారీరక, మానసిక ఆరోగ్యాన్ని పరిశీలించారు. ప్రతిరోజూ ఆహారంతో పాటు పళ్ళను తీసుకున్న వారిలో పలు రకాల ఆరోగ్యసమస్యలు తగ్గుముఖం పట్టగా, కేవలం ఆహారం మాత్రమే తీసుకున్న వారిలో శారీరక ఆరోగ్యంతో పాటు మానసిక ప్రశాంతత తగ్గడం వీరి దృష్టికి వచ్చింది. కేవలం పళ్ళు తీసుకోకపోవడం వలనే వీరిలో ఈ మార్పులు కనిపించాయా? లేక మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద వీరు పరిశోధనలు నిర్వహిస్తున్నారు.





# పాస్తాతో వెయిట్ లాస్?

పాస్తా తింటే బరువు పెరుగుతారన్నది నిజం కాదు అంటున్నారు ఇటలీ పరిశోధకులు. గత అధ్యయనాల ప్రకారం పాస్తా తింటే ఊబకాయం, తద్వారా ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయన్న భయం ప్రజల్లో ఉండేదనీ, ముఖ్యంగా మహిళలు ఎంత ఇష్టమున్నా పాస్తాకు దూరంగా ఉండేవారనీ పరిశోధకులు అంటున్నారు. తాజా అధ్యయనాల ప్రకారం ఇక నుంచి అలాంటి భయాలు పెట్టుకోవలసిన అవసరం లేదట. సుమారు 23వేల మంది మహిళల మీద వారు పరిశోధనలు నిర్వహించారు. వీరందరికి కొన్ని రోజుల పాటు క్రమం తప్పకుండా పాస్తాను ఆహారంగా ఇచ్చారు. కొన్ని రోజుల అనంతరం వీరి బరువును, ఆరోగ్య పరిస్థితిని పరిశీలించారు. పాస్తా తీసుకున్న మహిళల్లో బరువు పెరగడం కానీ, ఆరోగ్య సమస్యలు కానీ పరిశోధకులు గుర్తించలేదు. పాస్తా తిన్నంత మాత్రాన బరువు పెరుగుతారన్న విషయాన్ని వారు కొట్టిపారేశారు.

# రోగనిరోధక శక్తిని తగ్గించే నిద్రలేమి

నిద్రలేమి పలు రకాల రుగ్మతలకు కారణం అవుతుందన్న విషయం తెలిసిందే! నిద్రలేమి కారణంగా రోగనిరోధక శక్తి తగ్గుతుంది అంటున్నారు నిపుణులు. నిద్రలేమి కారణంగా జీవక్రియలు మందగించడమే కాకుండా వ్యాధిగ్రస్తుల్లో ఇన్‌ఫెక్షన్లు సోకే అవకాశం ఎక్కువగా ఉంటుందని ఇటీవలి అధ్యయనాల్లో వెల్లడైంది. వేళకు ఆహారం, వ్యాయామం చేయడం వల్ల గాఢనిద్ర పడుతుంది. ముఖ్యంగా వ్యాధిగ్రస్తులు నిద్రలేమిని ఏ మాత్రం నిర్లక్ష్యం చేయకూడదని నిపుణులు సూచిస్తున్నారు. నిద్రలేమి కారణంగా పలు వ్యాధులు వచ్చే అవకాశం ఉందన్న సంగతి తెలిసిందే!



-అవినాష్



# గేమ్ ఆఫ్ లైఫ్

-కంఠంనేని రాధాకృష్ణమూర్తి 7

**లడ్డు తీయగా ఉంటుంది.**
**సంతోషం కూడా తీయనిదే.**
**సంతోషకరమైన జీవితం ఇంకా తియ్యగా ఉంటుంది.**
**ప్రతి మనిషికీ జీవిత అంతిమ లక్ష్యం 'సంతోషం' అంటే అతిశయోక్తి కాదు.**
**ఎవరెట్లా నిర్వచనం చెప్పుకున్నాగానీ జీవితంలో ప్రతివాళ్ళూ వీలైనంత ఎక్కువ సంతోషం పొందటానికే ప్రయత్నిస్తారు.**

# లడ్డూ కావాలా బాబూ?

మీరొక మధ్యతరగతి మనిషి అనుకుందాం. మంచి ఉద్యోగం కోరుకుంటారు.

ఎందుకని?

ఉద్యోగం ఉంటే క్రమంతప్పకుండా ఆదాయం లభిస్తుంది. మంచి ఉద్యోగమైతే ఇంకా ఎక్కువ డబ్బులు వస్తాయి.

డబ్బు ఎందుకు? భద్రతతో సుఖవంతమైన జీవితాన్ని కుటుంబ సభ్యులతో గడపడానికి.

ఏమి లాభం దీని వల్ల?

సంతోషంగా ఉంటాం. జీవితం రోజూ లడ్డూ తింటున్నట్టుంటుంది.

జీవితంలో మనం ఎంత సక్సెస్ సాధించాం అనేదానికి మనం ఎంత సంతోషంగా ఉంటున్నా మనేదే కొలమానం!

### ఫెయిల్యూర్ లైఫ్‌కి కారణం ఏమిటి?

ఎంత ఎక్కువ సంతోషం ఉంటే అంత పెద్ద సక్సెస్ సాధించినట్లు! సంతోషంగా ఆ మనిషి తాలూకు ఆరోగ్యం కూడా జతకలుస్తుంది. మనం చాలా డబ్బు, గొప్పపేరు సంపాదిస్తాం. మంచి హోదా, అధికారం, దర్పం ఉంటుంది. కానీ మనం సంతోషంగా ఉండం. దీనికి అర్థం ఏమిటి?

మీరు పెద్ద ఫెయిల్యూర్ అన్నమాట! మనిషిగా మీ పట్ల మీకుండాల్సిన ప్రాథమిక బాధ్యతకు తిలోదకాలిస్తున్నారు! లోకంలో ప్రతి మనిషీ తన సుఖ సంతోషాలకు ప్రాధాన్యమిస్తూ బతకడం సహజం. ఆ ప్రయత్నంలో చాలామంది విఫలమై నిస్సంతోషం, అసంతృప్తీ కూడగట్టుకుంటున్నారు. ఇందుకు కారణం వాళ్ళలోని నెగెటివ్ ఆలోచనలే. మనిషిని సంతోషానికి దూరంగా ఉంచే ముఖ్యమైన అంశం, నెగెటివ్ ఆలోచనలు, నెగెటివ్ భావోద్వేగాలు (నెగెటివ్ ఎమోషన్స్).

మనిషి జీవితంలో ఎదురయ్యే ప్రతి సమస్యకూ మూలం అతడిలోని నెగెటివ్ ఎమోషన్స్ అని చెప్పడం అతిశయోక్తి కాదు. వాటిని తుడిచి పెట్టేస్తే చాలా సమస్యలకు ఫుల్‌స్టాప్ పెట్టేసిన వాడవుతాడు మనిషి.

కాని ఇది సాధ్యమేనా? అంటే సాధ్యమే. అదెలాగంటే...

### మీ తిక్కను దార్లోపెట్టండి

మన మనస్సులో వందలాది ఆలోచనలు కదలాడుతుంటాయి. కానీ వాటిని ఒక ఆర్డర్‌లో ఉంచుకోకపోతే ఒకదాన్ని తోసుకుంటూ మరొకటి వచ్చి ట్రాఫిక్‌జాం అయినట్టుగా, గజిబిజిగా గందరగోళానికి దారితీసి తిక్కతిక్కగా ప్రవర్తిస్తాం. ఈ ఆలోచనల్ని ఒక ఆర్డర్‌లో పెడితే, మనలో ప్రకోపించే తిక్క ఒకదార్లో కొస్తుంది. అలా తిక్కను దార్లో పెట్టాలంటే, కొంత ప్రశాంతత, క్రమశిక్షణ అవసరం. మనస్సుకు సంబంధించి ఇదొక లక్షణం. మనసుకు సంబంధించి, మరో కోణాన్ని చూస్తే, మన మనసు ఏకకాలంలో ఒక ఆలోచనే చేయగలుగుతుంది. ఏకకాలంలో రెండు ఆలోచనలు చేయలేదు. అంటే ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవు అన్నట్టుగా, మనస్సులో ఒక సమయాన రెండు ఆలోచనలు జరగవు. ఒక ఆలోచన మాత్రమే చేయగలం. ఆ ఆలోచన పూర్తయ్యాక లేదా ఆ ఆలోచన పక్కకునెట్టేస్తేనో మాత్రమే మరో ఆలోచన చేయగలుగుతాం.

### మధురానుభూతులు గుర్తుచేసుకో

'ఒక ఒరలో రెండు కత్తులు ఇమడవు' అనే సూత్రాన్ని నెగెటివ్ ఆలోచనల విషయంలో కూడా అమలు చేయవచ్చు. మన మనస్సులో ఒక నెగెటివ్ ఆలోచన కదులుతోందనుకుందాం. ఎవరిమీదన్నా కోపంతోనో లేదా ద్వేషం, అసూయ, అవమానాలతో కుతకుతలాడిపోతున్నామనుకుందాం. అలాంటి సమయంలో మనకు ఇష్టమైన ఆలోచన లేదా అనుభూతిని గుర్తుతెచ్చుకోవాలి. జీవితంలో జరిగిన ఒక మంచిసంఘటన, మధురానుభూతి అంటే ఎవరైనా మనల్ని మెచ్చుకోవటం, మనం సాధించిన ఫలానా విజయం (అది ఎంత చిన్నదైనా పరవాలేదు), మనల్ని ప్రేమించే లేదా మనం ప్రేమించే వ్యక్తుల్ని తలచుకోవటం లాంటి పాజిటివ్ ఫీలింగ్స్ గుర్తు తెచ్చుకోవాలి. ఆ ఫీలింగ్స్‌ని కొంతసేపు అలా కొనసాగించాలి. ఈ ఆలోచనలవల్ల మన మనస్సులో అంతకు మునుపు కదులుతున్న నెగెటివ్ ఆలోచన పక్కకు తప్పుకుంటుంది. అలా అనటం కంటే మనకు మనంగా మనలో ప్రవేశ పెట్టుకున్న పాజిటివ్ ఆలోచన లేదా పాజిటివ్ ఫీలింగ్ దాన్ని పక్కకు నెట్టేసిందనవచ్చు. ఇప్పుడు మనలో ప్రవేశించిన పాజిటివ్ ఫీలింగ్‌ని ఎంత ఎక్కువసేపు కొనసాగిస్తే అంతగా అది మన మనసులో తిష్టవేసుక్కూర్చుని అంతకుముందున్న నెగెటివ్‌నెస్‌ను కనపడకుండా తరిమేస్తుంది. ఈ పద్ధతిని దఫదఫాలుగా ఎక్కువసార్లు పాటిస్తే కాలక్రమాన నెగెటివ్







ఆలోచనలకు దూరమవుతాం. మనస్సు ఏక కాలంలో పాజిటివ్ ఆలోచన లేదా నెగెటివ్ ఆలోచన ఏదో ఒకదాన్ని మాత్రమే చేయగలదు. కాబట్టి జీవితంలో పాజిటివ్ ఆలోచనను లేదా పాజిటివ్ భావోద్వేగాలను ఎప్పటికప్పుడు కొని తెచ్చుకుంటూ మనస్సునిండా నింపుకోవాలి. ఒక విషయం ఏమిటంటే, నెగెటివ్ ఆలోచనలు చాలా తేలిగ్గా, అసంకల్పితంగా మనస్సులోకి ప్రవేశిస్తాయి. చాలామందిలో వారి మెదడు నెగెటివ్ ఆలోచనలకు డీఫాల్ట్ సెట్టింగ్ (Default Setting)గా ఉన్నట్టని పిస్తుంది.

నెగెటివ్ ఆలోచనలకు మనం పెద్దగా ప్రయత్నించాల్సిందేమీ ఉండదు. చీకటి చూరుల్లోకి గబ్బిలాలువచ్చి జేరినట్టు, మనకు తెలియకుండానే మన మనస్సులోకి నెగెటివ్ ఆలోచనలుచేరి మనల్ని కల్లోల పెడుతుంటాయి. పాజిటివ్ ఆలోచనలు అలా కాదు, అవి మనస్సులోకి రావటానికి కొంత ప్రయత్నం చేయాలి. వాటిని మాటిమాటికీ మనస్సులోకి ప్రవేశపెట్టేందుకు ప్రాక్టీస్ చెయ్యాలి. దాన్ని ఒక అలవాటుగా చేసుకోవాలి. ఇక ఆ తర్వాత పాజిటివ్ ఆలోచనల కోసం ప్రయత్నించే అవసరం ఉండదు. ఎప్పటికప్పుడు అవి మనస్సులో ప్రవేశిస్తూ మనలో పూ పరిమళం వెదజల్లుతుంటాయి. ఆవిధంగా మనం పూర్తిస్థాయి పాజిటివ్‌వ్యక్తిగా రూపుదిద్దుకుంటాం. జీవితానికి ఉపయోగకరంగా ఉండేట్లు మనల్ని మనం తీర్చిదిద్దుకోవాలంటే మొదట చేయాల్సింది మన లోని నెగెటివ్ ఆలోచనల్ని, నెగెటివ్ తత్వాన్ని మనస్సు లోంచి తుడిచిపెట్టటం!

## నెగెటివ్‌నెస్ పుట్టుకతో రాదు

నెగెటివ్ ఆలోచనల్ని మనస్సులోంచి తీసేయాలంటే మొట్టమొదట అసలవి ఎక్కడినుంచి వస్తాయో తెలుసుకోవాలి. పుట్టుకతో ఎవరికీ భయాలు, నెగెటివ్ ఎమోషన్స్ ఉండవు. తల్లిగర్భం నుంచి బయట పడేనాటికి పిల్లల్లో రెండు అద్భుతమైన లక్షణాలుంటాయి అవి:

భయమనేది లేకపోవటం.

చేయాలనిపించిన దానిని ఏ మాత్రం భయ సంకోచాలు లేకుండా Spontaneousగా చేసేయటం.

పాపాయిలను గమనించండి:

- నిప్పును పట్టుకోబోతారు.
- చేతికి అందుబాటులో ఉన్న దేన్నిపడితేదాన్ని పట్టుకుని నోట్లో పెట్టుకోబోతారు. పురుగు కాని వ్వండి. పాకుతున్న పాము తలకాయ లేక తోక కానివ్వండి.
- ఎత్తైన అరుగు లేక మంచంమీద ఉంటే కిందికి జారబోతారు.

24 గంటలూ ఏదో ఒకటి చేస్తుంటారు. పకపకా నవ్వుతారు. కెవ్వున ఏడుస్తారు. ఎక్కడపడితే అక్కడ మూత్రవిసర్జన చేసేస్తారు. అందులోనే చేయిపెట్టి వేళ్ళను నోటిలో పెట్టుకుంటారు.

వాళ్ళకి భయం, బెరుకు ఉండవు. ఏది చేయాలనిపిస్తే దానిని Spontaneous గా అప్పటికప్పుడు చేసేస్తారు.

అలాంటి సమయంలో పెద్దలు వాళ్ళ భద్రత కోసం ఇది చేయకు, అది చేయకు అంటూ వారిస్తుంటారు. ఎదుగుతున్నకొద్దీ కోప్పడతారు. దండన విధిస్తారు. ఆ క్రమంలో తర్వాత్తర్వాత పిల్లలో భయం, ఎవరేమనుకుంటారో, ఎవరేమని విమర్శిస్తారోననే బెరుకు, బెదురులాంటి నెగెటివ్ ఫీలింగ్స్, నెగెటివ్ ఎమోషన్స్ చోటు చేసుకోవటం మొదలవుతాయి. తోటి వాళ్ళు స్కూలు వాతావరణంలో కూడా క్రమ క్రమంగా ఈ నెగెటివ్ ఎమోషన్స్ బలీయమవటం ప్రారంభిస్తాయి.

ఈ మొత్తం మీద తెలిసేది ఏమిటంటే నెగెటివ్ ఎమోషన్స్ పుట్టుకతో వచ్చేవికావు. నేర్చుకోవటం ద్వారా అలవడేవి.

నేర్చుకోవటం ద్వారా వచ్చేవాటిని ఆ తాలూకు ముడులు విప్పుతూ పోతుండటం ద్వారా Unlearn కావించటం ద్వారా మనస్సు నుంచి తొలగించు కోవచ్చు. పెంపకం ద్వారా కానీండి, జీవితంలో ఎదురయ్యే వివిధ విచారకర, విమర్శనాత్మక సంఘటనల వల్ల కానీండి, కొందరిలో పెద్దయ్యేసరికి నెగెటివ్ ఎమోషన్స్ మనస్సులో పూర్తిగా నాటుకుపోయి వాళ్ళు పూర్తిగా నెగెటివ్ వ్యక్తిత్వాన్ని సంతరించుకుంటారు.

వాళ్ళు ఆ వ్యక్తిత్వాన్నుంచి బయటపడాలంటే చాలా ప్రయాస పడాల్సి ఉంటుంది. మొదటగా వాళ్ళలో ఆ వ్యక్తిత్వాన్నుంచి బయటపడాలనే తాపత్రయం ఉండాలి. సమాజంలో ఆరోగ్యకర వ్యక్తిత్వంతో రాణించాలనే తపన ఉండాలి.



## నెగెటివ్‌తత్వం ఓ మహావృక్షం

నెగెటివ్ దృక్పథం జీర్ణించిపోయిన మనిషికి జీవితంలో చాలాభాగం వేరే వాళ్ళ మూలంగానే కాకుండా తన స్వంత నెగెటివ్ తత్వం మూలంగానే సమస్యలు ఏర్పడుతుంటాయి.

ఈ సంగతిని గ్రహించటం ముఖ్యం. దీనిని గ్రహించ గలిగితే అతడు లేదా ఆమె తన నెగెటివ్ తత్వం నుంచి బయట పడడానికి తొలి అడుగు ముందుకు వేసినట్లవుతుంది.

నెగెటివ్‌తత్వం జీర్ణించుకుపోయిన మనిషిలో నెగెటివ్ ఎమోషన్‌ను అతడిలో పాతుకుపోయిన ఒక మహావృక్షం లాంటిదని చెప్పాలి. ఆ చెట్టుకు పూసే మొగ్గలు అతడిలోని నెగెటివ్ ఫీలింగ్స్. వాటి కనుగుణంగా అతడు తీసుకునే చర్యలు (Actions) ఆ చెట్టుకు కాసేకాయలు. కాయలు చాలా చేదుగా ఉండి వేరేవాళ్ళకు కాకుండా అతడికే హాని కలగజేస్తుంటాయి. ఆరోగ్యకర వ్యక్తిత్వాన్ని సంతరించుకోవాలంటే అతడు మొగ్గలు, కాయలను తెంచేస్తే సరిపోదు. చెట్టుకాండం మొత్తాన్ని నరకాలి. అప్పుడు కాని అతడు నెగెటివ్‌నెస్ నుంచి విముక్తుడు కాలేడు.

## ఇతరులమీద నెపం నెట్టకు

మనిషిలోని నెగెటివ్ ఎమోషన్ అనే వృక్ష కాండం అంటే ఏమిటో తెలుసా? ప్రతి దానికీ ఇతరుల మీద నెపం వేసే తత్వం, తనకు జరిగే ప్రతి చెడు ఘటనకూ అందుకు కారణంగా అతను వేరే వాళ్ళ మీదకు నెపం నెడుతుంటాడు (Blaming).

ప్రతిదానికీ ఇతరులమీదకు నెపం నెట్టటం - Blaming అనే తత్వాన్ని తొలగించుకున్ననాడే ఏ మనిషైనా తనలోని నెగెటివ్ ఎమోషన్స్ నుంచి పూర్తిగా విముక్తుడవుతాడు.

ప్రతిదానికీ వేరేవాళ్ళమీద నెపాన్ని నెట్టడం ఎంతటి నెగెటివ్ లక్షణమో, ప్రతిదానికీ బాధ్యతను తనదిగా, స్వీకరించటం అంతటి పాజిటివ్ లక్షణం!!

ఇది చాలా గొప్ప లక్షణం. మనిషిని హుందాగా నిలబెట్టే లక్షణం.

**(ఇంకా వుంది)**

# నరక కూపం

## -సలీం

**చనిపోయాక నిజంగానే ఆ లోకంలో స్వర్గనరకాలు ఉంటాయో లేదో నాకు తెలియదు. కలికాలంలో పాప పుణ్యాల ఫలం ఈ లోకంలోనే అనుభవించక తప్పదని కదా చెప్తారు.**

**నిజమేనేమో... ఇప్పుడు నా వయసు నలభై యేళ్ళు. ఇన్నేళ్ళ జీవితంలో స్వర్గం ఎలా ఉంటుందో ఎప్పుడూ అనుభవంలోకి రాలేదు. నరకం మాత్రం ప్రతిరోజూ చూస్తున్నాను.**

నోట్లోకి నాలుగు మెతుకులు వెళ్ళాలంటే నరకయాతన పడాల్సిందే. ఎందుకు దేవుడు నా నుదుట ఇంత హీనమైన బతుకు రాశాడో... ఏం పాపం చేశానని... ఈ జాతిలో పుట్టటం నా తప్పా? పేదరికంలో మగ్గడం నా తప్పా? ఇదంతా ఆ దేవుడేగా చేశాడు. తప్పు దేవుడిదైతే శిక్ష నాకెందుకు? అసలు దేవుడున్నాడా? ఉంటే ఇంత పక్షపాతం ఎందుకు? కొందరి మీద దయ, కొందరి మీద మాత్రం కసి... నా జాతి మీద మరీను..



శవం నడుస్తున్నట్టు... నడుస్తూ ఆలోచిస్తున్నాను. మురిక్కాలువలో రాయి విసిరితే బద్ధకంగా కదిలే అలల్లా ఆలోచనలు... ఊపిరి ఆగిపోయిన కట్టెలాంటి శరీరాన్ని బలవంతంగా ముందుకు నెడ్తూ... అవును కదూ... స్వచ్ఛమైన గాలి పీల్చి ఎన్నేళ్ళయింది? ఇప్పుడు శ్వాస తీసుకోవాలన్నా భయమే. ఊపిరితిత్తులనిండా చుట్ట చుట్టుకుని పడుకుని ఉన్న దుర్గంధం... నా పద్నాలుగో ఏడప్పుడు కదూ మొదటిసారి చనిపోయింది. చనిపోయి మలమూత్రాలతో నిండి ఉన్న దారి గుండా ప్రయాణిస్తూ... నరకపు ద్వారాలు తెరుచుకుని... ఎంత బీభత్సంగా ఉందో... చనిపోతే బావుండనిపించేంత భయంకరంగా. చనిపోయాకేకదా నరకాన్ని చేరుకున్నాను. మళ్ళా చనిపోవటం ఎలానో తెలీక ఎంత నరకయాతన పడ్తుంటానో నాకే తెలుసు. ఆ దేవుడికీ తెలుసేమో.. తెల్సినా, క్రూరంగా నవ్వుకుని ఉంటాడు. నేనీ భూమ్మీదే నరకం చూడాలని నా నుదుటన రాసిన మహానుభావుడాయనేగా మరి...

ఉదయం యాద్గిరి ఫోన్‌చేశాడు. నల్లకుంట చౌరస్తా దగ్గర డ్రైనేజీ పైపు లీకవుతోందట. నీళ్ళు బైటికి పొంగడంవల్ల దుర్గంధాన్ని తట్టుకోలేక ఇప్పటికే ప్రజలు నానా ఇబ్బందులు పడుతున్నారని, దాన్ని వెంటనే బాగు చేయాలని యాద్గిరి ఆర్డర్. నాకు కడుపులో దుఃఖమేదో సుళ్ళు తిరిగింది. ప్రజలు ఇబ్బంది పడుతున్నారట. మరి నేనో.. నేనా ప్రజల్లో ఒకణ్ణి కాదా? మరి నేనెవర్ని? నా ఇబ్బంది గురించి యాద్గిరికి పట్టదా? ఈ ప్రభుత్వానికి పట్టదా? నాకు దుర్గంధం వేయదా?

పద్నాలుగేళ్ళప్పుడు మొదటిసారి డ్రైనేజీలోకి దిగడానికి ఇబ్బందిపడుతూ ముక్కులు గట్టిగా మూసుకుంటే నారాయుడు నవ్వి 'ఒరేయ్, ఇక నుంచీ దీన్నే సెంటు వాసననుకో... లేకపోతే బతకలేవు' అన్నాడు. ఎక్కడి బతుకు నారాయుడూ... ఆ క్షణమేగా నేను మనిషిగా చచ్చిపోయి, బురదలో దొర్లే పందిలానో, డ్రైనేజీలో

లుకలుకలాడుతూ బతికే బొద్దింకలానో రూపాంతరం చెందింది.

డ్రైనేజీ మూత అల్లంత దూరం ఉండగానే పాతికేళ్ళుగా అలవాటైన కంపు ముక్కుపుటాల్ని సోకి తన మురికి చేతుల్తో నన్ను తనవైపు లాక్కుంది. దానికి ఆమడ దూరంలో నిలబడి ఒక చేత్తో ముక్కుని కర్చీఫ్‌తో మూసి అసహనంగా నిల బడి ఉన్నాడు యాద్గిరి. అతనికి ఎడంగా సింగన్న గాడు నిలబడి ఉన్నాడు. నేను మరికొంత దగ్గరకు వెళ్ళటం ఆలస్యం ఊరకుక్కలా మొరగడం మొద లెట్టాడు యాద్గిరి. "ఇంతాలస్యమైందేరా... నీకు ఫోన్ చేసి జల్దీరమ్మని కదా చెప్పాను. ఎంతసేపని నీ కోసం ఎదురు చూడాలి?" అన్నాడు కళ్ళెర్ర చేస్తూ.

"నీకేం సారూ..... బయ్యిమని బండేస్కుని వచ్చే త్తావు. నా కాల్లకు సక్రాలేమీలేవుగా సారూ. నడ్సు కుంటానేగా రావాల" అన్నాను.



"సర్లె సర్లె... మొదట పన్లోకి దిగు. ఇప్పటికే నా మొగుడినుంచి ముప్ఫయ్‌సార్లు ఫోన్... జవాబు చెప్ప లేక చస్తున్నా" అన్నాడు.

సింగన్న పలకరింపుగా నవ్వి "అన్నా... బాగు న్నావా" అన్నాడు. పాతికేళ్ళకు మించని వయసు. సన్నటి మీసకట్టు. మనిషి పొట్టిగా, బక్కపల్చగా చువ్వలా ఉంటాడు. అందుకే వాణ్ణి మేమందరం సిట్టెలుక అని ముద్దుగా పిల్చుకుంటూ ఉంటాం. చిక్కగాఉన్న డ్రైనేజీ మురికినీళ్ళలో సైతం బురద మట్టలా చలాగ్గా జారిపోగల మొనగాడు.

డ్రైనేజీ మూతకున్న ఇనుప కొక్కేనికి పొడవాటి చువ్వ కొసకున్న మెలికని దూర్చి బలంకొద్దీ లాగాను. మూత అరంగుళం కూడా



కదల్లేదు. నాకు సాయంగా సింగన్న కూడా చేయి వేశాడు. అయినా కదల్లేదు. ఇద్దరం వంగి చువ్వ మొదలు దగ్గర బలంగా పట్టుకుని మూతని తెరిచాం. అప్పటివరకూ బైటికి పొంగుకొచ్చిన నీళ్ళ వల్ల పల్చగా గాల్లో తేలియాడుతున్న కంపు ఒక్కసారిగా గుప్పుమని మొహానికి తగిలింది. దుర్గంధం పదునైన కత్తిలా మారి కసుక్కున గొంతులో దిగబడినట్టు... కొన్ని క్షణాలు ఊపి రాడలేదు. ఎంత అలవాటు పడినా దీని దాడిని తట్టుకోవాలంటే ప్రతిసారీ కొత్తగా సమాయత్తం కాక తప్పటం లేదు.

చొక్కా ప్యాంటు విప్పదీసి మడతపెట్టి రోడ్డుకి ఎడం వైపున పెట్టాను. గాలికి ఎగిరిపోకుండా రాయి ఏరుకొచ్చి వాటిమీద బరువుపెట్టాను. చెప్పులు కూడా పక్కనే వదిలేశాను. ఒంటిమీద నల్లటి నిక్కరు తప్ప మరే అచ్ఛాదన లేదు. పనిలోకి దిగే ముందు ఎప్పటికిమల్లే యాద్గిరి వైపు వేడు కోలుగా చూస్తూ "మీ పెద్దసార్లతో మాట్లాడు సారూ. కనీసం సేతులకి తొడుగులు... కాల్లకి బూట్లు ఇప్పించు సారూ... గాజు పెంకులు, బ్లేడ్లు, ఇనుప తీగెలు గుచ్చుకుని వొల్లంతా ఎన్ని గాయాలైతయ్యో నీకు ఎరికే గదా" అన్నాను.

"పన్లోకి దిగడానికి నీవి చానా డిమాండ్లు న్నాయిరా. ఏదో పాతికేళ్ళబట్టి ఈ పనిలో ఉన్నావన్న ఉద్దేశంతో పిలిచి పనిస్తున్నా. సీనియర్ని కదా అని నీల్గావనుకో, తోక కత్తిరించేస్తా. నీకు కష్టంగా ఉంటే చెప్పు నీకిస్తున్న కూలీకి సగమిస్తే చాలు పొలో మంటూ రావడానికి ఇంతమంది తయారుగా ఉన్నారు" అన్నాడు తన తలమీద జుట్టుని చూపిస్తూ.

"వద్దులే సారూ... కోపమొత్తే నన్ను కొట్టు... నా కడుపు మీద కొట్టొద్దు" అన్నాను. యాద్గిరి బెదిరింపు విని చాలా భయమేసింది. అమ్మో... అలవాటైన ఈ పని తప్ప నాకు మరోపని చాతకాదు. ఈ పనీ దొరక్కపోతే ఇంట్లో అందరం పస్తులు పడుకోవాలి. నా కూతురి చదువేం కావాలి? ఇప్పుడది డిగ్రీ ఆఖరేడాదిలో ఉంది. దాని లగ్గమెలా చేయాలి? పని దొరకదేమో నన్న ఆలోచనకే ఒళ్లంతా చలి జ్వరం వచ్చినట్టు వణి కింది.

అగ్గిపుల్ల గీసి డ్రైనేజీలో వేశాను. లోపలి కెళ్ళటం ఆలస్యం భగ్గుమని చిన్న శబ్దంతో మండింది. డ్రైనేజీలోకి దిగేముందు ఇలా చేయడం వల్ల లోపల ఉండే విషవాయువులు మండి పోతాయని, ఆ తర్వాతే పనిలోకి దిగాలని నాకు పద్నాలుగేళ్ళ వయసులో ఇప్పుడు నా వయసులో ఉండిన పోచయ్య నేర్పాడు. పొగమొత్తం పోవడానికి కొంత సమయం పడ్తుంది కాబట్టి యాద్గిరి వైపు తిరిగి "సారూ" అంటూ మెడ ఎత్తి

నీళ్ళు తాగుతున్నట్టు సైగ చేశాను. "ఏది మర్చినా ఇది మాత్రం మరవ్వని నాకు తెలుసురా. అదుగో వాడి చేతికిచ్చి పెట్టాను. కానివ్వు. పని పూర్తి కాగానే నాకు ఫోన్ కొట్టండి" అంటూ స్కూటర్ ఎక్కి వెళ్ళిపోయాడు.

నేనూ సింగన్న ఓ గోడ చాటుకెళ్ళి నిలబడ్డాం. సింగన్న తన ప్యాంటు జేబులోంచి మందుసీసా తీశాడు. దాని మూత మీద రెండుదెబ్బలు కొట్టి మూత తీసి నా చేతికిచ్చాడు. అటూఇటూ చూసి సీసా ఎత్తి గటగటా సగానికి పైగా తాగేశాను. సింగన్న మిగతాది తాగి, అగ్గిపుల్ల వెలిగించి ఖాళీ సీసాలో వేశాడు. అది ఓ క్షణం భగ్గున మండి ఆరిపోయింది. ఇందాక డ్రైనేజీలో అగ్గిపుల్ల వెలిగించి వేసినప్పుడు భగ్గున మండినట్టు... దీంట్లో కూడా విషవాయువులు ఉంటాయేమో... విషం విషానికి విరుగుడేమో... ఇది పొట్టలో బడితేతప్ప డ్రైనేజీ రాక్షసి పెట్టే శారీరక, మానసిక హింసని తట్టుకోవడం కష్టం.

నీళ్ళు కలుపుకోకుండా తాగడం వల్లనేమో గొంతుకూడా భగ్గున మండింది. గమ్మత్తైన మత్తు నరాల నిండా ప్రవహిస్తూ... ఇప్పుడు ఒంటిమీద మలమూత్రాలు పాకుతున్నా మనసు పట్టించుకోదు. కుడిచేతికి నిక్కరు జేబులో ఉన్న నల్లటి కర్చీఫ్ గుడ్డ తీసి చుట్టుకున్నాను. మొదట కాళ్ళని లోపలికి జారవేసి అందులోకి దిగాను. గుండెల వరకు తాకుతూ మురికి... కుళ్ళిన కోడిగుడ్ల వాసనకన్నా భయంకర మైన వాసనేదో ముక్కుపుటాల్ని



బద్దలు కొడ్తూ... ప్రవాహానికి అడ్డుగా ఉన్న చెత్తాచెదారం తీసి బకెట్లో వేస్తున్నాను. అది నిండగానే సింగన్న దాన్ని ఎత్తుకెళ్ళి చెత్తకుండీ పక్కనవేసి వస్తున్నాడు. దాదాపు రెండు గంటలు పన్జేసినా అడ్డున్నదేదో పోయినట్టు లేదు.

ట్రాఫిక్ మొదలైంది. డ్రైనేజీ దాటుకుంటూ వెళ్ళే వాళ్ళందరూ ముక్కులు మూసుకుని అసహ్యించుకుంటూ వెళ్తున్నారు. కొందరైతే నా గుండెల మీద నుంచి కదలాడుతున్న నల్లటి చిక్కటి తారులాంటి ద్రవ పదార్థాన్ని చూసి వికా రంతో తల తిప్పుకుంటున్నారు. నాకు తెలుసు నేని ప్పుడు మనిషిలా కన్పించనని... జుగుప్సాకరమైన బొద్దింకలానో, చచ్చిన ఎలుకలానో కన్పిస్తానని... ఈ పనిలో చేరిన కొత్తలో వాళ్ళ అసహ్యమైన చూపులు చాలా గాయాలు చేసేవి. నా మీద నాకే

అసహ్యం వేసేది. నాదీ ఓ బతుకేనా... కుక్కకన్నా పందికన్నా హీనమైన బతుకనిపించేది. అయ్యలారా... అమ్మలారా... నేనిప్పుడు మునిగి ఉన్నది మీరు విసర్జించిన మల మూత్రాల్లోనే... మీదిమీకే అసహ్యమైతే మరి నాకెలా ఉంటుందో ఒక్కక్షణం ఆలోచించండి. అపుడసహ్యం కాదు నా మీద జాలి వేస్తుంది అని పెద్దగా గొంతుపోయేలా అరవాలనిపించేది. ఇప్పుడలవాటైపోయింది. దేనికీ చలించని రాయిలా... కర్ర తీసుకుని అన్నివైపులా పొడిచి చూశాను. ఎక్కడ ఏది అడ్డుకుంటోందో తెలియటం లేదు. మధ్యాహ్నం పన్నెండు కావస్తోంది.

"సింగా... నువ్వు పూనుకోవాల్సిందేరా" అన్నాను. అప్పటికే పది బక్కెట్లకు పైగా చెత్తాచెదారం తీసి వేయడం జరిగింది. నేను పైకొచ్చి గుడ్డతో ఒంటి మీదున్న మురికిని వీలైనంతగా తుడుచుకున్నాను. సింగన్న ఎలుకపిల్ల కలుగులోకి పుసుక్కున దూరినట్టు దూరిపోయాడు. అతనికి పొడవాటి తాడు అందించాను. దాన్ని నడుముకి కట్టుకుని లోపల అదృశ్యమైపోయాడు. తల మాత్రం మునక్కుండా జాగ్రత్తపడ్తూ వాడు వీలైనంత లోపలికెళ్ళి ఎక్కడ అడ్డుందో కనుక్కుని దాన్ని తొలగించి రావాలి. వెంటనే అయ్యే పని కాదు. తాడు మరో కొసని చేతిలో పట్టుకుని ఆలోచనల్లో మునిగిపోయాను.

వచ్చేవారం అమ్మాయిని చూసుకోడానికి మగపెళ్ళివారు వస్తున్నారు. నా గుండెల్లో అలజడిగా ఉంది. నాకు పెళ్ళీడు వచ్చాక ఎవ్వరూ పిల్లనివ్వడానికి ముందుకు రాలేదన్న విషయం ఇనుప ముల్లులా గుచ్చుకుంటూ ఉంది. రోజంతా దుర్గంధంలో పడి శ్లేష్మంలో కొట్టుకునే ఈగలాంటి, నిండా మురికిని మోసేవాడికి పిల్లనెవరిస్తారు? ఎన్ని సబ్బులు అరగదీసి ఒళ్ళంతా కడుక్కున్నా వదిలి పెట్టకుండా వెంటాడే భయంకరమైన వాసనని ఎవరు మాత్రం భరించగలరు?

'మనం సచ్చాకేరా ఈ గబ్బు మనల్ని వదిలేది' అనేవాడు పోచయ్య. 'నేనూ పెళ్ళాం కోసం నానా తంటాలు పడ్డాను తెలుసా' అని పసిపిల్లాడిలా నవ్వే పోచయ్య చివరికి తన కూతుర్నే ఇచ్చి పెళ్ళిచేశాడు. ఇప్పుడు నేను డ్రైనేజీలు శుభ్రం చేసేవాడినని తెలిస్తే ఆ పిల్లాడి తల్లిదండ్రులు ఈ సంబంధానికి ఒప్పుకుంటారా? మధ్యవర్తి మాత్రం పారిశుధ్య కార్మికుడినని చెప్పాడట. మమ్మల్ని కూడా అలానే చెప్పమన్నాడు.

ఆలోచనల్లోనే రెండు గంటలు గడిచిపోయాయి. తాడు చాలాసేపటినుండి కదలకుండా ఉందన్న విషయం చప్పున గుర్తొచ్చింది. తాడు మెల్లగా లాగి చూశాను. అటునుంచి ఎటువంటి కదలికా రాలేదు. గట్టిగా లాగాను. మరికొంత కదిలింది. చేతులు వణుకుతున్నాయి. మెల్ల మెల్లగా తాడు లాగాను. నడుం దగ్గర నుంచి పూర్తిగా ముందుకి వంగిపోయి తల నీళ్ళలో మునిగిపోయి సింగన్న శవం కన్పించింది. పెద్దగా కేక పెట్టి తాడుని వదిలేశాను.

•••

సింగన్న అర్థాంతరపు చావు నన్ను బాగా కలచివేసింది. వాళ్ళ ఊర్లో పొలం పనులకు వెళ్ళేవాడు. పంటలు పండక రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్న తరుణంలో పొలం పనులు దొరక్క పట్నానికి వలస వచ్చాడు. పెళ్ళిచేసుకుని ఇద్దరు పిల్లల్ని కన్నాడు. భార్యాబిడ్డల కడుపు నింపడం కోసం డ్రైనేజీ అనే కొండచిలువ నోట్లో తల పెట్టాడు.

'గట్టర్‌లోకి దిగుతుంటే నా సమాధిలోకి ఎల్తున్నట్లే ఉంటుందిరా' అనేవాడు పోచయ్య. అలా మా పనోళ్ళలో ఎంతమంది చనిపోయారో... కాంట్రాక్టర్ విదిలించే రోజు కూలీకి ఆశపడి, తెరుచుకున్న మొసలి నోరులా భయంకరంగా కన్పించే డ్రైనేజీ గుంటలోకి తలపెట్టి, ఊపిరాడక కొంతమంది, విషవాయువులు పీల్చి కొంతమంది, రకరకాల చర్మ రోగాలతో, శ్వాసకోశ రోగాలతో కొంతమంది... డ్రైనేజీ మూతలు మృత్యుద్వారాల్లా కన్పిస్తుంటాయి. కానీ చావుతో ఈ చెలగాటం మాకు తప్పదు. సింగన్న కూడా ఏ విషవాయువులకో బలై ఉంటాడు. అంతలోపల కాటేయడానికి ఏమేమి దాగున్నాయో మాకెలా తెలుస్తుంది?

**నల్లటి నిక్కరుతప్ప ఎలాంటి ఆచ్ఛాదనా లేని శరీరంతో ఆ డ్రైనేజీలోకి దిగాడతను. గుండెలవరకూ తాకుతూ మురికినీరు...కుళ్ళిన కోడిగుడ్ల వాసనకన్నా భయంకరమైనవాసనేదో ముక్కుపుటాల్ని బద్దలుకొడుతోంది. అటుగావెళ్ళేవాళ్ళు అతనికేసి జుగుప్సగా చూస్తూ మొహం తిప్పుకుంటున్నారు. కుక్కకన్నా, పందికన్నా హీనమైన బతుకు. తనదీ ఒక బతుకేనా...తనమీద తనకే అసహ్యమేసిందతనికి.**

నేనూ ఓ రోజు ఇలానే చచ్చిపోతానేమో... అప్పుడు నా కుటుంబానికి దిక్కెవరు? మమ్మల్ని చావు కన్నా ఎక్కువగా భయపెట్టే విషయం ఇదే. సింగన్న చనిపోయాక అతని కుటుంబాన్ని ఎవ్వరూ పట్టించుకున్న పాపాన పోలేదు. కర్మకాండలకు అవసరమైన డబ్బిచ్చి యాద్గిరి చేతులు దులుపుకున్నాడు. సింగన్న భార్యాపిల్లల హృదయ విదారక మైన ఏడుపు ఇంకా నా గుండెల్లో మార్మోగుతూనే ఉంది.

నాన్నకూడా ఇదే పని చేసేవాడు. నలభై యేళ్ళు రాకముందే ఏదో జబ్బుతో దగ్గి దగ్గి రక్తం కక్కుకుని చనిపోయాడు.

'నీ వయసువాళ్ళని పనిలో పెట్టుకోకూడదు రోయ్. అయినా నాది జాలిగుండె కాబట్టి పనిస్తున్నా... ఎవరైనా అడిగితే నీకు పద్దెనిమిదేళ్ళని చెప్పు' అన్నాడు నారాయుడు. మొదటిరోజు డ్రైనేజీలోకి దిగినప్పటి భయంకరమైన అనుభవాన్ని నేనెప్పటికీ మర్చిపోలేను. ఒంటి చుట్టూతా నల్లటి జంతువేదో అంటుకుపోయినట్టు... చల్లటి కాళ్ళతో తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్టు... కొన్ని వేల కీటకాలు ఒకేసారి శరీరం మీద దాడిచేసినట్టు... దానికి తోడు భరించలేని దుర్గంధం... ఎక్కడినుంచి వచ్చాయో నీళ్ళపైనుంచి పాకుతూ వచ్చి మొహం మీదికి, తల మీదికి ఎగబాకాయి బొద్దింకలు. పెద్దగా కేకపెట్టి వాటిని విదిలించుకున్నాను. నా వైపు మెల్లగా తేలుతూ వస్తోంది ఎవరిదో మలం. అది నన్ను దాటిపోవటం ఆలస్యం భళ్ళున వాంతి చేసుకున్నాను. నా వాంతిలో నేను... నా చుట్టూతా ఈ నగర జనాభా విసర్జించిన మలమూత్రాలు... ఏడుపు తన్నుకు వచ్చింది. ఆ క్షణమే చచ్చిపోతే బావుండునని పించింది.

'నేను సెప్తే ఇన్నావా... ఈ మందు గొంతులో పడితే తప్ప తట్టుకోలేవురా అని సిలక్కి సెప్పినట్టు సెప్పానా లేదా... ఈ డ్రైనేజీ దయ్యం పెట్టే హింసని బరించాలంటే ఇదొక్కటేరా మందు' అన్నాడు పోచయ్య. అతని చేతిలో ఉన్న సారాయి సీసాని లాక్కుని ఒక్క గుటకలో తాగేశాను. 'ఇప్పుడు సూడ్రా..... నువ్వు మొనగాడివై పోతావు సూడు" అన్నాడు పోచయ్య పెద్దగా నవ్వుతూ. చేత్తో



చెత్తని తీసేస్తుంటే చేతిలోకి చచ్చిన లావుపాటి ఎలుక వచ్చింది. అది కుళ్ళిపోయి కంపుకొడుతూ...

ఆరోజు ఇంటికెళ్ళాక కూడా కక్కుకుంటూనే ఉన్నా, అన్నం సయించలేదు. ఏది చూసినా డ్రైనేజీలో చూసినవే గుర్తుకొస్తున్నాయి. ఎటుతిరిగినా ఆ దుర్గంధమే ముక్కుపుటాల్ని హింస పెడ్తోంది.

'మనం ఈ నరకంలోనే బతకాలా... మన సావు కూడా ఇక్కడేనేమో... మనకిక జీవితంలో సౌరగం ఎట్టా ఉంటుందో తెలీదేమో' అంటూ నాతోపాటు పనిచేసే ఓబులేసుతో అని పెద్దగా ఏడ్చాను. ఓబులేసుకి పాతికేళ్ళుంటాయి. మనిషి సన్నగా రివటలా ఉంటాడు. 'పద ఈ రోజు నీకు సౌరగం ఎక్కడ దొరుకుద్దో సూపిత్తాను' అని నన్నెక్కడికో లాక్కెళ్ళాడు. అక్కడ గుడిసెలో తడిక అడ్డుగా ఉంది. 'నీకు కొత్తకదా... మొదట నువ్వెళ్ళు' అన్నాడు. తడికకి అటు వైపున మంచం... దానిమీద అక్కడక్కడా చిరిగిన మాసిపోయిన పల్చటి దుప్పటి... దానిమీద నవ్వుతూ చూస్తున్న ఆడది... ఆమె శరీరం నిండా దుర్గంధమే... కుళ్ళిపోయిన కోడి గుడ్ల వాసన... పారిపోయి వచ్చేశాను.

పెళ్ళయ్యాక కూడా నా భార్య దగ్గర అదే వాసన. నరక లోకపు కుళ్ళిన వాసన... 'అది నీ పెళ్ళాం నుంచి వస్తోందనుకుంటున్నావా? పిచ్చోడా... అది నీలోంచే వస్తోంది. నాలోంచి కూడా' అంటూ నవ్వాడు ఓబులేసు. నాకప్పుడో నిజం తెలిసింది. నా శరీరంలోంచే వస్తోందా వాసన. నా శ్వాస లోంచి వస్తోంది. నా అణువణువులో నిండిపోయి ఉబికుబికి వస్తోంది. దాన్నుంచి పారిపోదామని ఎంత ప్రయత్నించినా వదలని దుర్గంధం. అన్నం చేత్తో తినడం ఎప్పుడో మానేశాను. కళ్ళతో చూడకుండా చెంచాతో తినడమే... నా భార్య కలిపిచ్చేది. కొన్నిసార్లు తన చేతుల్తో తినిపించేది.

మరునాడు ఆదివారం. మగపెళ్ళి వారు వచ్చే రోజు. 'మీ ఇద్దరికీ గురుతుందిగా. నేను డ్రెయినేజీ పనోణ్ణని సెప్పొద్దు. రోడ్లు ఊడ్చే పని సేత్తానని సెప్పండి' అన్నాను. నా భార్య సరేనంటూ తల ఊపింది. కాని నా కూతురు కస్సుమంటూ లేచింది. "ఎందుకబద్ధం చెప్పాలి? ఇందులో దాచాల్సిన అవసరం ఏముంది నాన్నా. నువ్వేమీ నేరం చేయటం లేదే. పెళ్ళాం బిడ్డల్ని పోషించటం కోసం నీకు చాతనైన పని నువ్వు చేస్తున్నావు. అంతే" అంది.

"లేదమ్మా. నీకు తెలీదు. నేను సేసేది శానా నీచమైన పని. అందరూ అసయ్యించుకునే పని. అది తెలిత్తే పురుగుని సూసినట్టు సూత్తారమ్మా. నీకు పెళ్ళికాదు. అందుకే సెప్పొద్దు" అన్నాను.

"నువ్వుచేసేది నీచమైన పని కాదు. వేల మంది విసర్జించిన కల్మషాలు బైటికి పొంగుకొచ్చి ఇబ్బందిపెట్టకుండా అందర్నీ కాపాడే పని. డాక్టర్లు మనకు రోగాలొచ్చాక వాటిని మందుల్తో తగ్గించి రక్షిస్తారు. వాళ్ళని దేవుడితో సమానమని పొగుడ్తారు. మీరు చేస్తున్న పని అంతకంటే గొప్పది నాన్నా. అసలు రోగాలే రాకుండా ప్రజల్ని దుర్వాసనల నుంచి, తద్వారా ప్రబలే అనారోగ్యాల నుంచి రక్షించే పని. మీ ఆరోగ్యాన్ని పణంగా పెట్టి ప్రజల ఆరోగ్యాల్ని కాపాడుతున్న త్యాగమూర్తులు మీరు" అంది నాకు సమీపంగా జరిగి నా భుజం మీద చేయివేస్తూ.

"ఏమో తల్లి... నువ్వు పెద్ద సదువులు సదువుకున్నావు. అయన్నీ నాకు తెలీదు. నాకు తెలిసింది ఒక్కటే. నేను డ్రైనేజీలో దిగి పని సేస్తున్న పెతిసారీ నన్ను సూసేవాల్ల కల్లల్లో అసియ్యాన్నీ సూశాను. మూత తెరవంగానే డ్రైనేజీలోంచి బైటికొచ్చే బొద్దింకలాంటి పురుగుల్ని సూసినట్టు".

"నాన్నా... నేను చెప్పేది జాగ్రత్తగా విను. ఆ పెళ్ళి వాళ్ళకు నిజాలే చెబ్దాం. నిన్నూ, నువ్వు చేస్తున్న పనినీ ఇష్టపడని వ్యక్తి నాకు భర్తగా వద్దు. అందరూ అలాంటి వాళ్ళే అయితే నాకసలు పెళ్ళే వద్దు. నువ్వు మాత్రం ఎట్టి పరిస్థితుల్లోనూ నిన్ను నువ్వు తక్కువ చేసుకోవద్దు. నువ్వు ఆఫీసులో ఫ్యాను కింద కూచుని చేసే ఉద్యోగం చేస్తున్నా నేను నిన్నంతగా గౌరవించేదాన్ని కాదేమో నాన్న... నువ్వు అమ్మకోసం, నా కోసం, నా చదువుకోసం డ్రైనేజీ మురికినంతా కౌగిలించుకుంటున్నావు చూడు.. అందుకూ నువ్వంటే నాకిష్టం.. నువ్వంటే నాకు గౌరవం.. నువ్వు నా హీరోవి నాన్నా.. నాకే కాదు. అమ్మకు కూడా".

నా కూతురి కళ్ళు నా మీది ప్రేమతో జ్యోతుల్లా వెలగడాన్ని గమనించాను. నా భార్య వైపు చూశాను. కళ్ళనిండా నీళ్ళు నింపుకుని "ఔనయ్యా... నువ్వంటే నాకు శానా ఇట్టం... పేమ.." అంది గొణుక్కుంటున్నట్టు. నాకు దగ్గరగా జరిగి నన్ను చుట్టుకుని బొటబొటా కన్నీరు కార్చింది. ఆ క్షణంలో తన శరీరం నుండి వస్తున్న చెమటవాసన మల్లెపూల సుగంధంలా...

ఒక్కసారిగా నాకు జ్ఞానోదయమైంది. కళ్ళ ముందు స్వర్గమేదో ప్రత్యక్షమైంది. ఇన్నాళ్ళూ నేను ఎదుర్కొంటున్న నరకం గురించే ఆలోచిస్తూ నా ఇంట్లో ఉన్న స్వర్గాన్ని గమనించుకోలేదు. ఈ లోకమంతా నన్ను పురుగులా చూసినా ఇద్దరు మాత్రం నన్ను మనిషిగా చూస్తున్నారన్న భావన... ఎంత అద్భుతంగా ఉందో... వీళ్ళ ప్రేమకు పాత్రుడిని కావడం కన్నా మరో స్వర్గం ఏముంటుంది? ఈ స్వర్గం కోసం ఎన్ని నరకాలెదురైనా సంతోషంగా భరిస్తాను. సంతోషంతో పొంగిపోతూ గుండెనిండా ఊపిరి పీల్చుకున్నాను. ఆశ్చర్యం... ఏ దుర్వాసనా లేని స్వచ్ఛమైన గాలి ఊపిరితిత్తుల్ని ప్రేమగా తడిమింది.

**సెల్:07588630243**

## తప్పుకుందామన్నా కుదరలేదట

**'జెం**టిల్‌మన్' తరువాత నివేదా థామస్ డిమాండ్ ఒక్కసారిగా పెరిగి పోయింది. అంతకు ముందు కమర్షియల్ హీరోయిన్‌గా ఆమెకు పెద్దగా గుర్తింపు లేదు. ఈ సినిమాకన్నా ముందు ఓ సినిమాకి నివేదా కమిట్ అయింది. తీరా 'జెంటిల్‌మన్' సూపర్ హిట్ కావడంతో ముందు కమిట్ అయిన సినిమా నుంచి తప్పుకోవాలని చూసిందట! డేట్లు లేవంటూ నివేదా చెబుతున్న మాటలు నమ్మకుండా ఆ నిర్మాత ఆమె మీద నిర్మాతల మండలికి వెళ్ళడంతో తప్పనిసరి పరిస్థితిలో ఆ సినిమా చేస్తోందట!





# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 30

**డైరెక్టర్ గారితో కూడా అన్నా. దాదాపు 200 చేశానండి తాగుబోతు క్యారెక్టర్లు. మొనాటనీ రాదా సార్ అన్నా. నాకు రాలేదు అన్నారాయన. కృష్ణవంశీ ఎంత గొప్ప డైరెక్టరు! ఇంక ఆయనతో వివాదం పెట్టుకోవటం, మాట్లాడటం తప్పు. ఎంతో స్పాన్, విజన్ ఉన్న డైరెక్టర్ ఆయన.**

# అద్భుతమైన నా సినీయాత్రలో సిక్ మజిలీ

గాంధీగారు ఒక మాట అన్నారు. ఒక మనిషి చేయగలిగింది ఇంకో మనిషి చేయగలడు అన్నారు. ప్రయత్నించాలి. ఎవరూ చేయలేంది ఎవరూ చేయలేరేమోగానీ, ఒకడు చేయగలిగింది ఇంకొకడు చేయగలడు. ఆ ఓర్పు ఉండాలి. ఒక డైరెక్టరుకి నా పాత్రల గురించి అలాంటి ఆలోచన రాలేదంటే ఇక చాలా మందికి రాదు. ఒకవేళ అలాంటి ఆలోచన ఎవరిలోనైనా బయలుదేరి ఉంటే, అది మెల్లిగా అంద రికీ అంటుకుని ఉంటే, ఏమండీ ఆ పాత్రలు వద్దులేండి, ఈ పాత్రలు వద్దులేండి, మొనాటనీ వస్తుంది ఎమ్మెస్‌గారూ అని ఎవరైనా అని ఉంటే ఆ ట్రెండు ఉంటుంది. అక్కడక్కడా ఎవరికైనా మనసులో ఉంటుంది. ఒకవేళ అరకొరగా ఎవరికన్నా అలాంటి ఆలోచన వచ్చిందేమో మనకు తెలియదు. అయితే ఒక గ్రేట్ పాయింట్ ఏంటంటే, దర్శకులు, నిర్మాతలు ప్రత్యేకంగా రచయితల్ని కూర్చోపెట్టి, నాకోసం భిన్నమైన వంద క్యారెక్టర్ల దాకా రాయించారు. నాకోసం ప్రత్యేకంగా, ఇది ఎమ్మెస్ పాత్ర, తాగడం ఒకటే మెయిన్ కాదు, తాగినప్పుడు ఎలాంటి డిఫరెంట్ కామెడీ సృష్టిస్తున్నాడో ఆ వర్క్ ప్రేక్షకుడికి తెలియాలి, ప్రతిదాంట్లో తాగడమే వర్క్ అయితే తాగి ఆ గ్లాసు అక్కడ పెడతాం. అది కాదు, తాగిన తరువాత వాడిచ్చే రిటార్టు ఏంటి? అనేది తెలియాలని భావించి నా పాత్రలు రాయించారు.

### శశిరేఖా పరిణయంలో డిఫరెంట్ కామెడీ

శశిరేఖా పరిణయంలో ఒరే తాగుబోతు వెధవా అంటుంది హీరోయిన్. 'తాగుబోతు వెధవా' అని తిట్టకమ్మా. మేం కడుతున్న టాక్స్ తోటి ఆబ్కారీకి ఇన్‌కం ఇంత వస్తుంది. ఇలా రావడం వల్ల ఇప్పుడు మీరు ఈ కారులో ఈ మంచి రోడ్ల మీద వెళుతున్నారు. లేక పోతే ఈ రోడ్లు ఉండేవికావు. ఈ కార్లు, ఈ టాక్సీలు, హాస్పిటల్స్ ఉండేవికావు. అసలు ఎడ్యు కేషన్, హెల్త్ ఫెసిలిటీస్ ఉండేవికావు అంటూ నేను చెప్పిన డైలాగులతో ఆ క్యారెక్టర్ బాగా పండింది. అంతకుముందు నేను చేసిన తాగుబోతు పాత్రలకు భిన్నంగా రాశారు కాబట్టి అది క్లిక్ అయింది. అట్లా నా కోసం 200 తాగుబోతు క్యారెక్టర్లు రాయించారు. దూకుడులో కళ్ళ కింద క్యారీ బ్యాగ్ వేసుకోవడం లాంటి క్యారెక్టర్ పెద్ద టాక్. ఇలాగ ఒక ఆర్టిస్టు కోసం, ఒక కమెడి యన్ కోసం ప్రత్యేకంగా తాగుబోతు క్యారెక్టర్ రాయిం చడం నేను పూర్వజన్మలో చేసుకున్న సుకృతం కాదా మరి. ఎమ్మెస్ ట్రాక్ రాయవయ్యా అని ప్రత్యే కంగా ఒకరితోటి చెప్పడం, అంటే ఎమ్మెస్‌కి ప్రజలు అంత ప్రాధాన్యం ఇవ్వటం, వీళ్ళు దాన్ని గుర్తిం చటం. మళ్ళీ నన్ను పెట్టుకోవడం... అంతకంటే జీవి తానికి ధన్యత ఏముంటుంది? దీనివల్ల పడిన కష్టమంతా మర్చిపోతాం.

### దూకుడు కెరీర్‌లో మైలురాయి

దూకుడు సినిమాలో నేను చేసిన కామెడీ నా సినీ జీవితంలోనే ఓ మైలురాయి. కానీ ఈ సినిమా షూటింగ్ జరుగుతున్న సందర్భంగా నా జీవితంలో చాలా క్లిష్ట సమయం గడిచింది. నా భార్య కడుపులో పేగులు దెబ్బతినడం వల్ల సీరియస్ అయింది. ఆ రోజు తెల్లవారుజామున హాస్పిటల్‌కి పంపించాం. ఉదయం ఏడు గంటలకే నేను షూటింగ్‌కి వెళ్ళిపోయాను. మహేశ్‌బాబు, బ్రహ్మానందం, కోట శ్రీనివాసరావుగారు, సాయాజీ షిండే మరి కొంతమంది కాంబినేషన్‌లో సీన్. నేను మిస్ అవడానికి వీలులేదు. తొమ్మిదింటికి షూటింగ్ ప్రారంభమైంది. పది గంటలకు ఓ వ్యక్తితో హాస్పిటల్ వాళ్ళు నాకో లెటర్ పంపించారు. 'అర్జంటుగా మీ భార్యకు ఆపరేషన్ చేయాలి, మీ అనుమతి కావాలి' అని డాక్టర్ గారు రాసిన ఉత్తరం. నేను వెంటనే సంతకం పెట్టి ఆపరేషన్ చేసే డాక్టర్‌గారికి ఫోన్ చేసి ఈ లెటర్ మీకు చేరడానికి మరో అరగంట పడుతుంది కాబట్టి మీరు వెంటనే ఆపరేషన్ ప్రారంభించండి అని చెప్పా. తరువాత తెలిసింది. ఈ అరగంట లేట్టై ఉంటే, ఇంకొంచెం ప్రమాదం జరిగేదని. ఆ తర్వాత ఏడు రోజులూ నా భార్య అపస్మారక స్థితిలోనే గడిపింది. ఆ షూటింగ్ అంతా భయంతో,



విషాదంతో గడిచింది. కానీ నా భార్య తరువాత కోలుకుని మామూలు స్థితికి వచ్చింది. ఈ సినిమా నంది, ఫిలింఫేర్ అవార్డులు సాధించింది. ఇదంతా ఓ కలలాగా సాగిపోయింది."

### డైరెక్షన్‌లో వేలు పెట్టా

రచనలోనూ, యాక్షన్‌లోనూ పట్టు సాధించినా డైరెక్షన్ కూడా చేయాలన్న కోరిక వచ్చింది ఎమ్మెస్‌కు. వెంటనే రంగంలోకి దిగారు.

"ఇలా నా సినీ ప్రయాణం సాగిపోతున్న సమయంలో, టక్ అని మా అబ్బాయిని హీరో చేయాలనిపించింది నాకు. యాక్చువల్‌గా ఆ థాట్ రైటా రాంగా అంటే ఎవరైనా రిస్కు చేస్తే చేయటం వేరు. కొందరు ప్రొడ్యూసర్లు ముందుకు వచ్చారు. తర్వాత విభేదాలు వచ్చాయి. దాంతో ప్రొడ్యూసర్స్ మీటింగ్ పెట్టి, సార్ మేం మీకు వడ్డీ లేకుండా అప్పు ఇచ్చాం కదా. మీ సినిమా మీరు తీసేసుకోండి. మా డబ్బులు మాకు ఇచ్చేసేయండి అన్నారు. అలా అనకూడదని, వాటి మీద సైన్ చేయకూడదని నాకు తెలీదు. నా విశ్వాసం నాది. వాళ్ళు ఎందుకు పెట్టుబడి పెట్టాలి నా కొడుకుని నమ్మి, శ్రీకాంత్‌తో తీసుకోవచ్చు కదా. వాళ్ళకు మార్కెట్ అవుతుంది కదా. కానీ నా కొడుక్కి పెడతామని వచ్చారంటే మనం ఆ విజయం సాధించి చూపించాలి. సాధించకపోతే మనమే ఆ లాభనష్టాలు కాసుకోవాలి అని చెప్పేసేసి నేను సైన్ చేసేశాను మీ డబ్బులు మీకు ఇస్తానని.

### కోటి రూపాయలు పోయాయి

అట్లాగే సినిమా అయిన తరువాత, ఆ సినిమా అమ్మే దశకు వచ్చేటప్పటికి మరొకతను సైడ్ అయిపోయాడు. ఆయన ఏం తిన్నాడో ఏం తిన్లేదో ఆ పాపం, పుణ్యం దేవుడికి తెలుసు. నాకు తెలుసు. అట్లాంటి దశలో నా సినిమాను నేను అమ్ముకోవటం నాకు చేతకాలేదు. బయ్యర్లు వాళ్ళ ఇష్టమొచ్చిన రేట్లకి పట్టుకుపోయారు. బయ్యర్లందరికీ డబ్బులొచ్చాయ్, సినిమాకి మంచి పేరు వచ్చింది. థియేటర్లలో ఆడించలేకపోయాను. థియేటర్లలో ఆడించటానికి సినిమా బాగోటం కాదు, వెనకాల చాలా ఉన్నాయి. అది కరెక్ట్‌గా అర్థమవ్వాలంటే 'కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం అప్పలరాజు' రామ్ గోపాలవర్మ గారు తీశారే, ఆ సినిమాను బాగా అర్థం చేసుకోవాలి. ఆ సినిమాను మనం బాగా అర్థం చేసుకోగలిగితే ఇది మనం నడిపించేవాళ్ళం. అఫ్‌కోర్స్ అప్పటికి ఆ సినిమా ఇంకా తీయలేదనుకోండి. దాంట్లో ఉన్నటువంటి కుట్రలు, మలుపులు అన్నీ ఈ సినిమాలో ఉన్నాయి. అందుకే ఆ సినిమా నాకు బాగా నచ్చింది. అట్లా ఎప్పుడయితే పోయిందో, సరే కోటి రూపాయలు తిరిగి ఇచ్చేయడానికి బేరమాడా. బేరమాడి ప్రొడ్యూసర్ దగ్గరికి వెళ్ళి కష్టపడి సంపాదించానండి. ఇలాగ దుర్వినియోగం జరిగింది. ఇంక అవన్నీ అనవసరం మనకి, కానీ మీరేదన్నా తగ్గించండి అన్నా. పాతిక లక్షలు తగ్గించారు. 75 లక్షలు క్యాష్ కట్టాలి. 60 లక్షలు ఒక సూట్‌కేసులో తీసుకెళ్ళి, తనికెళ్ళభరణిగారి ఎదురుగుండా డబ్బులు కట్టాను నేను. మిగిలినవి ఇన్‌స్టాల్‌మెంట్‌లో తర్వాత ఇచ్చాను. మొత్తానికి ఒక కోటి రూపాయలు ఇంట్లోంచి వెళ్ళిపోయాయి. నా క్యాష్, ఇంత కాలం సంపాదించింది. అది కాకుండా నిడమర్రులో మా నాన్నగారి పేరుతో పొలం కొన్నాను. ఎప్పుడయితే ఇది ఇలా జరిగిందో ఆ పొలం అమ్మేసి నేను ఇక్కడ డబ్బు కట్టేశాను. నేను డబ్బిస్తుంటే తనికెళ్ళ భరణిగారి కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి. అంత సహృదయుడు ఆయన. కానీ నాకు ఏడవటానికి ఆ రోజుల్లో కన్నీళ్ళు కూడా లేవు. సరే కట్టేశా. ఇంట్లో మా పిల్లలు, మా ఆవిడ అందరూ ఏడ్చారు. కానీ నేను ఒకటే అన్నా. సినిమా బాగుంది. వెధవ ప్రయత్నం చేయలేదు మనం. మంచి చేశాం. సక్సెస్ అయ్యుంటే సినిమా ఫీల్డ్‌లో మహత్తరమైనటువంటి వాణ్ణి నేను. డెఫినెట్‌గా సక్సెస్ సాధించగలను అని చెప్పినవాళ్ళ సినిమాలే సక్సెస్ కావడం లేదు ఒక్కోసారి. సినిమా డిపెండ్స్ అపాన్ ద సబ్జెక్ట్, వెయిట్, ఆ డైరెక్టరు ఉంటే వాళ్ళకి ముందే డబ్బులొచ్చేస్తాయి. సినిమా ఎలా ఉన్నా కోటి రూపాయలు ఈజీగా వచ్చేస్తాయి, ఆ కోటి అమ్మడం రాలేదు మనకి. ఇది కూడా 3.4 కోట్లు సంపాదించింది. కానీ అదంతా కూడా డిస్ట్రిబ్యూటర్లకి, బయ్యర్లకి పోయింది. నాకు పైసా రాలేదు. ఇది ఒక అద్భుతమైన జైత్రయాత్రలో ఒక సిక్ మజిలీ.



**ప్రతి మనిషి జీవితంలోనూ ఒడిదుడుకులు ఎదురవుతాయి. ఒకొక్కసారి అంచనా తప్పడం వల్ల ఒడిదుడుకులు ఎదురుకావచ్చు లేదా చుట్టూ ఉన్న వ్యవస్థలో ఉన్న లోపాల వల్ల నష్టాలు రావచ్చు. ఎమ్మెస్ కూడా అలాంటి సమస్యల్లోనే చిక్కుకున్నారు. ఆయనకు దర్శకత్వం చేయాలనే కోరిక కలిగింది. కొందరు ప్రొడ్యూసర్లు ముందుకు వచ్చారు. కానీ అప్పుడు ఏం జరిగింది? ఎంఎస్ చేయకూడని పని ఏం చేశారు?**

### మళ్ళీ నా వేషాలు నావే

నేను భయపడిందేంటంటే ఒక జనరల్ సైకాలజీకి భయపడ్డాను. అంతకు ముందు కొందరి పట్ల ఇలా చూశాను నేను. ఇలాగా నటులైన వాళ్ళు డైరెక్షన్ చేస్తే తర్వాత డైరెక్టర్స్ వేషాలు ఇవ్వడానికి వెనకాడతారు. ఎందుకంటే డైరెక్షన్‌మీద ఉండే తపనతో, మనం చేసే డైరెక్షన్‌లో ఎక్కడన్నా వేలుపెడతాడేమో, ఆ డిస్ట్రబెన్స్ మనకెందుకులే అనే అభిప్రాయంవల్ల వేషాలు తగ్గుతాయి. జనరల్ హిస్టరీ ఇది. ఈ హిస్టరీ నాకు అప్లయ్ కాలేదు. ఎప్పుడయితే అప్లయ్ అవ్వలేదో మళ్ళీ నా వేషాలు నేను చేసుకుంటూ వచ్చాను. ఇంక ఇలాంటి పని ఎప్పుడూ చేయకూడదనుకున్నాను.

### నా కథ విని దాసరిగారు ప్రొడ్యూస్ చేస్తానన్నారు

ఈ మజిలీ ఇలాగ కొనసాగుతుంటే, ఒక నాలుగేళ్ళ క్రితం దాసరి నారాయణరావుగారికి ఒక కథ చెప్పా. ఆయనకు బాగా నచ్చింది. నచ్చి నువ్వు ఈ సినిమా తియ్యి. నేను ప్రొడ్యూస్ చేస్తాను అన్నారు. అప్పుడు మనకి రిస్కులేదు కదా. రిస్కు ఏమంటే ఒక రెండు నెలలు సెలవు పెట్టాలి. సెలవంటే, జాబ్‌కి కాదు, నటుడు అనే ఉద్యోగానికీ! వేషాలు వదిలెయ్యాలి. వదిలేస్తే ఓ 25 లక్షలు పోతుంది. పోతే పోయిందిలే అని మా అబ్బాయిని దీంట్లో దింపాం. ఇప్పుడు వాడికి జాబ్ లేదు. మనం సినిమా పనితప్ప ఏం చెయ్యలేం. వాడు కూడా ఏం చేయటానికి సోర్స్ లేదు. వాడు డిగ్రీ పాసయ్యాడు. దానితోటి ఏం చెయ్యలేడు. ఇవాళ ఎంతో కావాలి. ఎంబీఏ చేయాలి. బీటెక్ చెయ్యాలి, ఏదో చెయ్యాలి. అవన్నీ మనం ఏం చేయించలేదు. రఫ్ అండ్ టఫ్‌గా బతికాం మనం. కాబట్టి ఈ అవకాశాలన్నీ ఆ భగవంతుడు ఇచ్చినవే. డబ్బులు మనవి కావు. సినిమా నచ్చింది ఆయనకి.

***(ఇంకావుంది)***

**-కూనపరాజు కుమార్**
సెల్: ***99899 99599***

**నిగమ కూతురి వైపు బలహీనంగా చూసింది. "అన్యాయం చేసింది మనం కాదు, నిశితా, నేను. నేనే చేశాననిపిస్తోంది!"**

**"అమ్మా...."**

**"అవును నిశితా... కట్టుబాట్లతో, నియంతృత్వంతో పెంచడానికి బదులు వాళ్ళకి స్వాతంత్ర్యం ఇచ్చాను. ఆలోచనా స్వాతంత్ర్యం. భావవ్యక్తీకరణ స్వాతంత్ర్యం. సగటు మనిషికి అవసరమైనవన్నీ ఇచ్చాను. ఈత తెలియని కుర్రాళ్ళను నీళ్ళల్లో వదిలేసినట్టు వాళ్ళని స్వచ్ఛందంగా ఎదగనిచ్చాను. నేను చేసిన పొరపాటు అదే... అదే నేను చేసిన అన్యాయం" నిగమ కంఠంలో ఓటమి స్పష్టంగా ధ్వనించింది.**

**నిశిత విచారం, జాలీ మిళితమైన చూపులు చూసింది.**

"నేను స్వేచ్ఛ ఇచ్చాను. వాళ్ళ చేతుల్లో అది విశృంఖలత్వం అయింది. ఫ్రీడం అనేది పర్మిసివ్‌నెస్‌గా వాళ్ళచేతుల్లో మారిపోయింది. స్వేచ్ఛ మనిషిని సక్రమంగా ఎదిగిస్తుంది. విశృంఖలత అక్రమంగా, అడ్డంగా ఎదిగిస్తుంది. వాళ్ళ విషయంలో అదే జరిగింది.

"నా పిల్లలు లోపల్లోపలే ఎదిగారు. ప్రస్తుతం నేను ఏకాంత్ గురించీ, సాకేత్ గురించీ మాట్లాడుతున్నాను. పుటాకార దర్పణంలో చిన్నదిగా అవుపించే ఆకారం లాగా, వాళ్ళు తమ ఎదుగుదలను 'చిన్నదిగా' చేసి చూపించారు! అది వాళ్ళ ప్రవర్తన అనే మాయాదర్పణం! పెంపకం అనేది ఒక స్థలానికి పరిమితం కాదని తేలిపోయింది నిశితా! ఎలాగో చెప్పనా?"

నిశిత చెప్పమన్నట్టు తల ఆడించింది.

"మనిషి పెంపకం రెండు చోట్ల జరుగుతుంది. బాల్యంలో ఇంట్లో, కొంత వయసొచ్చాక వీధిలో! 'ఇంటి పెంపకం' తల్లిదండ్రుల అదుపులో, ఆజమాయిషీలో ఉంటుంది. 'వీధి పెంపకం' సమాజం చేతిలో ఉంటుంది. ఇంటి కన్నా - అంటే కుటుంబం కన్నా సమాజం బలిష్టమైంది. కుటుంబ పెంపకంలో నియంత్రణ, సమాజం పెంపకంలో విచ్చలవిడితనం! యుక్తవయసులో మనిషి మీద సమాజ ప్రభావం అధికంగా ఉంటుంది. కుటుంబం పోషిస్తుంటే, సమాజం పెంచుతుంది!

"ఏకాంత్‌నీ, సాకేత్‌నీ నేను పోషించాను. సమాజం పెంచింది! ఇంట్లో ఉన్నంత సేపూ గొడుగు ఒద్దికగా ముడుచుకునే ఉంటుంది. వీధిలోకి వెళ్ళాక విచ్చుకుంటుంది. పరిమితిలో, ఎల్లల్లో ఉన్నంతసేపూ ముడుచుకుని ఉండే గొడుగు ఎల్లలు దాటి 'వైశాల్యం'లోకి వెళ్ళగానే విచ్చుకుని తన నిజస్వరూపం చూపించినట్టు, నా ముందు, నా సంరక్షణలో రెక్కలు వచ్చేదాకా నా కంటికి కనిపించకుండా అణచిపెట్టుకున్న ఎదుగుదలని విస్తరించి చూపించారు! అంతే!" నిగమ నిట్టూర్పుతో ముగించింది.

సంకేత్ గదిలోంచి వచ్చాడు. అమ్మవైపు నిదానించి సూటిగా చూశాడు. "నువ్వు చెప్పిందంతా గదిలోంచి విన్నాను. నేనూ, నిశిత కూడా నీ నీడలోనే పెరిగాం. పెద్దయ్యాక సమాజంలోకి వెళ్ళాం. మేం కూడా అన్నయ్యల్లాగే అవుతామని అనుమానిస్తున్నావా?"

సంకేత్ ప్రశ్న నచ్చినట్టు నిశిత తల పంకించి, ప్రశ్నార్థకంగా అమ్మను చూసింది.

"నిజం చెప్పమన్నావా, సంకేత్?" నిగమ ప్రశ్నించింది.

సంకేత్ చిరునవ్వు నవ్వాడు. "ఇన్నాళ్ళు, ఇన్నేళ్ళు నీ నోటమ్మట మేం కేవలం నిజాన్నే వింటున్నాం!"

"ఏకాంత్‌నీ, సాకేత్‌నూ, నిన్నూ, నిశితనూ - నలుగుర్నీ నేను ఒక్కలాగే పెంచాను. జీవితం గురించి అందరికీ ఒక్కలాగే ఆదర్శాలనూ, అధికారాలనూ, బాధ్యతలనూ బోధించాను. పెద్దవాళ్ళిద్దరూ నేను ఆశించిన విధంగా ఎదగలేదని ఇప్పుడిప్పుడే తేలింది. వాళ్ళ విషయంలో ఏ విధంగా నేను ఊహించలేకపోయానో, నీ విషయంలోనూ, నిశిత విషయంలోను కూడా ఊహించలేను. నా మనసు, నా మెదడు, నా హృదయం మొద్దుబారి పోయాయి. ఆశించనూ లేను; అనుమానించనూ లేను.."

"అయాం సారీ అమ్మా... అన్నయ్యలు నీ గుండెను రాయి చేసేశారు.." నిశిత బరువుగా అంది.

"అది - వాళ్ళ దురదృష్టం!" సంకేత్ అన్నాడు.

"ఏకాంత్ మీ నాన్నగారికి తీరని అన్యాయం చేసి, మనందర్నీ బజారుపాలు చేసిన రాజవర్మ కూతుర్ని ప్రేమిస్తాడనీ, పెళ్ళాడతాడనీ మీరు ఊహించారా? సాకేత్ అమెరికా అమ్మాయిని



9

# మదరిండియా

-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287






ప్రేమించి, ఆ పిల్ల గర్భవతి అయ్యాక, నోనాను 'పెళ్ళి చేసుకుంటానమ్మా' అని నన్ను అడగడానికి బదులు - అపసవ్య నాటకం ఆడి - 'నోనాని పెళ్ళిచేసుకో!' అని నా చేత అనిపిస్తాడని మీరు ఊహించగలిగారా? లేదు. నేనూ ఊహించలేకపోయాను.." నిగమ గాద్గదికంగా అంది.

'ఎవరి జీవితంలో ఎప్పుడు ఏం జరుగుతుందో, ఎందుకు జరుగుతుందో ఎవ్వరూ ఊహించ లేరమ్మా.." సంకేత్ వేదాంత ధోరణిలో అన్నాడు.

నిగమ నిశితనూ, సంకేత్‌నూ తదేకంగా మార్చి మార్చి చూసింది. "నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. సమాధానం చెప్పండి!"

అలాగే అన్నట్లు ఇద్దరూ తలలు ఆడించారు.

"సంకేత్, కవితల మధ్య, నిశితా, రాజాల మధ్య ఉన్నది స్నేహమా; ప్రేమా?"

నిశిత టకీమని స్పందించింది "ఎందుకలా అడిగావమ్మా?"

"ఎందుకడిగానో తర్వాత చెప్తాను. మీ నలుగురి మధ్య ఉన్నది స్నేహితమా, లేక స్నేహితం దుస్తులు తొడుక్కున్న ప్రేమా?"

"స్నేహమే!" సంకేత్ అన్నాడు.

నిగమ కూతురి వైపు చూసింది. "రాత్రి వాళ్ళు పెళ్ళి ప్రస్తావన తెచ్చారు. మీ ముఖాల్లో ఆనందం కనిపించింది. ఆశ్చర్యం కనిపించలేదు. అందుకని అడిగాను.."

"లోకం అనుకునే అర్థం మా మధ్య ఉన్న ఆత్మీయత, స్నేహితం - ప్రేమే అయితే, నేనో డజను మంది కుర్రాళ్ళనూ, కవిత ఓ డజను మంది కుర్రాళ్ళనూ ప్రేమిస్తున్నాం!" నిశిత నవ్వుతూ అంది.

"చెల్లాయి చక్కగా చెప్పింది. స్నేహాన్ని ప్రణయానికి పునాది అయిన ప్రేమగా అనుకుంటే నేనూ, రాజా కూడా ఎంతోమంది అమ్మాయిల్ని ప్రేమిం చేస్తున్నట్టే!" సంకేత్ నవ్వుతూ అన్నాడు.

"ఎందుకు అడిగానో ఇప్పుడు చెప్పనా?" నిగమ ప్రశ్నించింది.

"చెప్పమ్మా, చెప్పు!" అంది నిశిత.

"ఏకాంత్ రంజనను, సాకేత్ నోనాను ప్రేమిస్తూ, సమయం వచ్చేదాకా తల్లికి చెప్పకుండా దాచుకున్నారు. ఆ దాపరికం నన్ను బాధించింది. మీరు కూడా వాళ్ళలాగా దాచుకున్నారేమో అన్న అనుమానం కలిగింది. అది నివృత్తి చేసుకోడానికి అడిగాను!" నిగమ నవ్వుతూ అంది.

నిశిత, సంకేత్ చిన్నగా నవ్వారు.

"పిల్లల్తో చర్చించి నిర్ణయం చెబుతానని సదానందం గారికి చెప్పాను. పెద్దవాడి ప్రమేయం ఉండదని చెప్పాను. ఇప్పుడు రెండోవాడి ప్రమేయమూ ఉండదు. నోనా ఉత్తరం సాకేత్‌లోని దగాకోరును చూపించింది. ఇప్పుడు సాకేత్‌తో కూడా చర్చించే అవసరం లేదు.." నిగమ సాలోచనగా అంది.

"మీ ఇద్దరి అభిప్రాయాలూ తెలుసుకుంటే చాలు".

నిశితా, సంకేత్ ఇద్దరూ కుతూహలంగా చూశారు.

"సంకేత్ నువ్వు డాక్టరువి. నీకు ఒక డాక్టర్ భార్యగా రావాలని లేదా?"

"చాలామంది డాక్టర్లు కోరే కోరిక అదే. అయితే నేను... ఒక లేడీ డాక్టర్ని పెళ్ళిచేసుకోవాలని ఆశించడం లేదు. డాక్టర్ వృత్తికి వేళాపాళాలేదు. విశ్రాంతి లేదు. నేనూ, నా భార్య కూడా ప్రాక్టీస్ చేస్తూ యాంత్రిక జీవితం గడిపే ఉద్దేశం లేదు నాకు..."

"సరే. నీ ఆలోచన బాగానే ఉంది. కవితను చేసుకోవడం ఇష్టమేనా నీకు?"

"మా ఇద్దరి మధ్య చాలా ఏళ్ళ స్నేహం ఉందమ్మా. భార్యాభర్తల మధ్య స్నేహం అనేది తప్పకుండా ఉండాల్సిన అంశం అని నా నమ్మకం. భార్యాభర్తలుగా రూపొందాక, ప్రేమ ఎలాగూ పుట్టుకొస్తుంది. స్నేహం, ప్రేమ రెండూ ఇద్దరి జీవితాలను సంతోషమయం చేస్తాయి..." సంకేత్ వివరించాడు.

### జరిగిన కథ

తన బిడ్డలు నీతినిజాయితీగా బతకాలని ఆశించి కష్టపడి వారిని పెంచి పెద్ద చేస్తుంది నిగమ. కానీ ఆ కొడుకులు అందుకు భిన్నంగా తయారవుతారు. కన్న కొడుకుల దుర్మార్గాలకు వ్యతిరేకంగా న్యాయస్థానాన్ని ఆశ్రయిస్తుందా కన్నతల్లి. ఫ్లాష్‌బ్యాక్‌లో కెళితే, తన తండ్రిని చంపిన వ్యక్తి కూతుర్ని ప్రేమించి పెళ్ళాడి ఇల్లరికం వెళ్ళడంతోపాటు, ఓ డబ్బున్న మారాజుకు దత్తపుత్రుడైపోతాడు ఏకాంత్. అతని తమ్ముడు కూడా ఒక బహుళజాతి కంపెనీ యజమాని కూతురు ప్రేమలోపడతాడు. తల్లిని ఎదిరించలేక పన్నాగంపన్ని ఆమె చేతులమీదుగానే తన పెళ్ళి చేయించుకుంటాడు. కన్నకొడుకు చేసిన మోసం తెలుసుకుని దిగ్భ్రాంతికి గురవుతుందా తల్లి. తర్వాత......

నిగమ అర్థమైనట్టు తలాడించింది. "నీ అభిప్రాయం నాకు సమ్మతమే. నువ్వూ! కవిత ఇష్టపడుతున్నారు. కూతురికి ఇష్టం లేకపోతే సదా నందం దంపతులు పెళ్ళి ప్రస్తావనే తెచ్చేవారుకారు. నిశిత గురించి నేను ఆలోచించాలి. ఆలోచించే ముందు నేను రాజాతో మాట్లాడాలి..."

"ఏం మాట్లాడాలమ్మా?" సంకేత్ అడిగాడు.

"రాజాతో నేను మాట్లాడాక అతనే నీకు చెప్తాడు. నీ స్నేహితుడు కదా!" నిగమ నవ్వింది.

"అఫ్‌కోర్స్.. అయితే రాజాను రమ్మని ఫోన్ చేయనా?" సంకేత్ అడిగాడు.

'రమ్మను'

●●●

"ఆంటీ, నాతో ఏదో మాట్లాడాలన్నారట?" సోఫాలో నిగమ ఎదురుగా కూచున్న రాజా అడిగాడు.

"ఏం లేదు నాయనా.. నీకు నిశిత అంటే ఇష్ట మని నాకు తెలుసు. నిశితను నీకు కన్యాదానం చేసే ముందు నిన్ను కొన్ని విషయాలు అడగాలను కున్నాను.."

"అడగండి!"

"అడుగుతాను. నువ్వు అపార్థం చేసుకో కూడదు. నొచ్చుకోకూడదు. పోలీసు ఉద్యోగం అనేది... జనం అంతగా ఇష్టపడే ఉద్యోగం కాదు. పోలీసులతో సగటు మనిషికి స్నేహం ఉండదు. పోలీసులతో స్నేహభావాన్ని సమాజం చూడగలిగే పరిస్థితి ఇంకా రాలేదు. అది తామసగుణంతో కూడిన ఉద్యోగం అని అంటారు. ఆవేశానికీ, ఆగ్రహానికీ, హింసకూ ప్రేరేపించే వృత్తి అది. లంచగొండితనా నికీ, అక్రమార్జనకూ అవకాశం కలిగించే వృత్తి. ఆ వృత్తిని నువ్వు ఎందుకు ఎంచుకున్నావు?"

రాజా చిన్నగా నవ్వాడు. ఐ.పి.యస్. పాస య్యాక స్నేహితులూ, ఇంటర్వ్యూ చేసిన వ్యక్తులూ పోలీసు వృత్తిని ఎన్నుకోడానికి గల కారణం అడి గారు నన్ను. వాళ్ళకు చెప్పిందే మీకూ చెప్తాను. పోలీసువ్యవస్థలో మార్పు రావాలని మేధావులందరూ కోరుకుంటారు. ఆ విధంగా కోరుకునేవాళ్ళలో నేనూ ఒకణ్ణి. ఉన్న దాన్ని ప్రక్షాళన చేయలేకపోయినా, కొత్త ఒరవడిని సృష్టించాలనీ, అక్రమార్జనకు దూరంగా, సమాజానికి దగ్గరగా పోలీసు వృత్తిని తీసుకెళ్ళా లనీ నేను కోరుకుంటాను. ఎవరో ఆ ఘనకార్యం చేయాలని ఆశించడం కన్నా, మనమే ఆచరించడం మంచిదనీ, అందులో నిజాయితీ ఉందనీ - నేను భావించాను. నేను ఐ.పి.యస్ రాయడానికీ, పోలీసు వృత్తిని ఎన్నుకోవడానికీ కారణం ఇదే!"

"అక్రమార్జనకు మార్గం చూపిస్తూ, అమాయకు లను అవస్థల పాలు చేసే అవకాశం పుష్కలంగా ఉండే వృత్తి అది. నాకు కాబోయే అల్లుడు ఒక ఆదర్శ పోలీసుగా ఉండాలని నా కోరిక. నిశిత కోరిక కూడా అదే..."

"ఆంటీ మీకు మాట ఇస్తున్నాను. నా వృత్తిని చట్టబద్ధంగా, విద్యుక్తంగా నిర్వహించి, మీకు ఆనందం కలిగిస్తాను. అల్లుడిని చూసి గర్వించే అవ కాశం కల్పిస్తాను!" రాజా ఉద్రేకంతో అన్నాడు.

నిగమ రాజా వైపు తదేకంగా చూసింది. అందమైన విగ్రహం. చక్కటి రంగు. మీసాలు లేకుండా సౌమ్యంగా కనిపిస్తున్న ముఖం. చిరు నవ్వు కాపురం చేస్తున్న ముఖం. రాజా నిశితకు తగినవరుడే!

"సంతోషం నాయనా... వెళ్ళిరా...."

రాజా కూచున్నచోటు నుండీ లేచాడు. సందే హిస్తూ నిగమ వైపు చూశాడు. "ఆంటీ..."

"ఏమిటి నాయనా?"

"మీరు పర్మిట్‌చేస్తే, నిశితను పార్కుదాకా తీసుకెళ్తాను. మాతో కవిత కూడా వస్తుంది. సంకేత్ మమ్మల్ని పార్కులో కలుసుకుంటాడు.."

"నిశితా!" నిగమ పిల్చింది.

నిశిత గదిలోంచీ వచ్చింది. రాజావైపు చిరు నవ్వు నవ్వింది.

"రాజా నిన్ను పార్కుకి షికారు తీసుకెళ్తానంటు న్నాడు.."

"వెళ్ళనా!" నిశిత అడిగింది.

"వద్దనలేనుగా!" నిగమ నవ్వుతూ అంది.

●●●

నిశితా, రాజా వెళ్ళారు. నిగమలో ఆలోచనలు ముసురుకుంటున్నాయి. రాజాతో ఇందాక జరిగిన సంభాషణ గుర్తుకు వస్తోంది. నిగమ తనలో తను నవ్వుకోకుండా ఉండలేక పోయింది. నిశిత భర్త మంచి పోలీసుగా ఉండాలని తను ఆశిస్తోంది. 'ఆదర్శ పోలీసు' అవడానికే ఐ.పి.యస్. చేశానంటు న్నాడు రాజా.

తన కొడుకులు ముగ్గురికీ తను నీతినియ మాలూ, ఆదర్శాలూ చెప్తూనే ఉంది. బాల్యం నుండీ విన్నారు. పాటించారా?! వినడం వేరు, పాటిం చడం వేరు. ప్రయాణమై బయల్దేరేటప్పుడు 'బైక్ మీద జాగర్త నాయనా. నెమ్మదిగా వెళ్ళు!' అని తల్లి కొడుక్కి చెప్తుంది.

'ఓ అలాగే అమ్మా' అన్న కొడుకు జాగ్రత్తగా నెమ్మ దిగా వెళ్తాడన్న గ్యారెంటీ ఉందా! జాగర్తగా నెమ్మ దిగా వెళ్ళొచ్చు. అమ్మ చెప్పిన జాగర్తనూ, అమ్మకు చెప్పిన మాటనూ మరిచిపోయి ఓవర్ స్పీడుగా వెళ్ళనూ వచ్చు! అమ్మ హెచ్చరించడం ఒక రొటీన్. కొడుకు సరే అనడం ఒక రొటీన్!

కేవలం తన తృప్తికోసం రాజాను కది లించింది తను. పోలీసాఫీసరయ్యాక రాజా ఎలా

**నైతికంగా, మానసికంగా తనను మోసం చేసిన ఇద్దరు కొడుకులకూ ఆ తల్లి తిలోదకాలిచ్చేసింది. కొడుకుల్ని గొప్పగా తీర్చిదిద్దాననే సంతృప్తి ఆమెలో ఏ కోశానా కానరావడం లేదు. ఇక మిగిలిన ఆ ఒక్క కొడుకే ఆమెకు ఏకైక ఆశాదీపం! కానీ అంతలోనే ఆమెలో అంతర్మథనం! ఆ ఒక్కడైనా ఆమె ఆశయాలు నెరవేరుస్తాడా? ఆ నమ్మకం ఆమెలో మిగిలిందా? లేక ఆమె పెంపకంలోనే ఎక్కడైనా లోపం జరిగిందా?**



# అవకాశాల కోసమేనట!

కార్తీక... ఈ పేరును టాలీవుడ్ ప్రేక్షకులు దాదాపు మరిచిపోయారు. ఇలాంటి సమయంలో కార్తీక ఉన్నట్టుండి తను ఇక సినిమాలు చేయను అంటూ ప్రకటించింది. ఆమె ఎవరో కూడా గుర్తుంచుకోని ప్రేక్షకులు ఆమె ప్రకటననూ లైట్ తీసుకున్నారు. అయితే కార్తీక సినిమాల్లో తిరిగి అవకాశాల కోసమే అలాంటి ప్రకటన చేసిందని అంటున్నారు. అయితే సినీ జనాలు ఆమెను ఎలా లైట్ తీసుకున్నారో ఆమె ప్రకటననూ అంతే లైట్‌గా తీసుకున్నారట! సినిమాలు చేస్తానని అన్నప్పుడే అవకాశాలు ఇవ్వని వారు సినిమాలు మానేస్తానంటే ఎలా ఇస్తారు? ఈ మాత్రం తెలివి కార్తీకకు లేకుండా పోయిందా? ఆమె తల్లి రాధకి కూడా ఈ విషయం తట్టలేదా? అని కోలీవుడ్ జనాలు తల్లీకూతుళ్ళ మీద సెటైర్లు వేస్తున్నారు. మొత్తానికి ఏదో సాధిద్దామని చేసిన ప్రకటన ఇలా వికటించడం చూసి కార్తీక ఇప్పుడు తెగ బాధపడుతోందట!

ప్రవర్తిస్తాడో ఎవరికి తెలుసు? ముక్కుసూటిగా ఉండాలన్నా, ఉండనిస్తుందా ఈ సమాజం? ముక్కుసూటిగానే ఉంటానంటూ ఆదర్శాలకు కట్టుబడితే ఏమవుతుందో తనకు తెలుసు! ఆదర్శాలకు అంకితమైన తన భర్త స్వార్థశక్తుల వికృత క్రీడలో ఆహుతై పోయాడు.

ఏది ఏమైనా పిల్లల్ని నీతి నియమాలతో జీవించమని చెప్పడం పెద్దల ధర్మం! లోకాన్ని ఉద్బోధించడం మహాత్ముల ధర్మం. సుమతీ శతకం ద్వారా బద్దెన చేసిన ప్రయత్నం అదే! ఇవాళ, రేపూ అన్నాహజారేలు చేస్తున్న ప్రయత్నమూ అదే! పాటించరేమో అన్న అనుమానంతో 'మంచిమాట' చెప్పకుండా ఉండలేం.

ఏకాంత్‌కి కానీ, సాకేత్‌కి కానీ, సంకేత్‌కి కానీ, అల్లుడు కాబోతున్న రాజాకు కానీ ఉత్తమజీవితం గడపమని చెప్పడం తన విధి. తన ధర్మం. మనిషికి మంచిమాట మొదట తల్లి చెప్పాలి. పెళ్ళయ్యాక భార్య చెప్పాలి.

ఇప్పుడు ఏకాంత్‌ని దిద్దుకోవాల్సిన బాధ్యత రంజనది! సాకేత్‌ని దిద్దుకోవాల్సిన బాధ్యత నోనాది. సంకేత్ పొరపాట్లు చేస్తే దిద్దుకోవాల్సిన బాధ్యత పెళ్ళయ్యాక కవితది. రాజాని సన్మార్గంలో నడిపించుకోవాల్సిన బాధ్యత పెళ్ళయ్యాక నిశితదీ. నిగమ ఆలోచిస్తూ, అలసటగా కళ్ళు మూసుకుంది.

•••

ఎవరినీ, దేనినీ పట్టించుకోకుండా కాలం తన ప్రయాణం సాగిస్తూ వెళ్తోంది. ఆకులను దూసి పారేస్తోంది. చిగుళ్ళను అలంకరిస్తోంది. మానవుల మధ్య బంధాలను ముడివేస్తోంది. ముడిపడిన బంధాలను విడదీసి మనుషులను దూరం చేస్తోంది. కాలం నిశితనూ, రాజానూ దాంపత్య బంధంతో కలిపింది. సంకేత్‌నూ కవితనూ కలిపింది. నిగమకు సంబంధించినంత వరకూ నిశితను దూరం చేసింది. బంధాన్ని సడలించి కార్పొరేట్ హాస్పిటల్లో వృత్తి సాధించడానికి సంకేత్ కవితతో పాటు విజయవాడ వెళ్ళిపోయాడు.

వేంకటేశ్వరస్వామి పాదాలచెంత - తిరుపతిలో రాజా సబ్ ఇన్‌స్పెక్టర్‌గా జాయినయ్యాడు. నిశితను తీసుకెళ్ళి కాపురం ప్రారంభించాడు.

కాలం తన ఇంద్రజాలంలో నిగమను ఉక్కిరిబిక్కిరి చేసింది. కాలం భర్తను దూరం చేసింది. కాలం జ్యేష్ఠ పుత్రుడు ఏకాంత్‌ను ఇల్లరికం అల్లుడు పేరుతో కొంచెం దూరంగా, నామమాత్ర దత్త పుత్రుడు పేరుతో చాలా దూరంగా తీసుకెళ్ళి వదిలేసింది. ఏకాంత్ సిటీలోనే ఉన్నా, తన దృష్టిలో సుదూర ప్రాంతంలో ఉన్నట్టే! సాకేత్ ముంబైలో స్థిరపడిపోయి శారీరకంగా దూరమయ్యాడు. మానసికంగానూ దూరమయ్యాడు.

నిగమ పక్కనే ఉన్న రిమోట్ అందుకుని నొక్కింది. టీవీకి ప్రాణమొచ్చింది. మంగళవాద్యాలు వినిపించసాగాయి. నిశిత పెళ్ళి, సంకేత్ పెళ్ళి, రెండింటినీ చక్కగా మిక్స్ చేయించి ఇచ్చింది నిశిత తనకు... నిశిత, రాజా...సంకేత్, కవిత టీవీ తెరమీద బొమ్మలు నిగమను గతంలోకి లాక్కెళ్తున్నాయి. చూస్తూ, చూస్తూ సమీప గతంలోకి వెళ్ళిపోయిందామె.

## నవ్యవీక్లి-నాటా సంయుక్త నిర్వహణలో బహుమతి పొందిన కవిత




### మనిషిని మనిషిలా చూస్తే మహోదయమే

వాడు ఓ అల్పసంతోషి
విమానాలను చూసి ఈర్ష్యపడడు
కార్లు కావాలనుకోడు
కష్టానికి తగిన ఫలితాన్ని
ఇష్టంగా స్వీకరిస్తాడు
పెళ్ళాం పిల్లల కడుపు నిండిన రోజు
పండుగలా పరవశిస్తాడు
రాజకీయాలు ఒక పక్క
దళారీ వ్యవస్థ మరోపక్క
ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే
చక్రవడ్డీల చక్రబంధంలో చిక్కిన
అభిమన్యుడు వాడు
ఒక్క ముక్కలో చెప్పాలంటే
నిరుపయోగంగా పడి ఉన్న ఇనపముక్క వాడు
దోపిడి ఉన్న చోటే రాపిడి
మెత్తగా ఉంది రబ్బరని సాగదీసి వదిలితే
తిరిగి తగిలేది మన చేతికే
మండేగుణం 'నిప్పు'కే కాదు
'ఆకలి' కీ ఉంటుందని వాడికి అర్థమయ్యేసరికి
చిత్తం! చిత్తం!! అనేమాట
చిర్రెత్తించే పాటలా వినిపిస్తోంది.
ఆకలి మంటల్లో కాలి కాలి
నిప్పుకణికలా మారిన ఆ ఇనుపముక్క
కరవాలంలా మారి కలవర పెడుతుంది
కల్లాకపటం తెలియని నిన్నటి చిన్నారులే



నేటి రౌడీలు, హంతకులు, అన్నలు
గొంగళి పురుగు సీతాకోక చిలకలా మారటం ప్రకృతి
మనిషి మారణాయుధంలా మారటం వికృతి.

-హైమవతీ సత్య
సెల్:90143 96007

•••

కల్యాణ మండపం ముందు కార్లు ఆగాయి. ఎక్కడ, ఎప్పుడు కలుసుకున్నారో గానీ ఏకాంత్, సాకేత్ కార్లోంచి దిగారు. సూట్లు ధరించిన కొడుకులు హుందాగా అవుపిస్తున్నారు. రెండో కార్లోంచీ రంజన, నోనా ఇద్దరూ పట్టుచీరల్లో... నిండు గర్భిణి నోనా నెమ్మదిగా నడుస్తోంది. నిగమ హృదయం ఎందుకో ద్రవిస్తోంది. ఎందుకో కళ్ళముందు ఏదో ఆర్ద్రత, కళ్ళముందు పల్చటి తెరను పట్టుతోంది. ఏకాంత్, సాకేత్ ఇద్దరూ చిరునవ్వు నవ్వుతూ తన వైపు వస్తున్నారు. ఇద్దరూ దగ్గరగా వచ్చారు. నిగమ చేతులు అసంకల్పితంగా ఇద్దర్నీ ఒక్కటిగా దగ్గరకు తీసుకున్నాయి.

"అమ్మా..."

ఇద్దరూ ఒకేసారి అన్నారు. అమ్మా అన్న పిలుపు ఒకేసారి ఆమె రెండు చెవుల్లో దూరింది. ఆమె చేతులు కొడుకుల వీపుల్ని నిమురుతున్నాయి.

"తప్పుకోండి! అత్తయ్యను మాక్కూడా వదలండి!" రంజన నవ్వుతూ అంది. ఏకాంత్, సాకేత్ ఎడంగా జరిగారు. రంజనా, నోనా తనను నవ్వుతూ చూస్తున్నారు. రంజన వంగి నిగమ పాదాలు స్పృశించింది. "కొడుకు నెత్తుకో రంజనా!" అంది నిగమ ఆశీర్వదిస్తూ.

రంజనలాగా నమస్కరించబోతున్న నోనాను చేతులతో ఆపింది నిగమ. "సుపుత్రప్రాప్తిరస్తు!" అంది.

నోనా చిన్నగా నవ్వింది. 'అర్థమైంది అత్తయ్యా!" అంది.

"పదండి. నిశితా, సంకేత్ మీకోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నారు..." నిగమ అంది.

లోపలికి వెళ్తున్న కొడుకుల్ని వెనకవైపు నుండీ చూస్తూ ఉండిపోయింది నిగమ. వాళ్ళ నడక భర్త నడకను గుర్తుకు తెస్తోంది. అయితే వాళ్ళ 'నడత' భర్త 'నడత'ను గుర్తుకు తేవడం లేదు!

పోలికలు ఉపరితలం మీదే ఉన్నాయి! అయినా... ఏవో అజ్ఞాత తంతువులు ఆమె హృదయాన్ని వాళ్ళవైపు లాగుతున్నాయి. ఆప్యాయంగా హృదయానికి హత్తుకొమ్మంటున్నాయి. అక్కున చేర్చుకొమ్మంటున్నాయి. ఎందుకు? తల్లి అంటే అంతేనా? అమ్మ మనసు అంతేనా? సృష్టిలో అంత బలహీనమైంది - అమ్మ మనసేనా?

నిగమకి వెంటనే జగద్గురువు ఆదిశంకరుల అమృతసూక్తి గుర్తొచ్చింది. 'కుపుత్రో జాయేతక్వచిదపి, కుమాతా నభవతి!"-చెడ్డవాడైన పుత్రుడు ఉంటాడు, చెడ్డదైన తల్లి ఉండదు అన్నారు శంకరులు. నిజమేనేమో! తన పెద్ద కొడుకులిద్దరూ తప్పులు చేశారు. తన మనసును గాయపరిచారు. అయినా తన మనసు వాళ్ళ పతనాన్ని కోరుకోవడం లేదు.

తల్లిగా తను కోరేది ఒక్కటే: తన బిడ్డలు సుఖసంతోషాలతో సన్మార్గంలో జీవనయాత్ర సాగించాలి. అంతే!

నిగమ ఆలోచించుకుంటూ కల్యాణ మండపంలోకి వెళ్ళింది. నిశిత అన్నలిద్దరి మధ్య ఇరుక్కుని, నవ్వులు వెదజల్లుతోంది. రంజనా, నోనా భర్తల్ని ఎడంగా లాగి నిశితకు ఇరువైపులా చేరారు. ఇద్దరి పెదవులూ ఒకేసారి నిశిత బుగ్గల మీద అద్దుతున్నాయి వాళ్ళ ప్రేమను.

సంకేత్ అన్నలతో ఆనందంగా మాట్లాడుతున్నాడు. రాజా, కవితా వాళ్ళ దగ్గరగా వచ్చారు. అందరి ముఖాల్లో ఆనందం...

బుల్లితెరమీద దృశ్యాలు మారిపోతున్నాయి. నిశితా, రాజా భార్యాభర్తలై పోయి తన పాదాలకు నమస్కరిస్తున్నారు. సంకేత్ కవితా తన పాదాలకు నమస్కరిస్తున్నారు... ఏకాంత్, రంజన, సాకేత్, నోనా మధ్యలో కొత్త జంటలు రెండు. ఆ జంటల మధ్య తను... గ్రూప్ ఫొటోను చూస్తూ ఉండిపోయింది నిగమ.

●●●

టీపాయ్ మీద ఉన్న మొబైల్ ఫోన్ రింగవుతోంది. నిగమ వంట గదిలోంచీ వచ్చి, మొబైల్ తీసుకుని చూసింది. సంకేత్.




"చిన్నోడా!" అంది నిగమ.

"అమ్మా... గుడ్ న్యూస్!" సంకేత్ ఉత్సాహంగా అన్నాడు.

గుడ్ న్యూసా! కవిత నెల తప్పిందా? నిగమలో ఆలోచన మెదిలింది. "ఊహించనా?" నవ్వుతూ అడిగింది.

సంకేత్ బిగ్గరగా నవ్వాడు. "నువ్వు ఊహించేదేమిటో నాకుతెలుసు! నీ ఊహ తప్పుతుందమ్మా! ఎందుకంటే ఇది నీ కోడలికి సంబంధించిన వార్త కాదు. కొడుక్కి మాత్రమే సంబంధించిన వార్త! నీ కొడుక్కి గవర్నమెంట్ హాస్పిటల్లో ఉద్యోగం వచ్చింది. మొట్టమొదట నీకే చెప్తున్నా. ఇవాళే జాయినవుతున్నా!"

"చాలా సంతోషం. కంగ్రాచ్యులేషన్స్, నాయనా! నిగమ అంది. ఇప్పుడు చేస్తున్న ఉద్యోగం కన్నా, గవర్నమెంటుద్యోగం..."

"చాలా బెటరమ్మా. ప్రమోషన్లుంటాయి. గుర్తింపు ఉంటుంది. కార్పొరేట్ రంగంలో ఇవేవీ ఉండవు.." సంకేత్ అడ్డు తగుల్తూ అన్నాడు. "ముఖ్యంగా... నువ్వన్నట్టు ఇక్కడ పేదరోగులకు సేవ చేసే అవకాశం ఎక్కువ!"

"అవును.. ఆ విషయం మరిచిపోయాను. పేదలు కార్పొరేట్ వైద్యాన్ని భరించలేరు!" నిగమ అంది.

"అంతా నీ దీవెన బలమేమ్మా! ఇంటర్వ్యూ చాలా టఫ్‌గా ఉంది. అయినా, కష్టపడి సక్సెస్ సాధించాను.

పోస్టింగెక్కడ?

విజయవాడలోనే ఇచ్చారు. కొన్నాళ్ళ తరువాత ప్రయత్నించి, హైదరాబాదు బదిలీ చేయించుకోవచ్చు".

'ఎక్కడైతే ఏం నాయనా... చక్కగా విధులు నిర్వహించుకుంటూ పోతే చాలు"

"నువ్వు ఒంటరిగా అక్కడ ఉండటం నాకిష్టం లేదు... నేనైనా ట్రాన్స్‌ఫర్ చేయించుకొని అక్కడికి రావాలి. లేదంటే, అక్కడ ఇంటిని అద్దెకిచ్చేసి, నువ్వైనా ఇక్కడికి రావాలి..."

"అలాగే... ఆలోచిద్దాంలే! సంకేత్... నాకు చాలా సంతోషంగా ఉంది! కవితను జాగర్తగా చూసుకో!"

"తనే నన్ను చూసుకుంటోంది, అతి జాగ్రత్తగా!" సంకేత్ నవ్వుతూ అన్నాడు.

మొబైల్‌ని టీపాయ్ మీద పెట్టి నిగమ సోఫాలో కూచుంది. ఔను నిశిత పెళ్ళయి వెళ్ళిపోయాక, సంకేత్ విజయవాడ వెళ్ళిపోయాక తను ఒంటరిదైపోయింది. ఏకాంత్ గానీ, సాకేత్ గానీ తనను పిలవరు. తను వెళ్ళదని వాళ్ళకి తెలుసు. నిశిత పిలవదు. పిలిచినా తను వెళ్ళకూడదు. ఉండగలిగితే, ఉండాల్సి వస్తే తల్లి కొడుకులతో ఉండాలి. పెళ్ళయి, కాపురానికి వెళ్ళిన కూతురితో కాదు!

భర్త పోయినప్పుడు ఇల్లు అమ్మగా వచ్చిన డబ్బులో ఎక్కువ భాగం బ్యాంకులో వేసి, కొద్దిపాటి డబ్బుతో ఈ ఇల్లు కొంది తను. ఇల్లు చిన్నదైనా తన అనుబంధం దీనితో పెనవేసుకుపోయింది. భర్త ఆర్జించిన సొమ్ముతో సొంతమైన ఇల్లు. తను ఈ ఇంట్లోనే ఉండాలి...

●●●

నిద్రలో ఉన్న నిగమను మొబైల్ రింగ్ మేల్కొలిపింది. మంచం మీద లేచి కూచుని, అద్దాలు తగిలించుకుని మొబైల్ తీసి చూసింది. లాయరు రామానుజంగారు.

"లాయరు గారూ..." అంది నిగమ.

"ఇంట్లో ఉన్నారా?"

"ఇంట్లోనే ఉన్నాను. ఏం?"

"ఇవాళ కోర్టు పని తొందరగా అయిపోయింది. ఇంటికెళ్తూ, దారిలోనేగా - ఒకసారి మిమ్మల్ని పలకరించి వెళ్దామనుకున్నాను.. అంతే!"

"రండి... టీ రెడీగా ఉంచుతాను!" నిగమ నవ్వుతూ అంది.

టీ చప్పరిస్తూ లాయర్ రామానుజం నిగమను మెప్పుగా చూశాడు. "పిల్లల్ని పెంచి పెద్ద చేసి, ప్రయోజకులను చేయడంలో మీ కృషి మెచ్చుకోదగినది నిగమగారూ! చిన్నబ్బాయి గవర్నమెంటు డాక్టరయ్యాట్టగా!"

"నా కృషికి మీలాంటి శ్రేయోభిలాషుల ఆశీస్సులు పని చేస్తాయి రామానుజం గారూ..." నిగమ నవ్వుతూ అంది. 'అబ్బాయి మీకూ ఫోన్ చేశాడన్న మాట!"

"అబ్బే... అబ్బాయి వద్ద నా నంబరు కూడా లేదు. రాజవర్మగారు ఫోన్‌చేసి చెప్పారు. మీ కుటుంబమంటే ఆయనకి వల్లమాలిన అభిమానం.." రామానుజం అన్నాడు. "చేసిన పొరపాటును దిద్దుకునే ప్రయత్నంలో ఉన్నాడనిపిస్తోంది! తప్పదు లెండి. ఎదుటి వ్యక్తిని ఎడమ చేత్తో కొట్టినవాడు - రెండు చేతుల్తో లెంపలు వాయించుకోవాల్సిందే!"

"అయితే విషయం రాజవర్మగారు చెప్పారా మీకు?" భావోద్వేగాన్ని నిగ్రహించుకుంటూ అంది నిగమ.

"స్వయంగా ఆయనే చెప్పారు. ఏదో కేసు విషయం చర్చించడానికి చేసి మాటల్లో చెప్పారు. మీ పెద్దబ్బాయి కూడా తన బాధ్యతని గుర్తుంచుకున్నాడు లెండి. ఇల్లరికం వెళ్ళిపోయినా తమ్ముళ్ళ గురించి శ్రద్ధ తీసుకుంటున్నాడు. 'తమ్ముడి ప్రయత్నం గురించి అల్లుడుగారు చెప్పారు అన్నారు వర్మగారు. సాక్షాత్తుగా హెల్త్ మినిస్టర్ని పట్టి, సంకేత్ పేరు ప్యానల్లో మొదట ఉండేలా మేనేజ్ చేశార్ట! తప్పదులెండి! ఈ రోజుల్లో ఆ మాత్రం లాబీయింగు అవసరం.."

"అయితే.... ఆయన పెద్దరిస్కే తీసుకున్నట్టున్నాడే!" నిగమ అంది.

"నిజం చెప్పుకోవాలంటే పెద్ద రిస్కే! పోటీ బలంగా ఉందట. రాజవర్మగారు లాఘవం తెలిసిన వ్యక్తి. ఆర్డరు కాగితం కాపీ చేత్తో పట్టుకొచ్చారట!" రామానుజం చిరునవ్వుతో అన్నాడు. "ఆ మాత్రం చేయడం ధర్మం లెండి. ఐ.ఏ.యస్‌ని ఇల్లరికం అల్లుడిగా సంపాదించుకున్నాడు గదా!

"అవును" నిగమ సాదాగా అంది.

"సంకేత్ ఫోన్‌చేస్తే నేను కంగ్రాట్స్ చెప్పానని చెప్పండి. విజయవాడ వెళ్ళడం జరిగితే కలుస్తాన్లెండి, వస్తాను.. "రామానుజం లేచి గుమ్మం వైపు నడిచాడు. ఆయన గుమ్మం దాటగానే తలుపు మూసి, నిగమ తిన్నగా పడగ్గదిలోకి వెళ్ళింది. మంచం మీద బలహీనంగా వాలింది.

**(ఇంకా వుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'రుమటాయిడ్ ఆర్థరైటిస్' నివారణ సులభం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



రుమటాయిడ్ ఆర్థరైటిస్ వ్యాధిని గురించి దాదాపు 200 సం॥ల క్రితమే వైద్య సాహిత్యంలో వివరించారు. కానీ ఈ వ్యాధికి గల కారణం మాత్రం ఇప్పటికీ ప్రశ్నార్థకంగా ఉంది. ఏదేమైనా ఈ వ్యాధిని నిర్లక్ష్యం చేయకుండా సత్వరమే గుర్తించి చికిత్స చేయడం వలన దీనిని అంకురంలోనే తొలగించవచ్చు.

**రుమటాయిడ్ ఆర్థరైటిస్ గులించిన కొన్ని వాస్తవాలు:** రుమటాయిడ్ ఆర్థరైటిస్ ఒక ఆటో ఇమ్యూన్ డిసీస్ -అనగా మనిషి తన సొంత కణజాలములతోనే పోరాడినప్పుడు ఉత్పన్నమయ్యే వ్యాధి. అధునాతన హోమియో వైద్యంతో ఈ వ్యాధిని సమర్థవంతంగా నయం చేయవచ్చు. సూక్ష్మీకరణ పద్ధతిలో తయారైన హోమియో మందుల ద్వారా రోగిలోని రోగనిరోధక కణాలకు పునరుజ్జీవం కల్పించి, ఎటువంటి దుష్ఫలితాలు లేకుండా వ్యాధిని పూర్తిగా నయం చేయడం జరుగుతుంది. ఇది చాలా నెమ్మదిగా పెరిగే సమస్య. ఒకేసారి, ఒకటి కంటే ఎక్కువ కీళ్ళలో ఇది కనబడుతుంది. మొదట చిన్నచిన్న కీళ్ళలో (చేతివేళ్ళు, కాలివేళ్ళు), తరువాత పెద్దకీళ్ళలోకి (మోచేయి, మోకాలు, తుంటి) పాకుతుంది. మన శరీరంలోని వివిధ కీళ్ళలో ఉండే సైనోవియం పొరను ఈ వ్యాధి ప్రభావితం చేస్తుంది. దీంతో ఇన్‌ఫ్లమేషన్‌కి గురి అయిన ఈ సైనోవియం పొర క్రమంగా కీళ్ళలోని ఎముకలు, వాటి తాలూకు కార్టిలేజ్‌ని కూడా దెబ్బతినేలా చేస్తుంది. ఫలితంగా కీళ్ళు వాటి ఆకారం, అమరిక కోల్పోయి, విపరీతమైన నొప్పితో పాటు కీళ్ళ కదలికలు కూడా కష్టంగా తయారవడం జరుగుతుంది. ఈ వ్యాధి కేవలం సైనోవియల్ జాయింట్స్‌కు మాత్రమే కాకుండా, కొందరిలో వివిధ అవయవాలు -ముఖ్యంగా ఊపిరితిత్తులు, మూత్రపిండాలు, గుండె, రక్తకణాలు, చర్మం మొ॥ వాటిపై కూడా దుష్ప్రభావం చూపిస్తుంది. చిన్నపిల్లల్లో వచ్చే ఈ వ్యాధిని 'జువెనైల్ ఆర్థరైటిస్' అని అంటారు.

**కారణాలు:** వ్యాధినిరోధక వ్యవస్థ లోపం వలన కొన్ని కణాలు ప్రమాదకరమైన రీతిలో వ్యతిరేకంగా పనిచేసి ఆరోగ్యవంతమైన కణాలపై దాడి చేస్తాయి. ముఖ్యంగా అవి కీళ్ళలోని సైనోవియం పొర మీద ప్రభావం చూపించడంతో కీళ్ళవాతం సమస్య తలెత్తుతుంది. సాధారణంగా మన శరీరంలో తెల్లరక్తకణాలు వ్యాధినిరోధక వ్యవస్థలో ప్రధాన పాత్ర పోషిస్తాయి. బ్యాక్టీరియా, వైరస్ మరియు ఇతర పరదీయ పదార్థాల నుండి ఇవి నిత్యం కాపాడుతాయి. రుమటాయిడ్ ఆర్థరైటిస్ రోగులలో తెల్లరక్తకణాలు కీళ్ళ చుట్టూ ఉండే సైనోవియంలోకి వెళ్ళి ప్రొటీన్లను విడుదల చేయడం వలన సైనోవియం పొర మందంగా మారిపోయి దెబ్బతినడం జరుగుతుంది. క్రమేపీ కీళ్ళ లోపలి ఎముకలు, కార్టిలేజ్ ఇన్‌ఫ్లమేషన్‌కి గురి అవడం వలన కీళ్ళ అమరికలో ఏర్పడే మార్పు వైకల్యానికి దారి తీస్తుంది.

**లక్షణాలు:** కీళ్ళవాపు, నొప్పి, చేతితో తాకితే వేడిగా ఉండడం, ఉదయం లేవగానే కీళ్ళ కదలికలు బాధాకరంగా ఉండడం, బిగుసుకు పోవడం మరియు ఈ లక్షణాల తీవ్రత ఎప్పుడూ ఒకే తీరులా కాకుండా, రెండు వైపులా ఒకే రకం కీళ్ళు ప్రభావితం కావటం ఈ వ్యాధి ముఖ్య లక్షణం. వీటికి తోడు రక్తహీనత, ఆకలి సరిగ్గా లేకపోవడం, నిస్సత్తువ, బరువు తగ్గడం, కొద్దిపాటి జ్వరం, మోచేయి, మణికట్టు వంటి కీళ్ళలో చర్మం క్రింద చిన్నచిన్న బుడిపెలు (రుమటాయిడ్ నాడ్యూల్స్) ఏర్పడవచ్చు. 'కీళ్ళవాతం' సమస్యను నిర్లక్ష్యం చేస్తే వివిధ వ్యాధులు -ముఖ్యంగా గుండె జబ్బులు, కళ్ళు పొడిబారడం, లాలాజలం తగ్గిపోవడం, గుండె చుట్టూ మరియు ఊపిరితిత్తుల చుట్టూ నీరు చేరడం వంటి దుష్ప్రభావాలు తలెత్తే అవకాశం ఉంది. అందుకే దీనిని ప్రాథమిక దశలో గుర్తించి చికిత్స తీసుకోవడం ఉత్తమం.

**నిర్ధారణ పరీక్షలు:** సిబిపి, ఈఎస్ఆర్, ఆర్.ఏ. ఫ్యాక్టర్, ఏ.ఎన్.ఏ, యాంటీ సిసిపి, ఎక్స్-రే, ఎమ్ఆర్ఐ, మొదలైన పరీక్షలు వ్యాధి నిర్ధారణకు తోడ్పడతాయి.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** సైకోసొమాటిక్ డిజార్డర్స్‌లో ఒకటైన 'రుమటాయిడ్ ఆర్థరైటిస్'కు హోమియోలో సంపూర్ణ చికిత్స ఉంది. ఇతర చికిత్సా విధానాలలో కేవలం తాత్కాలిక ఉపశమనం మాత్రమే లభిస్తుంది కానీ హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో ఈ వ్యాధికి పూర్తి చికిత్స లభిస్తుంది.






నా పేరు యన్. జి. కృష్ణన్ (Patient ID. CITBF83). నేను గతంలో 2 సం॥ల పాటు రుమటాయిడ్ ఆర్థరైటిస్‌తో బాధ పడ్డాను. నా చేతి వేళ్ళు, మోచేయి విపరీతంగా నొప్పి పెట్టేవి. ఆ తరువాత క్రమంగా మోకాలి నొప్పులు మొదలైనాయి. నిద్ర లేచేసరికి విపరీతమైన నొప్పి, కూర్చొని లేచినా, కాలు కదపాలన్నా నొప్పి ఉండేది. డాక్టర్ సలహాతో వివిధ పరీక్షల ద్వారా నాకు రుమటాయిడ్ ఆర్థరైటిస్ అని తేలింది. చాలా రోజుల పాటు వివిధ మందులు వాడినా ఫలితం లేకుండా పోయింది. దీనికి తోడు నాకు మధుమేహం, రక్తపోటు కూడా ఉండేవి. చివరగా హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌ను సంప్రదించాను. అక్కడి డాక్టర్లు సూచించిన కాన్‌స్టిట్యూషనల్ మందులను క్రమం తప్పకుండా కొన్ని నెలలు వాడగానే 70 శాతం నొప్పులు తగ్గిపోయాయి. వారి సలహా మేరకు అదే కోర్సు ఒక ఏడాది కొనసాగించాను. దాంతో RA, ESR, CRP పూర్తిగా సాధారణ స్థాయికి చేరుకుని 90 శాతం వరకు నొప్పులు తగ్గాయి. మధుమేహం, రక్తపోటు కూడా నియంత్రణ కావటంతో ఇప్పుడు అల్లోపతి మందుల మోతాదు కూడా పూర్తిగా తగ్గించాను. థాంక్స్ టు హోమియోకేర్ ఇంటర్‌నేషనల్.

ఉచిత కన్సల్టేషన్ **955 000 1188 / 99**

www.homeocare.in



**భార్యంటే మొహం మొత్తిందో లేక శృంగారమంటే బోరు కొట్టిందో తెలియదు కాని ఈ మధ్యకాలంలో మురళీకృష్ణ, రాధ మంచం మీద కల్సి చాలా రోజులైపోయింది. మురళికి అసలు ఆ ధ్యాసేలేనట్లు రాత్రి ఎప్పుడో వచ్చి నాలుగు మెతుకులు తిని మంచం ఎక్కి ఒక పక్కకు తిరిగి పడుకుంటున్నాడు.**

కానీ రాధ మాత్రం భర్త స్పర్శకోసం తహతహలాడిపోతోంది. ప్రేమగా అతని దగ్గరకు చేరబోయేది. అంతే మురళి ముడుచుకుపోతూ, మంచం చివరికి జరిగి అటు తిరిగి పడుకునేవాడు. తెగించి మీద చెయ్యేసినా విసుక్కునేవాడు, నసుక్కునేవాడు. అవమానంతో సిగ్గనిపించేది రాధకు. కానీ భర్త తనను దగ్గరకు తీసుకోకపోవడం జీవితంలో అదో వెలితిలా తయారైంది ఆమెకు. నిట్టూర్పులు విడుస్తూ మంచంమీద అటూ ఇటూ పొర్లి ఎప్పటికో నిద్రపోయేది.

ఇదంతా చెప్తుంటే వీళ్ళకి పెళ్ళయి చాలా ఏళ్ళయిందేమో! ప్రౌఢ వయసులో ఉన్నారేమో నన్న అనుమానం చాలామందికి రావచ్చు. ఇంతకూ వాళ్ళకి పెళ్ళై ముచ్చటగా మూడేళ్ళు కూడా కాలేదు. వాళ్ళకింకా ఒక నలుసైనా పుట్టలేదు. ఇలాంటి సంసారానికి పిల్లలు కూడానా అని చాలామంది అనుకోవచ్చు. అయితే మురళి మగసిరి లేనివాడు, చేవ చచ్చిన వాడు కాదు. మంచం మీద అతను వీర శృంగారమూర్తి.

శోభనం జరిగిన మొదటి రాత్రే భర్త నిజంగా భర్తేనని తెలిసిపోయింది రాధకు. ఆ రోజున ఎంత మోడ్రన్ గర్ల్ అయినా కొత్త వ్యక్తి ఏకాంతంగా ఉన్న గదిలోకి ధైర్యంగా వెళ్ళాలంటే బెదురుగా అనిపిస్తుంది. రాధకు కూడా అలాగే అనిపించి గుమ్మం దగ్గర నిలబడిపోయింది. మనస్సు మారాం చేస్తున్నా అడుగులు ముందుకు పడటం లేదు.

ఇన్ని రోజులూ శోభనం గదిలోకి భార్య వెళ్ళగానే భర్త అమాంతం చేతుల్లోకి తీసుకొని ఇష్టమొచ్చినట్లు కౌగిలించేసుకొని బలంగా అదిమేసుకొని అవలీలగా రెండు చేతుల మీదకు ఎత్తుకొని మంచం మీదకు విసిరేసి, ఢామ్మని మీదపడి కలిబిలి చేసేస్తారనుకుంది.

కానీ ఇదేంటి, ఇంతసేపు నిలబడినా దగ్గరకు రాడేంటి? అన్న అనుమానంతో నెమ్మదిగా తలెత్తి చూసింది. అప్పటి వరకు ఆమెనే నిశితంగా చూస్తున్న మురళీకృష్ణ ఆమె తన వంక చూడగానే మధురంగా నవ్వాడు. పరిచయపూర్వకంగా నవ్వుతూ ఆమెలోని బెరుకును పోగొడుతున్నట్లు నెమ్మదిగా దగ్గరకు వచ్చి, లాలనగా చెయ్యి పట్టుకొని సున్నితంగా నిమిరాడు.

చిత్రమైన ఆ స్పర్శ ఆమెలో ప్రకంపనలు సృష్టించింది. ఒక్కసారిగా ఒళ్ళు జలదరించింది. అది భయంతో కాదు. అదోరకం పులకింత. తన చేతిలో వేసిన చేతిని అసంకల్పితంగా గట్టిగా పట్టుకుంది. రాధ భుజం మీద చెయ్యివేసి మంచం దగ్గరకు తీసుకొచ్చి కూర్చోబెట్టాడు మురళి.

తీయని కబుర్లు చెప్తూ ఆమె చేత పాలు

# మోగింది మురళి

-ముసునూరి సుబ్బయ్యచౌదరి



తాగించాడు. ఆనక ఒక స్వీట్ తీసి ఆమె నోటికి అందించి, అదే స్వీట్‌ని తనూ నోటితో అందుకు న్నాడు. స్వీట్ అయిపోయింది. కానీ ఇరువురి పెదాలు దగ్గరికొచ్చాయి. ఒకరి అధరాల మీద మరొకరి అధరాలు ఆని అదురుతున్నాయి. అది తీపి తీపో, అధరాల మధురమో తియ్యగా అనిపించి మరింత గట్టిగా హత్తుకుపోయాయి ఆ అధరాలు.

మురళి చేతులు రాధ వీపును సుతారంగా నొక్కుతూ దగ్గరకు లాక్కుంటున్నాడు. ఆ ఒరి పిడి చాలదన్నట్టు రాధ తన చేతులను మురళి భుజం మీద వేసి గుచ్చి గట్టిగా హత్తుకుంది. ఇంకా... ఇంకాస్త గట్టిగా అన్నట్టు అతన్ని లతలా అల్లుకుపోసాగింది. అంతవరకు ఆమెలో ఉన్న సంకోచమంతా ఏమైపోయిందోనన్న ఆలోచన కూడా రాధకు రావడం లేదు. ఒకటే తపన... తృష్ణ... ఒకరినొకరు హత్తుకుని అలాగే మంచంమీద వాలి పోయారు. అక్కడో ఉధృతమైన శృంగార రణం జరిగింది. ఇద్దరూ విజేతలయ్యారు.

అలసిన శరీరాలు సేదతీర్చుకుంటున్నాయి. చెదిరిన ముంగురులు చిరుచెమటల నతుక్కుని చిత్రంగా కనిపిస్తున్నాయి. విడివడిన కంచుకంలో నుండి హిమగిరులు ఎగిరెగిరి పడుతున్నాయి. గులాబి రేకులు అద్దినట్టుగా కుంకుమవర్ణంలో శోభాయమానంగా శిఖరాలు కనిపిస్తున్నాయి. ఎదలు ఆయాసంతో ఎగిసెగిసి పడుతున్నాయి. ఎత్తుల అందాలు లయబద్ధంగా కదులుతున్నాయి.

తనకు ఏ మాత్రం అదురుపాటు, అయోమయం లేకుండా శృంగార సమ రానికి సమాయత్తం చేసిన భర్తను కృతజ్ఞతగా చూసి థాంక్యూ అంది రాధ. ఆమె సంతోషాన్ని దాచుకోలేకపోయింది. మురళి లాలనగా ఆమె ముంగురులు నిమిరి ఆమె మోమును తన ఎదపై



ఉంచుకున్నాడు. కండలు తిరిగిన గండరగండడు తనకండగా ఉండగా చింతేమిటన్నట్టుగా భర్త కైదండను దిండుగా చేసుకొని అతని ఎద చప్పుడు వింటూ నిద్రలోకి జారుకుంది రాధ.

అలా నిరాటంకంగా వారి కాపురం రెండేళ్ళ పాటు సాగిపోయింది. మూడో ఏడు ప్రవేశించిన ప్పటి నుండే భర్తలోని నిరాసక్తత గమనించింది రాధ. మొదట్లో తన కోరికమీద దగ్గరకు చేరే వాడు భర్త. అదీ ఏదో మొక్కుబడిగా... అతనిలో పూర్వమంత ఆవేశం కాని, తపన కాని ఉండేవి కావు. తప్పనిసరి అనే భావన కనిపించేది. క్రమేపి అది కూడా తగ్గిపోయింది. భర్తకేమైందో అర్థం కావడం లేదు రాధకు. మిగిలిన సమయమంతా అన్నింటా మామూలుగా ఉంటున్నవాడు, రాత్రి పూట మంచం మీద మంచుముద్దలా ఎలా మారి పోతున్నాడో ఆమెకు అయోమయం అయిపోతోంది. ఎవరికి చెప్పుకోవాలో అర్థం కాక సతమతం కాసాగింది రాధ.

అదే సమయంలో ఆమెను చూడటానికి రాధ మేనత్త సుమతి వచ్చింది. ఆమె వయసు నలభై పైనుంటుంది. కాని ఎప్పుడూ నలగని పువ్వులా ఉంటుంది. ముఖంపై చిరునవ్వు, కళ్లల్లో మెరుపు, సందర్భోచితంగా అవయవాల కదలిక, కల్మషం లేని హావభావాలు, సరస సల్లాపాలు ఆమెను మనుషులకు దగ్గర చేస్తాయి. ఆమెకు పరిచయ మైన ప్రతిఒక్కరూ ఆమె మా మనిషే అన్నట్టుగా భావిస్తుంటారు. ప్రస్తుతం ఏమీ తేల్చుకోలేని అయోమయంలో ఉన్న రాధకు మేనత్త రాక గొప్ప ఊరటనిచ్చింది.

మేనకోడలితో సరదాగా గడుపుదామని వచ్చింది సుమతి. ఇంకా ప్రయాణబడలిక తీరనేలేదు. మేన కోడలితో అచ్చట్లు ముచ్చట్లు మొదలు కాలేదు. మర్నాడే సుమతి భర్త రాజారావు వచ్చేశాడు. ఆశ్చర్యంగా చూస్తున్న సుమతితో "ఏమోనోయ్! నువ్వు లేకుండా ఒక్కక్షణం ఇంట్లో ఉండబుద్ధి కాలేదు. పనులన్నీ మా మేనల్లుడికి అప్పగించి వచ్చేశా" అన్నాడు మొహమాటంగా నవ్వుతూ. సిగ్గుపడుతున్న భర్తను చూసి మురిపెంగా నవ్వింది సుమతి. సుమతి ముఖంలోని మెరుపును కని పెట్టింది రాధ.

ఆ రాత్రి వాళ్ళకు తమ బెడ్రూమ్ ఇచ్చింది రాధ. "కొత్త దంపతులు మీరు పడుకోవాలి ఆ రూమ్‌లో. అది మీ స్వంతం. మాకిస్తున్నావేంటి? వద్దు, మేము ఆ రూమ్‌లో పడుకుంటాం" అభ్యంతరంగా అంది సుమతి.

"పర్వాలేదులే అత్తా! నాలుగు రోజులకు కొంపలు మునిగి పోయేదేం లేదు. మేం ప్రస్తుతం ఎక్కడ పడుకున్నా పర్వాలేదు. రాకరాక మా ఇంటికొచ్చారు. మీకు లోటుచేస్తే నాకు ఇదిగా ఉంటుంది. అన్నీ లోపలపెట్టాను. వస్తాను. గుడ్ నైట్" అంటూ గదిలోకి వెళ్ళింది రాధ.

పిల్లలు లేరు కాబట్టి ప్రస్తుతం దాన్ని గెస్ట్ రూంగా వాడుతున్నారు. రెండు మడత మంచాలు వేసి ఉన్నాయా గదిలో. అప్పటికే మురళి ఒక మంచంమీద పడుకున్నాడు. అతను గాఢనిద్రలో ఉన్నట్టుగా అతని ఉచ్ఛ్వాసనిశ్వాసలు చెప్తున్నాయి. భర్త వంక నిర్లిప్తంగా చూసి, మంచంమీద పడు కుంది రాధ. కానీ నిద్రరావడం లేదు. ఆలోచనలు ఆమెను ఆరడి పెడుతున్నాయి.

సుమతత్త పెళ్ళయి పాతికేళ్ళయింది. ఒక్కతే కూతురు. ఇంచుమించు తన ఈడుదే. తర్వా తెందుకో వాళ్ళకు పిల్లలు పుట్టలేదు. ఈ మధ్యనే ఉన్న ఒక్క కూతురికి పెళ్ళి చేసి అత్తారింటికి పంపించేశారు. కానీ సుమతి అత్తయ్యను చూస్తుంటే రాధకో వింత. తన చిన్నప్పుడు అత్త ఎలా ఉందో, ఇప్పుడూ అలాగే ఉంది. మావయ్య మాత్రం జుట్టు రాలిపోయి ముసలాడిలా తయారయ్యాడు. అయినా ఈరోజుకి కూడా భార్యనొదిలి ఒక్కరోజు కూడా ఉండలేకపోయాడంటే వింతగా అనిపించింది.

ఆలోచనలతో నిద్రపట్టక హాల్లోకి వచ్చింది రాధ. కుతూహలం ఆపుకోలేక అత్త పడుకున్న గది దగ్గరకు వచ్చింది. ఏమన్నా శబ్దాలు వినిపిస్తా యేమోనని చెవి రిక్కించింది. చిన్నగా మంచం కదులుతున్న చప్పుడు, సన్నగా గాజుల చప్పుడు, ఆపుకుందామన్నా ఆపుకోలేని అత్త ఊర్పులు లయ బద్ధంగా వినిపించసాగాయి. పాతికేళ్ళ కాపురం తర్వాత కూడా ఇది ఎలా సాధ్యమో, ఎంత ఆలో చించినా అర్థం కావడం లేదు రాధకు. ఒక నిట్టూర్పు విడిచి మౌనంగా తన మంచం దగ్గరకు వచ్చింది. కోరికగా భర్తవంక చూసింది. అతనిలో అదే నిశ్చింత. ఎప్పటికోగాని నిద్ర పోలేకపోయింది రాధ.

తెల్లవారాక భర్త లేవడంతో లేచింది రాధ. టిఫిన్ చేసి, అన్నం వండి భర్తకు కేరేజి సిద్ధం చేసింది. మురళి టిఫిన్ తిని కేరేజి పట్టుకొని వెళ్ళిపోయాడు. రాధ పనులన్నీ పూర్తయ్యేసరికి

సుమతి గది తలుపులు తెరుచుకొని వచ్చింది. రాధ ఆమెవంక చూసింది. శోభనం పెళ్ళికూతురిలా తెగిన పూలమాల వేలాడుతోంది. చెదిరిన జుట్టు, నలిగిన బట్టలు ఆమె పొందిన సుఖానికి గుర్తులుగా కనిపించసాగాయి.

తననే పట్టిపట్టి చూస్తున్న రాధను చూసి, "సారీనే! మెలకువ రాలేదు. బాత్‌రూం" అని "అయ్యో నా మతిమండ, బాత్‌రూం మా గదిలోనే ఉంది కదా! స్నానం చేసి వస్తానుండు" అని మళ్ళీ గదిలోకి వెళ్ళి తలుపేసుకుంది సుమతి.

అరగంట తర్వాత తలుపు తీసింది సుమతి. ఇప్పుడు మామూలు సుమతిలానే ఉంది. అదే నలగని పువ్వులా నవ్వుతూ బయటకొచ్చింది. ఆమె వెనుక టవల్‌తో బట్టతల తుడుచుకుంటూ వచ్చాడు రాజారావు. వాళ్ళిద్దరికీ టిఫిన్ పెట్టింది. టిఫిన్ తింటుండగా ఇంతింత కళ్ళు చేసుకుని తననే చూస్తున్న మేనకోడల్ని చూసి సుమతి భ్రుకుటి ముడిపడింది. రాధ చూపులో ఏదో తేడా ఉంది. నిద్రపోనట్టుగా ఉన్న ఆమె కళ్ళను చూసి ఏదో అనుమానం వచ్చేసింది సుమతికి.

రాజారావు టిఫిన్ తిని, ఏదో బజారు పనుందని బయటికి వెళ్ళాక రాధను తీసుకొని పడకగదిలోకి వెళ్ళింది సుమతి. "ఇప్పుడు చెప్పు. ఏమిటి నీ బాధ" లాలనగా అంది సుమతి.

"బాధా! అబ్బే అదేం లేదే, మామూలుగానే ఉన్నాను కదా!" ఉలికిపాటుతో తనకు తను సర్దిచెప్పుకుంటున్నట్టుగా అంది రాధ.

"చూడు రాధా! నా సర్వీసంత లేదు నీ వయసు. పేరుకు మేనకోడలివైనా, నా కూతురెంతో నువ్వూ అంతే. ఒక్కోసారి దానికంటే నువ్వే ఎక్కువ అనుకునేదాన్ని. ఎందుకంటే నువ్వు నా అన్న కూతురివి కాబట్టి. నీ కళ్ళలో ఏదో బాధ కనిపిస్తుంది. అవి తేటగా కనిపించటం లేదు. రాత్రంతా నిద్రలేకుండా గడిపినట్టు ఎర్రగా ఉన్నాయి. మరొకటి, ఎంతగొప్ప అతిథులొచ్చినా ఎవరూ తమ సొంత పడక గదిని ఇవ్వరు. నువ్విచ్చావ్. అంటే నీకు దానిమీద పట్టింపు లేదన్నమాట. ఇంతకూ మీ ఇద్దరి మధ్య సంబంధాలెలా ఉన్నాయ్? పర్లేదు చెప్పు. ఎవరికీ చెప్పుకోకపోతే బాధెలా తీరుతుంది" లాలనగా అడిగింది సుమతి.

ఇంక ఆపుకోలేకపోయింది రాధ. భర్త నిరాసక్తత, తన నిద్రలేని రాత్రుల గురించి వివరంగా చెప్పింది.

సుమతి ఆలోచనలో పడింది. పులిలాంటి మగాడు పిల్లిలా ఎలా మారిపోయాడు? ఆమెకు ఓ పట్టాన అర్థం కాలేదు. ఆమె తన శృంగార జీవితాన్ని ఒకసారి రివ్యూ చేసుకుంది. తను బయట ఉన్న రోజులే కాకుండా, నీరసంగా ఉన్నప్పుడు, తను అలసిపోయి వచ్చి అలాగే పడుకున్నప్పుడు భర్త దగ్గరగా వచ్చేవాడు కాదు. అంతే సుమతికి రాధ జీవితంలో లోపమేమిటో తెలిసిపోయింది.

"చూడు రాధా! మురళీ ఉదయం నుండి పడుకునే వరకూ ఏం చేస్తాడు?"

"ఉదయం పనులయ్యాక శుభ్రంగా గడ్డం గీసుకొని స్నానం చేస్తాడు. టిఫిన్ తిని బాక్స్ తీసుకొని వెళ్ళిపోతాడు. వచ్చాక టీ తాగుతాడు. కాసేపు బయటకు వెళ్ళి వాకింగ్ చేసి వచ్చి స్నానం చేస్తాడు. భోంచేశాక బ్రష్ చేసుకొని నీట్‌గా ఫ్రెష్‌గా తయారయి కాసేపు టీవీ చూసి పది గంటలకల్లా నిద్రపోతారు".

"అలాగా! మరి నువ్వేం చేస్తావ్".

"ఉదయం ఆయన వెళ్ళాక స్నానం చేస్తాను. ఆయన వచ్చేవరకూ పనులుంటే చూసుకుంటాను. వచ్చాక టీ ఇచ్చి వంట చేస్తాను. ఆయన భోంచేశాక రాత్రి గిన్నెలు కడిగి వంటిల్లు శుభ్రం చేస్తాను. నేను వచ్చాక ఆయన పడకగదిలోకి వెళతారు. పొడిపొడిగా మాట్లాడి పడుకుంటారు. నేనూ ఏం చేయాలో తెలియక పడుకుంటాను. చాలా ప్రయత్నించాను, ఆయనలో కదలిక రప్పించాలని. ఊహూ..లాభం లేదు. ఆయన ఋడుడైపోయాడు" కళ్ళలో నీళ్ళు నింపుకుంటూ అంది రాధ.




"రాత్రిపూట నీవు కూడా మీ ఆయనలా ఫ్రెష్‌గా స్నానం చేసి పడుకుంటావా?"

"అన్నిసార్లు స్నానం ఇంట్లో పనులు చేసే మనకెలా కుదురుతుందత్తా".

"పోనీ శుభ్రంగా ముఖం కడుక్కుని, చక్కగా తల దువ్వుకొని, పూలు పెట్టుకొని ముఖానికింత పౌడర్ రాసుకొని పడక గదిలోకి వెళతావా?"

"అవన్నీ ఎందుకు?" అమాయకంగా అడిగింది రాధ.

"పిచ్చితల్లీ! ఎందుకంటావేమిటే? ఉన్నదంతా దాన్లోనే ఉంది. ఉదయం నుంచి పనులు చేసి చేసి ఆ చెమట వాసనతో జిడ్డోడుతున్న ఒంటితో ఉన్న ఏ ఆడదాన్ని చూసి మగాడి మనస్సు స్పందిస్తుంది. ఏదో కక్కుర్తికొద్దీ ఓ నాలుగైదు సార్లు అంతే, ఆపైన ఆమెముఖం చూడాలంటేనే చికాకొస్తుంది. ఇది మగవాడికే కాదు, ఆడదానికి కూడా వర్తిస్తుంది. అందుకే మంచం మీదకు వెళ్ళేముందు ఆడా, మగా ఇద్దరూ పువ్వుల్లా వెళ్ళాలి. తెల్లారేసరికి వడలిన పువ్వుల్లా బయటికి రావాలి. అదీ సుఖ సంసారం".

ఆశ్చర్యంగా చూసింది రాధ. "నిజమా! అందుకే ఆయన దగ్గరకు రావడం లేదా! మరదయితే నాకు చెప్పొచ్చు కదా!" అనుమానంగా అంది రాధ.

"చెప్పే ఉంటాడు. నువ్వు పట్టించుకొని ఉండవు. పదేపదే చెప్పలేక ఊరుకుని ఉంటాడు. అతను క్రమేపి చల్లబడిపోయాడు".

"అలాగా! ఇప్పుడెలా? ఏం చేయాలి?" ఆలోచిస్తూ అంది రాధ.

"ఎలాగో నేను చెప్తాను. నేను చెప్పినట్టు చెయ్ చాలు" అంది సుమతి.

ఆ సాయంకాలం రాధ ఒళ్ళంతా సున్నిపిండితో తోమి, మంచిషాంపూతో తలస్నానం చేయించింది. సాంబ్రాణి వేసి కురులు ఆరబెట్టింది. తెలుపు రంగులో ఉన్న చీరతీసి కట్టబెట్టింది. తల దువ్వి లూజుగా వదలివేసింది. ఒక పక్కగా పిన్నుతో మల్లెపూల చెండును సర్దింది. భోజనాలయ్యాక రాధ వాళ్ల పడకగదిని వాళ్ళకే ఇచ్చేసింది సుమతి.

మురళి గదిలోకి వెళ్ళాక, రాధ మంచినీళ్ళు తీసుకొని గదిలో కొచ్చింది. ఆమె వస్తుంటే కొత్తగా అదో మత్తైన గమ్మత్తు వాసన వస్తుంది. గదిలో పరిమళాలు వ్యాపించగానే అప్పుడే మగతలోకి జారుకుంటున్న మురళి కళ్ళు విప్పాడు. ఎదురుగా రతీదేవిలా రాధ! చక్కని చుక్కలా ముద్దొచ్చే మోముతో మెరిసిపోతున్న రాధను చూసి తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు. అతని ఒంట్లో జివ్వొచ్చిన నరాలు తిరిగి జీవం పోసుకోసాగాయి మెల్లగా. రాధ వంక అలా చూస్తుండిపోయాడు.

రాధ దగ్గరగా వచ్చింది. ఏదో పని ఉన్నట్లుగా అతని మీదుగా వంగి దుప్పటి తీసుకుంది. అలా వంగినప్పుడు ఆమె తలనుండి వస్తున్న కొత్త వాసనలు అతన్ని మత్తెక్కించాయి. వంగినప్పుడు ఆమె ఎత్తులు అతని ముఖానికి తగిలి అల్లరి పెట్టాయి. పురెక్కిన పుంసత్వం ఆగలేకపోయింది. ఒక్కసారిగా రాధను చేతుల్లోకి తీసుకొని గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు మురళి.

రాధ పొంగిపోయింది. బలమైన భర్త బాహువుల తాకిడికి మంచులా కరిగిపోసాగింది. అతని చేతులు ఆమెను ఎక్కడెక్కడో తడుముతున్నాయి. మర్చిపోయిన దేనికోసమో వెతుకుతున్నట్టున్నాయి. భర్త కదలికలకు అనుగుణంగా కదులుతోంది రాధ.

అధరానికి అధరం, ముఖానికి ముఖం. మోహానికి మోహం, దేహానికి దేహం నాగుల్లా పెనవేసుకు పోతున్నారు. బరిలోకి దిగిన వస్తాదుల్లా ఒకరినొకరు నలిపేసుకుంటున్నారు. ఊర్పులు... నిట్టూర్పులు... కరిగిపోయిన నిశ్శబ్దం, మధురమైన రేయిలా మారిపోయింది. చాలారోజుల తర్వాత ఒకరి కౌగిలిలో ఒకరు అలసి సొలసి నిద్రపోయారా దంపతులు.

మరునాడు సుమతి ముందు లేచింది. టిఫిన్ చేసి సిద్ధంగా ఉంచింది. నిన్న సుమతిలా ఆలస్యంగా లేచి బయటకు వచ్చి, అత్తని చూసి సిగ్గుపడింది రాధ. ఆమె ముఖంలోని తృప్తిని గమనించి మేనకోడలిని దగ్గరగా తీసుకొని తల నిమిరింది సుమతి, సంతోషంగా నవ్వుతూ.

***సెల్:99499 41996***

## అలర్జీ - హోమియో చికిత్స

అలర్జీ అనే పదం మనము సర్వసాధారణంగా ప్రతీ రోజు వింటూ వుంటాము. అలర్జీ అనేది రోగనిరోధక వ్యవస్థకు సంబంధించిన ఒక రుగ్మత. వర్షాకాలం మెరిసే వేడి వేసవి నుండి ఉపశమనం ఇస్తుంది. అలాగే అది పలురకాల వ్యాధులతో ప్రాణాలు తోడేయునూ వచ్చు. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా వర్షాకాలంలో ఒక అలర్జీ సమస్య వేదిస్తుంది. తుమ్ములూ, దగ్గులే కాదు ఒక్కోసారి శ్వాసతీసుకోవడము కష్టమవుతుంది. ఈ జలుబు మరియు దగ్గు సహజంగా వైరల్ జ్వరాలకు దారితీస్తుంది. ఈ వర్షాకాలంలో ఆస్తమా, అలర్జీ, బ్రాంకైటీస్, ఫ్లూ వంటి వ్యాదులు ఎక్కువ చూస్తాము. మన అధునిక జీవనం, పారిశ్రామిక ప్రాంతాలలో మరియు పెద్ద పట్టణాలలో వాతావరణ కాలుష్యం ఈ అలర్జీ ఒక పెద్ద కారణం.

అలర్జీతో ఇబ్బందులు పడేవారి బాధ వర్ణనాతీతం. వయసుతో నిమిత్తం లేకుండా చిన్నా, పెద్దా అందరు శ్వాసకోశ అలర్జీలను కలిగించే వాటిలో ప్రధానమైనవి. అలర్జీతో బాధ పడేవారిలో ఏదో ఒక ప్రత్యేకమైన పదార్థానికి దగ్గరగా వచ్చినప్పుడు శరీరంలోని రక్తంలో ఉండే ఇమ్యూనోగ్లోబిన్-ఇ అనే యాంటీబాడీస్ తో అలర్జిన్ కలవడం వల్ల హిస్టమిన్ విడుదల వుతుంది. దీని వలనే వ్యాధి లక్షణాలు ప్రారంభ మవుతాయి. మనిషి శారీరకతత్వము, వాతావరణం, వంశపారంపర్య చరిత్ర, గాలి, నీరు, ఆహారం వీటిలో కలిగే మార్పులు, కలుషితం వలన రక్తంలో జరిగే మార్పుల వలన ఈ అలర్జీ కొందరికి కొన్ని పదార్థములు, కొన్ని వస్తువులు అలర్జీ కారణం అవుతాయి.




**కారణాలు:** 1.దుమ్ము, పుప్పొడి రేణువులు. 2. పెంపుడు జంతువుల వెంట్రుకలు 3. ఘాటు వాసనలు, చల్లటిగాలి. 4. శీతలపానియాలు, ఐస్క్రీమ్‌లు. 5.వంశపారం పర్యం. 6.మస్కిటో రిపెల్లెంట్స్. 7.వాతావరణ మార్పులు.

**లక్షణాలు:** తుమ్ములు, ఆయాసం, శ్వాసలో ఇబ్బందులు, వాంతులు, ఉబ్బసం, ముక్కు కారడం, ఎర్రని దద్దుర్లు, కళ్లు దురద, కంటిపోర గుచ్చు కోవడం.

**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



**వ్యాధి నిర్ధారణ:** సి.బి.పి, ఈఎస్ఆర్, ఇసోనోఫిల్ కౌంట్ (ఏఈసీ), ఐజీ.ఈ.యాంటీబాడీస్, ఎక్స్‌రే, ఫల్మనరీ ఫంక్షన్‌టెస్ట్, సిటీస్కాన్, అలర్జిక్‌ప్రొఫైల్.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అలర్జీ నుంచి పూర్తిగా ఉపశమనంకలిగించే మందులు ఉన్నాయి. హోమియోచికిత్సతో అన్ని రకాల అలర్జిక్ సమస్యలు దూరమవుతాయి. హోమియోపతిలో అలర్జీకి మంచి మందులు అందుబాటులో ఉన్నాయి. రోగ నిరోధక శక్తిని పెంచి వ్యాధి నివారణ త్వరితంగా అయ్యేలా చేయడం జరుగుతుంది. అలర్జీ ఏ కారణం వలన వస్తుంది. ఎంత తీవ్రంగా వుంది, తీవ్రతను బట్టి మందులు ఇవ్వబడుతాయి. దీనికి హోమియోలో ఆర్సనిక్ ఆల్బ్, రస్టాక్స్, బెల్లడోన, ఆర్టికముర్సిన్స్, ఆరమ్‌ట్రైఫిలమ్, ఇఫ్రెసియా, ఆలెయంసెప మొదలగు మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడితే అలర్జీ సమూలంగా తగ్గిపోతుంది.



## డయాబెటీస్ - ఆయుర్వేదం

ఎవరువెప్పారు? డయాబెటీస్ వ్యాధి ఇక జీవితాంతం సమస్య అని, ఇప్పుడు స్టార్ ఆయుర్వేద మీకొరకు తీసుకొని వచ్చింది. ప్రపంచ ప్రామాణికమైన అత్యున్నత సౌకర్యాలు కలిగిన వైద్యం. దీనితో మీ సమస్యలన్నీ పరిష్కార మవుతాయి.

ఈ రోజు భారతదేశంలో ప్రతి 100 మందిలో 14 మంది డయాబెటీస్ బారిన పడుతున్నారు. ఈ వ్యాధి దుష్ఫలితాలు. విపరీతమైన దాహం, అధిక మూత్రవిసర్జన. ఆకలి ఎక్కువగా ఉండటం, ఎంత ఆహారంతీసుకున్నా శక్తి లేక పోవడం, బలహీనంగాఉండటం. బరువు తగ్గడం, నీరసం, నిస్సత్తువ, చూపు మందగిం చటం, మబ్బుగా, మసకగా కనిపించటం, ఎక్కువ అలసట, కాళ్ళు లాగడం, ఏదైనా దెబ్బలు (గాయాలు) తగిలితే త్వరగా తగ్గక పోవడం. కొన్నేళ్ళ తర్వాత శరీరం లోని గుండె, మెదడు, కాళ్ళు, చేతలలోని పెద్ద రక్తనాళాలు దెబ్బ తినడం. చిన్న రక్తనాళాలు దెబ్బతిన్నందు వల్ల కంటిలోని రెటీనా దెబ్బ తినటం. నరాల బలహీనత, కళ్లుమంటలు, మానసిక, సెక్స్ సమస్యలు.నిత్యం వాడే షుగర్ వ్యాధి నిరోధక పాశ్చాత్య రసాయనాలు చర్మంమీదమచ్చలు, తలనొప్పి, జీర్ణ సంబంధిత సమస్యలకు కారణమవుతా యి. దాంతో పాటు అవాంఛిత ఫలితాలు కలగవచ్చు. కానీ ఆయుర్వేదంతో ప్రతికూల ఫలితాలుండవు. ఇది ఎంత ప్రభావపూర్వకమో, అంత శాశ్వతంకూడా. ఇప్పుడు స్టార్ ఆయుర్వేద సరికొత్త ఫార్ములాతో మీ ముందుకు వచ్చింది. ప్రకృతిలో ఉన్న వన మూలికలనుపయోగించి, 36సం॥ల అనుభవం తో లక్షలమంది పేషెంట్లకు ఉపశమనం కలిగించిన మందులు ఇప్పుడు మీఅందుబాటు లోకి వచ్చాయి. మీరు ఎనేళ్ళ నుండి బాధపడు తున్నారు, ఇది అనువంశి కమా లేదా మానసిక ఒత్తిడి వల్ల వచ్చిందా? రోగలక్షణాలకు మీ వ్యాధి తీవత్రకు మా నిపుణులైన డాక్టర్లు అమూలాగ్రం పరిశీలించి, మందులు ఇస్తారు. ఈ మందులు మొదలు పెట్టాక వాటిని మెల్లమెల్లగా పాశ్చాత్య రసాయనిక మందులు తగ్గించబడతాయి. ఈ అత్యాధునిక ఫార్ములాతో కూడిన మందులు వల్ల మీకు సరికొత్త జీవితం ఖాయం. డయాబెటీస్‌ను వ్యాధిగా భావించ కండి. అది కేవలం మీరు చేయువలసిన జీవితవిధానాలలో మార్పులను సూచిస్తుంది. మీ జీవితంలో మార్పును తీసుకు వచ్చి దానిని కంట్రోలులో ఉంచడమే కాదు. ప్రీ-డయాబెటిక్స్‌తో పూర్తిగా తగ్గించవచ్చు.

ఉదా॥ అత్యాధునిక స్టార్ ఆయుర్వేద మందులతో పాటు పీచుపదార్థాలు అధికంగా తీసుకోవడం, ఉప్పు, చక్కెర సంబంధిత పదార్థాలు అధికంగా తీసుకోవడం, వ్యాయామం చేయడం ద్వారా డయాబెటీస్‌ను శాశ్వతంగా పరిష్కరిచవచ్చు. సంప్రదాయ, అత్యాధునిక టెక్నాలజీ, అత్యాధునిక మందులు 36 సం॥ల అనుభవం కలిగిన ఆయుర్వేద డాక్టర్‌లు ఇప్పుడు స్టార్ ఆయుర్వేదలో మీకు అందు బాటులోఉన్నారు. డయాబెటీస్ గురించి బాధ పడకండి. దానిని మీరు సరైన శ్రద్ధతో కంట్రోలు లో ఉంచు కోకపోతే మెల్లిమెల్లిగా అది మీ శరీరాన్ని కబలిస్తుంది. 5000 ఏళ్ల ఆయుర్వేద వైద్య విధానం ఇప్పుడు అత్యాధునిక టెక్నాలజీరూపంలో మీ సేవకై వచ్చింది మా స్టార్ ఆయుర్వేద.

**డా. లక్ష్మీ** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

11

శరత్‌చంద్ర

# సమంత@లవ్

సెల్: 98492 41286

**సమీర అకౌంట్స్ చూస్తోంది. సమంత శాలరీ చెక్ చేసి చారిటీకి ఆన్‌లైన్ ద్వారా పంపుతోంది. చెక్స్ చేర్చడం ఆలస్యం అవుతుందని సమంత ఈ ఏర్పాటు చేసుకుంది. సమంత బ్యాంక్ బ్యాలెన్స్ దరిదాపు నిల్‌గానే ఉంటుంది. తల్లికీ, చారిటీకీ పంపిన తర్వాత తిరిగి చూసుకుంటే చిన్న చిన్న ఖర్చులకు కూడా తాను ఇబ్బంది పడుతుండేది.**

సమీర తన అకౌంట్‌లో ఉన్న డబ్బుల్ని కొంత మేరకు ట్రాన్స్‌ఫర్ చేస్తూ ఉండేది. మొదట్లో సమంత పెద్దగా గమనించేది కాదు.

ఒకసారి అడిగింది. "అదేంటే, నా అకౌంట్ అక్షయ పాత్రలాగా ఉందే. బ్యాలెన్స్ పాతిక వేలుంది. ఎక్కణ్నుంచి వచ్చాయ్" అంది ఒకరోజు ఏటీయంలో నుండి డబ్బు డ్రా చేస్తూ.

సమీర నవ్వి నీ డబ్బుకు రెక్కలు ఎక్కువ కదా?" అనేది.

"నిజమే...ఈ రెక్కలు ఊరుకోవు కదా, ఎక్కడో ఓ దగ్గర వాలాలని పరితపిస్తుంటాయ్" అంది నవ్వుతూ.

సమీర నవ్వి "నా పుణ్యం కూడా నువ్వే మూట గట్టుకోవే" అనేది.

గతంలో ఫ్లాట్ అద్దె...వంట ఖర్చులూ అన్నీ సమీరే చూసుకునేది.

రమణను పెళ్ళి చేసుకొని సమీర వెళ్ళిన తర్వాత వంట ఖర్చులూ, వగైరా బాధ్యతలూ సమంత మీదే పడేవి. సమంత సంగతి తెలిసి శ్రీకర్ కూడా ప్రతి నెలా తన శాలరీ నుంచి సగం అమౌంట్ సమంతకే షిఫ్టు చేసేవాడు. సమంత తన అకౌంట్ చెక్ చేసుకున్నప్పుడు గమనించేది. ఖర్చులకు పోను పెరిగిన మొత్తాన్ని తను వినియోగించుకోకుండా చారిటీకి ఇచ్చేది.

"శ్రీకర్ ఫీలవ్వడా" అడిగిందొకసారి సమీర.

"అతడితో సహజీవనం చేస్తా...అతడి డబ్బుతో కాదు.." అనేది నవ్వుతూ.

"అతన్ని నీ గార్డియన్‌గా పెట్టుకున్నావ్ కదా? అతడి డబ్బుకు కూడా హక్కుదారురాలివే కదా?" అంది సమీర నవ్వుతూ. గతంలో గార్డియన్ ప్లేసులో తల్లి పేరే ఉండేది.

ఇప్పుడు ఆ స్థానాన్ని శ్రీకర్ ఆక్రమించడం సమీర గుర్తించింది. సమంత తను 'మెటీరియలిస్టు' అనుకుంటుంది కానీ ఆమె సెంటిమెంటల్ ఫూల్ అనుకుంది సమీర. ఆ వారం అకౌంట్స్ సెక్షన్‌కి షిఫ్టు అయ్యింది సమీర. అకౌంట్ చెక్ చేస్తుంటే గార్డియన్ ప్లేస్‌లో తిరిగి సమంత తన తల్లి పేరు చేర్చడం గమనించింది. లంచ్ టైంలో అడిగింది. "నీ అకౌంట్ చెక్ చేసేటప్పుడు చూశానే...శ్రీకర్ పేరును తీసేశావ్, ఎందుకు?" అడిగింది.

సమంత వెంటనే సమాధానం చెప్పలేదు.



సమీర ఒత్తిడి చేసిన తర్వాత...

"శ్రీకర్ నుండి దూరంగా వెళ్తున్నాను కదే. ఇక అతడి పేరు వాడడం ఎందుకు? అనిపించింది. అతణ్ణే కాదు అతడి జ్ఞాపకాలను కూడా వదిలించుకోవాలి కదా?" అంది.

అలా అనేప్పుడు సమంత గొంతులో స్వల్పంగా వణుకు.

సమంత చేతిని అనునయంగా నొక్కింది సమీర.

ఆమె కళ్ళ చుట్టూ స్వల్పంగా కన్నీటి వలయాలు పరుచుకోవడం సమీర గమనించింది.

•••

ఆరోజు కాస్త ఆలస్యంగా ఇంటికి వచ్చిన శ్రీకర్ సమంత డల్‌గా కూర్చొని ఉండడం చూసి "సమూ... ఏంటలా ఉన్నావ్" అడిగాడు ఆత్రుతగా.

సహజంగా సమంత టీవీలో ఏదో ప్రోగ్రామ్ చూస్తూ ఉంటుంది. లేదా ఏదైనా పుస్తకం చదువుతూ కన్పిస్తుంది. అటువంటిది సోఫాలో మౌనంగా, దిగాలుగా కూర్చొని ఉండడం అతడిని కలిచి వేసింది. "ఏంట్రా, బావోలేదా?" ఆమె నుదురుపై చేయి వేసి అడిగాడు లాలనగా.

"బాగానే ఉంది శ్రీ...భోజనం వడ్డిస్తాను రండి" అంది.

"స్నానం చేసి తింటాను సమూ.." అని బ్యాగు సోఫాలో వదిలి బాత్‌రూంలో దూరాడు. స్నానం చేసి వచ్చిన తర్వాత సమంత మళ్ళీ భోజనానికి పిలిచింది.

"సమూ...నువ్వు చేసేయ్‌రా...నాకు కొంచెం పనుంది." అని ల్యాప్‌టాప్‌లోకి దూరాడు.

గంట తర్వాత బయటకు వచ్చిన శ్రీకర్‌కి సమంత అలాగే సోఫాలో కూర్చొని ఉండడం కనిపించింది. డైనింగ్ టేబుల్ దగ్గరకు వెళ్ళాడు. అన్ని డిషెస్ అలాగే ఉన్నాయి. "సమూ, భోం చేయలేదా?" అడిగాడు.

"చేయాలనిపించలేదు శ్రీ...నీకు వడ్డించనా?" అంది.

"నువ్వు చెయ్యవా?" అడిగాడు.

"వద్దు శ్రీ, ఆకలిగా లేదు" అంది.

"నాకూ లేదు. సాయంత్రం లైట్‌గా స్నాక్స్ తీసుకున్నాను" చెప్పాడు.

సమంత ఒక నిమిషం శ్రీకర్‌వైపు చూసి మళ్ళీ తల దించుకుంది.

"సమంతా, ఏమిటంత వర్రీగా ఉన్నావ్? ఎందుకు మూడాఫ్ అయ్యావు?" అడిగాడు ఆమె పక్కన కూర్చొని.

అతడి చేతిని తన చేతిలోకి చప్పున తీసుకొని "శ్రీ, అమ్మను చూడాలని ఉంది. రేపు వెళ్ళిరానా?" అడిగింది.

శ్రీకర్ కదిలిపోయాడు. తను అలా బేలగా మారడం శ్రీకర్ ముందెన్నడూ చూడలేదు. "వెళ్ళరా... ఆఫీసులో లీవు ప్రాబ్లమా?" అడిగాడు.

"అదేం లేదు...నువ్వూ వస్తావా?" అడిగింది.

"ప్రాజెక్టు పని కాస్త పెండింగ్‌లో ఉందిరా...అది అయిపోగానే తీసుకెళతాను. సరేనా?" అన్నాడు.

"ఈ మంత్ ఎండింగ్‌లో జోనల్ ఇంచార్జ్ మెల్కోటే వస్తున్నారు. నాకూ, కర్కరే సర్‌కి పర్మిషన్ తనే ఇవ్వాలి కదా? ఇద్దరం కలిసి రిక్వెస్ట్ చేయాల్సి వస్తుంది. ఈలోపు అమ్మని ఒకసారి చూసి వస్తాను. యుఎస్ వెళితే ఎప్పటికో కదా ఇక చూసేది.." చెప్పింది.

శ్రీకర్ ముఖం చప్పున ఆరిపోయింది.

ఇక సంభాషణ పెంచడం ఇష్టం లేక "నీ ఇష్టం... వర్క్ పెండింగ్ పెట్టి వస్తాలే" చెప్పి పైకి లేచాడు. నిస్సత్తువగా శ్రీకర్ తన గదిలోకి వెళ్తుంటే సమంత అలాగే చూస్తూ ఉండిపోయింది.

•••

శ్రీకర్ ఆఫీసుకు వచ్చాడే కానీ అన్యమనస్కంగానే గడిపాడు. వర్క్ మీద కాన్‌సన్‌ట్రేషన్ చేయలేకపోతున్నాడు. కాలం గడిచేకొద్దీ సమంత తనకు దూరమవుతుందన్న వేదన అతడిలో పెరిగిపోయింది. ఏం చేసి అడ్డుకట్ట వేయాలి?

ఏం చేసి ఆపాలో అతడికి అర్థం కావట్లేదు. రమణకు ఫోన్ చేశాడు. "సమంత సీరియస్‌గా ప్రిపేర్ అవుతోందిరా. మెల్కోటేగారిని ఆర్గనైజ్ చేయగలమా? కర్కరేకి అనుమతి ఇవ్వకుండా ఆపగలమా?" రమణ ఇచ్చిన సలహానే తిరిగి ప్రశ్న రూపంలో అడిగాడు.

"అదే కదా మొన్న అనుకున్నాం...ప్రయత్నిద్దాం" చెప్పాడు రమణ.

"ఈరోజు ఈవెనింగ్ నర్సాపూర్‌కి సమంత తన ఊరికి వెడుతోంది రమణా...తను అమ్మను చూడాలట. నన్నూ రమ్మంది. వర్క్ ఉంది, అయినా వస్తానని చెప్పాను" చెప్పాడు శ్రీకర్.

"నువ్వు ఇక్కడున్నా బుర్ర పని చేయదురా. వెళ్ళి ఆమె తల్లి ద్వారానో, మామయ్య ద్వారానో... తను వెళ్ళకుండా ప్రయత్నించు" అన్నాడు.

శ్రీకర్ మరేమీ ఆలోచించలేదు. సమంతతో ఊరికి వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు.

•••

"సర్, సమంతమ్మ ఊరికి వెళ్తున్నారట. బహుశా మీ విషయంలో క్లియరెన్స్ తీసుకోవడానికేమో" చెప్పాడు అన్వర్.

"అంతేనంటావా?" అడిగాడు కర్కరే.

"అంతే సార్..మీతో యుఎస్ రావడానికి సిద్ధమవుతోంది కదా? అందుకే ఒకసారి వాళ్ళ మమ్మీని చూసేందుకు వెళుతోందట.." తనకి తెలిసిన సమాచారం చెప్పాడు.

"అవును. వెంటనే రమ్మని చెప్పా. ఆఫీస్ వర్క్ పెండింగ్ ఉంది. పైగా జోనల్ ఛైర్మన్ విజిట్ ఉంది కదా? నాకూ వెళ్ళి సమంత మమ్మీ బ్లెస్సింగ్స్ తీసుకోవాలని ఉంది. సమంతను పువ్వుల్లో పెట్టి చూసుకుంటానని చెప్పాలని ఉంది" ఎక్కడో ఆలోచిస్తూ

**జరిగిన కథ**

*పెళ్ళి, తాళి వ్యవస్థపై సమంతకు నమ్మకం ఉండదు. శ్రీకర్ ఆమెను పెళ్ళిచేసుకోవాలనుకుంటాడు. ఆమె తిరస్కరిస్తుంది. కానీ ఇటు తల్లి ఆరోగ్యాన్నీ, అటు శ్రీకర్ ప్రేమనీ కాపాడుకునేందుకు పెళ్ళికి బదులు సహజీవనానికి అంగీకరిస్తుంది సమంత. కొంతకాలం తర్వాత ఒక బిడ్డను కని తన తండ్రి కోర్కె తీర్చమంటాడు శ్రీకర్. అందుకు తిరస్కరిస్తుంది. మరో వివాహం చేసుకుని శ్రీకర్ వంశాభివృద్ధి చేసుకోవాలనే కాంక్షతో అమెరికా వెళ్ళిపోవాలనుకుంటుంది సమంత. ఆమెను ఇష్టపడుతున్న కంపెనీ బాస్‌తో సహజీవనం చేయాలనే నిర్ణయానికి కూడా వస్తుంది. ఈ పరిస్థితుల్లో సమంతకు బుద్ధిచెప్పేందుకు సంసిద్ధమవుతారు ఆమె తల్లి, బంధువులు.*

**ఆ తర్వాత....**

చెప్పాడు కర్కరే.

"నీకు అంత సీనుందా.." మనసులో అన్వర్ గొణుక్కోవడం గుర్తించాడు కర్కరే.

"ఏంట్రా ఏదో గొణుగుతున్నావ్...వినబడట్లేదు" అడిగాడు కర్కరే.

"అదే సార్...మీరు పెద్ద ప్లానర్. స్కెచ్ వేస్తే సూపర్ సార్...నా హౌస్ లోను.." నసిగాడు.

"చెప్పాను కదా. పేపర్స్ రెడీ చేయమని.." అన్నాడు ఫోన్ రిసీవర్ చేతుల్లోకి తీసుకుంటూ.

"వాళ్ళు చేతులు తడపందే బిల్లు పెట్టేలా లేరు సార్..." అన్నాడు అన్వర్.

**ప్రపంచంలో అత్యంత విషపూరితమైన 15 రకాల పాముల్లో పదిరకాలు ఆస్ట్రేలియాలోనే ఉన్నాయి.**



"తడపరా...మంచినీళ్ళకు ఖర్చేముంది?" అన్నాడు ఎక్కడో ఆలోచిస్తూ కర్కరే.

"ఇంత బుర్రతక్కువ వెధవతో వెళ్ళి ఆ సమంతమ్మ ఏం బావుకుంటుందో..." మళ్ళీ గొణుక్కున్నాడు అన్వర్.

కర్కరేకి సందేహం వచ్చింది. "ఒక్కత్తే వెళ్తోందా? శ్రీకర్‌గాణ్ణి తీసుకెళ్తోందా?" అన్నాడు కర్కరే

"అడిగి వస్తా సర్.." అని బైటకు రాబోతుంటే...

"ఒరేయ్ నేరుగా అడగకురా...బ్రెయిన్‌లెస్ ఫెలో..." అన్నాడు కర్కరే.

"నీకంటే కాదులేరా..." మనసులో అనుకుంటూ పైకే అనేశాడు అన్వర్.

"ఏంట్రా గొణుగుతావ్?" మళ్ళీ అడిగాడు కర్కరే.

"అదే...సార్...మీలాంటి మేధస్సు మాకెక్కణ్ణించి వస్తుంది సార్? సమీరమ్మ ద్వారా కనుక్కొని వస్తాను సర్.." చెప్పాడు అన్వర్.

"గుడ్ బాయ్..." అంటూ కంప్యూటర్ మానిటర్‌లో కనిపిస్తున్న సమంత ఫోటోని మోహావేశంతో చూశాడు కర్కరే.

●●●

సమంత వస్తున్నట్టు సమాచారం విని అప్పటికే అక్కడ ఉన్న సునంద తోబుట్టువులు కొంత ఆనందం మరికొంత ఆందోళన పడ్డారు.

"ఇంత సడెన్‌గా ఎందుకొస్తోంది?" తనలో తాను అనుకుంటూ పైకే అనేశాడు రాజారావు.

కూతుర్ని చూస్తే తన అక్క సునంద ఎలా రియాక్ట్ అవుతుందో అన్న ఆందోళన అతడిలో పెరిగింది.

"రానివ్వు, దాన్ని నిలదీద్దాం" అంది సులోచన.

"బ్రెయిన్ వాష్ చేద్దాం" అంది సువర్చల.

"ఇలా మాట్లాడిన వాళ్ళు చాలామంది దాని ముందు నోరు కూడా మెదపరు. ఇక ప్రయత్నాలు చాలించి ముందు మౌనంగా ఉండండి. దాన్ని హర్ట్ చేయకండి" అన్నాడు రాజారావు.

"అవునే...దాన్నేమీ అనకండి" అంది సునంద.

"ఏంటే తల్లీ, నీ బిడ్డను బాగా చదివించుకున్నావు. ప్రయోజకురాల్ని చేసుకున్నావు. మాక్కూడా కాస్త అదరువుగా ఉన్నావని సంతోషపడ్డాం. ఇదంతా ఏంటి? దాని జీవితాన్ని ఇలా నాశనం చేసుకోవడమేంటి?" శోకాలు పెట్టింది సులోచన.

అక్కని ఓదారుస్తూ..."జరగాల్సిందాన్ని ఎవరూ ఆపలేరు కదక్కా" అన్నాడు రాజారావు.

"తమ్ముడూ...దానికి ఇష్టం కదా, ఏటి రొయ్యలు తీసుకురారా, ఆవగించి పెడతాను." అంది సునంద.

"నాలుగు అడక్క మర్యాదలు చేస్తూ కూర్చుంటావటే...దద్దోజనమా.." అంది సులోచన.

సునంద మౌనంగా చూసింది.

"శ్రీకర్ కూడా వస్తున్నాడక్కా" చెప్పాడు రాజారావు.

"అవునా?" అడిగింది సులోచన.

"పాపం...ఆ అబ్బాయి..." జాలి చూపింది సువర్చల.

"మా ఆయన ప్రాణాలు దాని డబ్బుతో నిలిపిందన్న కృతజ్ఞత లేకుంటే గడ్డిపారతో దాన్ని పొడిచి జైలుకు వెళ్ళుండే దాన్ని" కోపంగా అంది సువర్చల.

"అయినా, ఆ పిల్లవాడికి సిగ్గులేదూ? తనని వదిలిపెట్టి వెళ్ళే ఆడదాని కోసం ఇంత వెంపర్లాడడమేంటి?" ఈసడింపుతో అంది సులోచన.

"చదువక్కా...చదువు...నాగరికత...వెర్రి వేషాలు వేయిస్తోందేమో..." కోపంగా అంది సువర్చల.

**బంగారం లాంటి సంసారం పాడుజేసుకుని ఎవడో వయసుమళ్ళినవాణ్ణి అంటకాగి వాడితో ఆమెరికా వెళ్ళడానికి సిద్ధపడతావా? బట్టలు మార్చినట్టు మొగుళ్ళని మారుస్తావా? ఒక మంచి భర్తను వదులుకుని ఇలాంటి పనులకు దిగుతావా? అతనికో బిడ్డను కనివ్వడానికి నీకేం అభ్యంతరం? అంటూ సమంతను చుట్టుముట్టి నిలదీశారు ఆమె బంధువులు. అప్పుడామె ఏం సమాధానం చెప్పింది?**

"అక్కా, ఇక మీరు దాని గురించి చర్చించుకోవడం ఆపి ఏదైనా సీరియల్సు చూసుకోండి" అన్నాడు కాస్త కోపంగా రాజారావు.

"ఏం చూస్తాం నాయనా? అవి కూడా అలాగే ఏడుస్తున్నాయ్" అంది సులోచన.

"మీరు మారరు.." అనుకుంటూ బైక్ స్టార్ట్ చేశాడు రాజారావు.

●●●

స్టేషన్‌కి వెళ్ళి సమంత, శ్రీకర్‌లను సాదరంగా ఇంటికి తీసుకువచ్చాడు రాజారావు.

"నీకెందుకు మావయ్యా శ్రమ...వచ్చేసేవాళ్ళం కదా" అంది నొచ్చుకుంటూ సమంత.

"నమస్తే అండీ" చెప్పాడు శ్రీకర్.

"నమస్తే బాబూ..." చెప్పాడు రాజారావు.

సమంత వింతగా చూసింది. "ఆయన మా మావయ్య. పరాయి వ్యక్తిలా విష్ చేయడమేంటి?" అంది నవ్వుతూ సమంత.

"నేను ఇక పరాయివాణ్ణే కదా..." లోగొంతుకతో అన్నాడు శ్రీకర్.

అదోలా చూసింది సమంత. స్టేషన్‌కి తెచ్చిన అంబాసిడర్ కారులో ముందు కూర్చున్నాడు రాజారావు. వెనక శ్రీకర్, సమంత కూర్చున్నారు. కారు గ్రామంలోకి ఎంటరైంది.

"బ్యూటిఫుల్ క్లైమేట్" పంటచేలు, కొంగలను చూస్తూ అన్నాడు శ్రీకర్.

సమంత అతడిని సంభ్రమంగా చూస్తూ "అదిగో...ఆ చెరువులో చిన్నప్పుడు ఈతకు వెళ్ళాం. ఆడపిల్లకు నీకు ఈత ఎందుకే అని మామయ్య అప్పుడు కొట్టాడు" అంది బుంగమూతి పెడుతూ.

రాజారావు నవ్వేశాడు. "అవి బంగారు రోజులు కదరా" అన్నాడు రాజారావు.

"బాల్యంలోనే ఆగిపోయి ఉంటే బావుండేది మామయ్యా.. కాలం తెచ్చిన మార్పులతోనే కొత్త చిక్కులు" అంది శ్రీకర్‌ని చూస్తూ.

"కాలమంటే వసంతం ఉంటుందీ...గ్రీష్మమూ ఉంటుంది" అన్నాడు కాస్త భావుకంగా శ్రీకర్.

"అబ్బో! మా పల్లె గాలి తగిలేసరికి మీకు కవిత్వమొస్తుందే" అంది సమంత.

"నిజమే" ఒప్పుకున్నాడు శ్రీకర్.

"అదిగో అది మా సమంత చదువుకున్న హైస్కూల్" చెప్పాడు రాజారావు కాస్త దూరంగా కన్పించే స్కూల్‌ని చూపించి. "ఒక నిమిషం ఆగుదామండీ" అన్నాడు శ్రీకర్.

రాజారావు కారు ఆపాడు.

"సమూ...రా...మీ క్లాస్‌రూం చూపించు" అన్నాడు.

సమంత కారు దిగి వచ్చి..."ఇదే మా క్లాస్‌రూం" చెప్పింది.

అప్పటికే స్కూలుకు వచ్చిన స్వీపర్ గదులు శుభ్రం చేస్తోంది. సమంతను గుర్తు పట్టింది. ఆమె పేరు వనజమ్మ. "సమంతమ్మా బావున్నావా తల్లీ" అడిగింది ఆప్యాయంగా.

"బావున్నా వనజమ్మా. నీ కూతురూ, కొడుకూ ఎలా ఉన్నారు?" అడిగింది.

"బావున్నారమ్మా" చెప్పిందామె.

పక్క నిమిషం శ్రీకర్ జేబులో చేయి పెట్టి రెండు ఐదువందల రూపాయల నోట్లు తీసి వనజమ్మ చేతిలో పెట్టింది.

ఆమె పొంగిపోయింది. "నువ్వు చల్లగా ఉండమ్మా. బిడ్డా పాపలతో కళకళలాడు తల్లీ" అంది.

సమంత చప్పున శ్రీకర్ వైపు నవ్వుతూ చూస్తూ.... "నీ పిల్లల పిచ్చి...ఈమెక్కూడా ఉన్నట్టుంది. ఇక్కడే ఉంటే బారసాలకి ఏర్పాట్లు చేస్తుంది" అంది నవ్వుతూ.

శ్రీకర్ శ్రుతి కలిపాడు.

సమంత వెంట శ్రీకర్ నడిచాడు.

వనజమ్మ సమంతని "ఒక్క నిమిషమమ్మా" అని పిలిచింది.

సమంత ఆగింది. శ్రీకర్ కాస్త ముందుకు కదిలాడు.

వనజమ్మ సమంత దగ్గరకు వచ్చి "మీ అమ్మ పూజలు ఫలించాయి తల్లీ. నీకు మంచి ఉద్యోగం, మంచి మొగుడూ దొరికాడు. అబ్బాయి చక్కగా ఉన్నాడు" చెప్పింది.

వనజమ్మను నిరాశ పరచడం ఇష్టం లేక సమంత నవ్వి ఊరుకుంది. రాజారావు కారులోనే కూర్చుని ఎవరితోనో ఫోన్లో మాట్లాడుతున్నాడు.

"ఏంటి ఆమె చెబుతోంది" అడిగాడు శ్రీకర్.

"అబ్బాయి చక్కగా ఉన్నాడు. ఇంటికెళ్ళి దిష్టి తీయమని చెప్పింది. అవన్నీ నమ్ముతారా మీరు?" అంది నవ్వుతూ.

"ఇంత చక్కగా ఉండే అబ్బాయిని నువ్వు వదులుకుంటున్నావని ఆ పిచ్చి తల్లికి తెలీదు కదా" అన్నాడు.

"సరే...సరే ముందుకు కదలండి. మా మావయ్యకి వేరే పనులేమైనా ఉంటాయ్" అంది టాపిక్ డైవర్ట్ చేస్తూ.

ఇంటికి వెళ్ళేసరికి తన కోసం ఎదురు చూస్తున్న పెద్దమ్మా, చిన్నమ్మలు కనిపించారు. "ఏం పెద్దమ్మా..ఏం పిన్నీ బావున్నారా?" అడిగింది.

"బావున్నామమ్మా..." జీవం లేని నవ్వుతో చెప్పారిద్దరూ.

"ప్రయాణం ఎలా జరిగిందే" అడిగింది సునంద.

"ప్రయాణం చేసినట్టే లేదమ్మా. నేఒక్కదాన్నే వచ్చేప్పుడు స్టేషన్ దాటి పోతానేమోనని సరిగ్గా నిద్రపోయేదాన్ని కాదు. ఇప్పుడు శ్రీకర్ ఉన్నాడు కదా. నిశ్చింతగా నిద్రపోయాను" చెప్పింది సమంత శ్రీకర్‌ని చూస్తూ.

"రాజా, అబ్బాయిని పై గదిలోకి తీసుకెళ్ళరా" చెప్పింది.

సమంత ఎప్పుడన్నా వస్తే ప్రైవసీగా ఉండేందుకు మిద్దెపైన ఓ గది వేయించి పెట్టింది సునంద.

"పైకి వెళ్ళి ఫ్రెషప్ అవండి. నేను కాసేపు మా అమ్మ...పిన్నిలతో కబుర్లు చెప్పుకుని వస్తా" అంది సమంత.

"నువ్వూ ఫ్రెషప్ కావే...టిఫిన్ రెడీ చేస్తా" చెప్పింది సునంద.

"ఒకే అమ్మా" చెప్పింది వంటగది పక్కగా ఉన్న మరో గదిలోకి వెడుతూ.

శ్రీకర్‌ని మిద్దెపై ఉన్న గదిలోకి తీసుకెళ్ళాడు రాజారావు. గది సమంత టేస్టుకు తగ్గట్టే ఉంది.

●●●

మధ్యాహ్నం భోజనాలు పూర్తయిన తర్వాత పెరట్లో కూర్చున్నారు అందరూ. రాజారావు శ్రీకర్‌ని తీసుకొని బైటికి వెళ్ళాడు.

"ఒక్కరే ఉండి ఏం చేస్తారు? బోర్ కదా...నాతో రండి ఇంటికెళ్దాం..?" అని చెప్పి తీసుకెళ్ళాడు.

సమంత కూడా "పోయి రండి. మావయ్య ఇంటిని కూడా చూసినట్టు ఉంటుంది కదా" అంది.

శ్రీకర్ మరో మాట మాట్లాడలేదు. "సరే" అన్నాడు.

"అబ్బాయి మంచి బుద్ధిమంతుడిలా ఉన్నాడు" ప్రశంసగా అనుకుంది సులోచన.

చిన్నగా సంభాషణలోకి దిగింది సమంత. క్షేమసమాచారాలు అడగడం మొదలెట్టింది. "కేశవ ఎలా ఉన్నాడు పెద్దమ్మా?" అడిగింది.

"బావున్నాడురా...ఎప్పుడూ నిన్నే తలుచుకుంటూ ఉంటాడు" చెప్పింది సులోచన.

"మరే... నువ్వు ఫీజు కట్టబట్టే కదా వాడు పీజీ చేస్తున్నాడు" కృతజ్ఞతగా అంది సువర్చల.

"నా తమ్ముడికి ఫీజు కట్టడం సాయమవుతుందా?" అంది నవ్వుతూ సమంత.

"నీది బంగారం మనసే. అచ్చు మాచెల్లెలు లాంటిది" అంది సులోచన మురిపెంగా.

"పిన్నీ, బాబాయ్ ఆరోగ్యం ఎలా ఉంది? యోగా వంటివి చేస్తున్నారా?" అడిగింది.

"చేస్తున్నాడమ్మా. మరోసారి హార్ట్‌ఎటాక్ వస్తే బ్రతుకుతానో లేదోనని భయపడి ఇప్పుడు చాలా జాగ్రత్తగా ఉంటున్నాడు. అంతకు ముందు అడపాతడపా మద్యం ముట్టేవాడు. ఇప్పుడు పూర్తిగా మానేశాడు. నిన్ను చూసేందుకు వస్తానని చెప్పాడు. బహుశా బయలుదేరి ఉంటాడు" చెప్పింది సువర్చల.

"ఆ అబ్బాయి నిన్ను తలుచుకోని రోజు ఉండదే" అంది మరిది గురించి వకాల్తా పుచ్చుకొని.

"అవును. దీని సాయం లేకపోతే ఇప్పటికే మొగుడు లేని దాన్ని...నా బిడ్డలు తండ్రి లేని వాళ్ళయ్యేవాళ్ళు." అంది సువర్చల మంగళ సూత్రాన్ని పైకి తీసి కళ్ళకు అద్దుకుంటూ.

ఆ సంభాషణ కాస్త ఇబ్బందనిపించింది సమంతకు.

"ఇలా కృతజ్ఞత చూపి...నాకు మిమ్మల్ని దూరం చేస్తున్నారు" అంది సమంత.

"అదేం మాటే తల్లీ...నీ వయసులో ఉన్నప్పుడు నీ బుద్ధి మాకు ఉండి ఉంటే మా చెల్లెలికి ఇన్ని కష్టాలు...నువ్విలాంటి నిర్ణయాలు తీసుకుని ఉండే దానివి కాదు." చిన్నగా విషయంలోకి దిగింది సులోచన.

"అవునక్కా.....నిజమే...బావ వల్ల ఇది ఇన్ని కష్టాలు పడుతుంటే...మనం పట్టీపట్టనట్లు ఉండిపోయాం. నాన్న సాయం చేయడాన్ని కూడా వ్యతిరేకించాం. అందుకే సునందక్కకు ఇన్ని కష్టాలు" అంది సువర్చల.

"పోనీలేవే. బిడ్డని రత్నంగా మార్చుకుంది. పెద్ద చదువు చదివించుకుంది." అంది సులోచన.

సునంద ఏమీ మాట్లాడలేదు. నిర్లిప్తంగా వింటూ ఉండిపోయింది.

సమంత అమ్మ ఒడిలో తల పెట్టుకొని పడుకుని పెద్దమ్మ, పిన్ని వైపు చూస్తోంది.

## దేన్నీ వదలడం లేదు

'అంతం' తేడా కొట్టినా రష్మీకి మాత్రం అవకాశాలు వెల్లువెత్తుతున్నాయట! పెద్ద సినిమాలేవీ రాకపోయినా వచ్చిన చిన్న సినిమాలను దేన్నీ రష్మీ వదలడం లేదట! కథ, కాస్టింగ్ వంటివి పెద్దగా పట్టించుకోకుండా కేవలం రెమ్యునరేషన్‌ని చూసి ఓకే చెబుతుండడం చూసి సినీ జనాలు ఆశ్చర్యపోతున్నారు. 'దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాల'న్న నానుడిని రష్మీ తూచా తప్పకుండా పాటిస్తోందనీ అంటున్నారు. ప్రస్తుతానికి రష్మీ అనుసరిస్తున్న వైఖరి సమంజసమే అయినా దీర్ఘకాలంలో ఆమె కెరీర్ దెబ్బతినే అవకాశం ఉందనీ ఆమె అభిమానులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. అన్ని సినిమాలు మనీ కోసం కాకుండా మ్యాటర్ ఉన్న సినిమాలు కూడా చేయాలని వారు సూచిస్తున్నారు.



"అవునే...ఆ అబ్బాయి చాలా మంచివాడిలా ఉన్నాడు. అతన్ని వదిలి అమెరికా వెళ్తున్నావట..ఇదేం రోగమే.." నేరుగా విషయంలోకి వచ్చేసింది సులోచన.

ఈ డిస్కషన్ వస్తుందని ముందే ఊహించింది సమంత. మానసికంగా సిద్ధంగానే ఉంది.

మాట్లాడవద్దన్నట్టు సైగ చేసింది సునంద.

"మాట్లాడనివ్వక్కా. దాని జీవితం ఇలా అయిపోతుంటే మనం మౌనంగా ఎలా ఉండగలం" అంది సువర్చల .

సమంత తల్లి ఒడిలోంచి లేచి... "పెద్దమ్మా, శ్రీకర్ మంచివాడు కాబట్టే యుఎస్ వెళ్తున్నాను. నేను ఇక్కడే ఉంటే అతడు ఇంకో అమ్మాయిని జీవితంలోకి ఆహ్వానించడు. కాలం అలాగే గడిచిపోతుంది. నేను మారను. అతడి తండ్రి కోరిక నెరవేరదు. వాళ్ళ వంశం నిలవదు. మనవల్ల అతడికెందుకు ఇబ్బంది?" అంది సమంత.

"అదేం పిచ్చి వాదనే. పిల్లల్ని కనడానికి నీకున్న అభ్యంతరం ఏమిటి?" అడిగింది సువర్చల,

"పిల్లల మీద కాదు. పెళ్ళి మీదనే నాకు వ్యతిరేకత. దాని అవసరం లేదని...ఒంటరిగా బ్రతకదలిచా. అమ్మని సంతోషపరచడం కోసమే శ్రీకర్‌తో కలిసి బ్రతుకుతున్నా. నేను అతణ్ణి పెళ్ళి చేసుకున్నానని, అతడికి విధిగా బిడ్డల్ని కనడం నా బాధ్యతని మీరు ఫీల్ అవుతున్నారు. మాది అగ్రిమెంట్ జీవితం! ఎవరూ ఎవరికీ జవాబుదారీ కాదు. ఎవరి ఇష్టం వచ్చినట్టు వాళ్ళు జీవించవచ్చు. విడిపోనూ వచ్చు. ఇప్పుడు విడిపోవాలనుకునేది స్వార్థంతోనో... అతడిపై ద్వేషంతోనో కాదు. మానవ సంబంధాలు బలహీన పడుతున్న ఈ రోజుల్లో శ్రీకర్ లాంటి వ్యక్తుల్ని నష్టపరచకూడదన్నది నా ఉద్దేశం" సమంత చెప్పింది. తల్లిక్కూడా అర్థం కావాలన్నదే ఆమె ఉద్దేశం.

"అతడిని వదిలి వెళ్ళేది వెళ్ళక...ఎవడో వయసు మళ్ళినవాడితో ఉంటానన్నావట. అదేంటే..." అడిగింది సువర్చల.

సమంతకు నవ్వు వచ్చింది. "అతడు వయసు మళ్ళినవాడు కాదు. వయసు కాస్త పైబడిన వాడు. మా ప్రాజెక్టు ఇన్‌చార్జి కర్కరేగారు. శ్రీకర్‌లాగే అతడూ మంచి వ్యక్తే" చెప్పింది.

వెగటుగా ముఖం పెట్టింది సువర్చల. "బట్టలు మార్చినంత సులువుగా మగాడిని మారుస్తున్నానని చెబుతున్నావు. నీకు ఏమీ అనిపించడం లేదా?" అడిగింది సువర్చల.



"నేను శారీరక అవసరాల కోసం అతడితో వెళ్ళడం లేదు పిన్నీ.." కటువుగా అంది సమంత.

"నిన్ను...నువ్వు తగలబెట్టుకుంటున్నావేమో అనిపిస్తోందిరా" అంది సులోచన బాధగా.

"మీరు పాత కాలంలో జీవిస్తున్నారు పెద్దమ్మా. ఇప్పుడు యువతలో ఆలోచనలు మారుతున్నాయి. మీ జనరేషన్‌లో లాగా సెంటిమెంట్స్ ఫీల్ కావడం లేదు. నేను మీ బిడ్డను కాబట్టే ఎలాంటి తప్పులు చేయడం లేదు" అంది.

"దీన్నేమంటారే" అడిగింది సువర్చల.

"కర్కరేగారికి నేనంటే అభిమానం ఉంది. నాకు అతడిపైన ఏ ఫీలింగ్సూ లేకపోవచ్చు. బట్ అతడి సపోర్ట్ నాకు అవసరం" అంది.

"ఏంటో పిదపకాలం" గొణిగింది సువర్చల.

"నువ్వేం మాట్లాడటం లేదు, ఏమిటక్కా" సునందను కదిపింది సువర్చల.

"మీరు మాట్లాడుతున్నారు కదా. నేను ప్రత్యేకంగా మాట్లాడేది ఏముంది? దాని జీవితం దాని ఇష్టం" అంది సునంద నిర్వికారంగా.

"అది చిన్నపిల్ల కదా! దానికేం తెలుసు" అంది ఆందోళనగా సువర్చల.

"అది చిన్నపిల్లే. కానీ అది నిప్పును పట్టుకోవడం లేదు. అదే నిప్పు" అంది సునంద సంభాషణకు తెర దించుతూ.

●●●

మరో గంటలో గ్రామం నుండి బయలుదేరుతుందనగా అమ్మని పొదివి పట్టుకుని ఏడ్చేసింది సమంత. కూతుర్ని దగ్గరకు తీసుకుంది సునంద. గద్గద స్వరంతో "జాగ్రత్తరా" అంది.

సులోచన, సువర్చల కళ్ళలో కూడా నీళ్ళు. సువర్చల భర్త వినాయకరావు కూడా వచ్చాడు.

"అది శుభమా అని యుఎస్ వెళ్తుంటే, ఎందుకురా ఏడుస్తున్నారు? మంచి ఆపర్చ్యునిటీ కదా!" అన్నాడు. అతడికి ఇతర విషయాలేవీ తెలీవు.

"అమ్మా, మీరూ వర్రీ కాకండి. నేను సంతోషంగా ఉంటాను. అది చాలు కదా" అంది పెద్దమ్మా, పిన్నిలను కూడా చూస్తూ.

శ్రీకర్‌కి ఆ దృశ్యాలన్నీ కాస్త ఇబ్బందికరంగానే ఉన్నాయి. ఏదో ఫోన్ వచ్చినట్టు బైటకి నడిచాడు.

రాజారావు వాతావరణాన్ని తేలిక చేస్తూ..." ఏరా ఈ మావయ్యను మర్చిపోవు కదూ. యుఎస్ వెళ్ళినా..అప్పుడప్పుడు ఫోన్ చేస్తూ ఉండు" చెప్పాడు రాజారావు.

"మన ఫ్యామిలీలో అమెరికా వెళ్ళే తొలి వ్యక్తి మన సమంతే" అన్నాడు గర్వంగా వినాయకరావు.

"సమూ...ట్రైన్ టైం అవుతోంది. బయలుదేరుదామా" అన్నాడు లోనికి వచ్చి శ్రీకర్.

అందరికీ నమస్కారాలు పెట్టాడు. శ్రీకర్‌ని చూసి అందరి హృదయాలు జాలితో నిండిపోయాయి.

"ఇంత మంచి కుర్రాణ్ణి వదులుకుంటోంది పిచ్చి ముఖంది" అనుకుంది సులోచన.

"వస్తాను" చెప్పి బయలుదేరుతుంటే...

"చిన్నీ...నీ తమ్ముడు కేశవక్కూడా అక్కడే ఏదో ఒక ఉద్యోగం చూడు. వాడూ నీకు అక్కడ సహాయకారిగా అందుబాటులో ఉంటాడు" అంది సులోచన.

"అక్కడ షుగర్ కంట్రోల్‌కి మంచి మందులు దొరుకుతాయేమో...చూసి పంపమ్మా.." అడిగాడు వినాయకరావు.

"ఆరోగ్యం జాగ్రత్తరా" మళ్ళీ చెప్పింది సునంద.

తల్లిని మరోసారి కౌగిలించుకుని బయలుదేరింది సమంత.

వినాయకరావు కూడా స్టేషన్‌కి వచ్చాడు.

"గుంటూరు నుండి హైద్రాబాద్ వెళ్ళే నర్సాపూర్ ఎక్స్‌ప్రెస్ మరో పది నిమిషాల్లో ప్లాట్‌ఫామ్‌కి వస్తుంది" అనౌన్స్‌మెంట్ వినిపించింది. మేనకోడల్ని చూస్తుంటే రాజారావు కళ్ళల్లో కూడా నీళ్ళు తిరిగాయి. ఈసారి ఎందుకో సమంతకు కూడా చాలా భారంగా అనిపించింది. ప్రాణాలు వదిలిపోతున్నానేమో అన్నంత ఫీలింగు కలిగింది. మావయ్య దగ్గరగా వచ్చి...

"అమ్మ జాగ్రత్త మావయ్యా. నా మీద దిగులుపడి ఆరోగ్యం చెడగొట్టుకుంటుందేమో....నేను బాగానే ఉంటానని చెప్పండి. తనని కన్విన్స్ చేయండి" అంది.

"నువ్వు యుఎస్ వెళ్ళడం... నేనే కన్విన్స్ కావడం లేదు. మీ అమ్మ ఎలా కన్విన్స్ అవుతుందిరా" అన్నాడు రాజారావు కన్నీళ్ళు తుడుచుకుంటూ.

వినాయకరావు శ్రీకర్‌తో ఏదో మాట్లాడుతున్నాడు కాస్త దూరంగా.

"తప్పదు మావయ్యా...శ్రీకర్ మంచివాడు..నా నిర్ణయాలతో...నా ఫీలింగ్స్‌తో అతడికి నష్టం చేయలేను." అంది మరోసారి దూరంగా ఉన్న శ్రీకర్‌ని చూస్తూ.

ఇవేవీ పట్టనట్టు శ్రీకర్ వినాయకరావుతో ఏదో మాట్లాడుతున్నాడు. ట్రైన్ వచ్చి స్టేషన్‌లో ఆగింది. ట్రైన్ కదులుతుంటే దాని వెంట పరిగెత్తుతూ రాజారావు వీడ్కోలు పలికాడు. వెనుక వినాయకరావు ఒగరుస్తున్నాడు.

"మావయ్యా, మీరు అగండి" చెప్పింది సమంత.

రాజారావు రెండు చేతుల్తో శ్రీకర్‌కి నమస్కారం పెట్టాడు. అతడెందుకు అలా చేశాడో వినాయకరావుకి అర్థం కాలేదు.

"అబ్బాయి చాలా మంచివాడు" చెప్పాడు వినాయకరావు.

"అవునవును." అన్నాడు రాజారావు. అన్యాపదేశంగా ట్రైన్ కనుమరుగయ్యే వరకూ స్టేషన్లో ఆగి బయలుదేరారు ఇద్దరూ. రాజారావు హృదయం భారంగా మారింది.

**(ఇంకావుంది)**






## ఐస్‌క్రీం మ్యూజియం

**చా**క్లెట్ థీమ్‌తో ఎన్నో సినిమాలు వచ్చాయి. మరి వెనీలా, చాక్లెట్, నట్స్, స్ట్రాబెర్రీ అంటూ రకరకాల ఫ్లేవర్లలో పెద్దవాళ్ళను సైతం చిన్నపిల్లలుగా మార్చే ఐస్ క్రీంల సంగతేంటి? ఆ సంగతి ఏమిటో తెలుసుకోవాలంటే అమెరికా వెళ్ళాల్సిందే! అక్కడి ఐస్‌క్రీం మ్యూజియం దర్శించాల్సిందే!

న్యూయార్క్‌కు చెందిన 24 ఏళ్ళ మేరీ ఎల్లిస్ బన్‌కు వచ్చిన ఆలోచనే ఇది. ఆమెకు ఐస్‌క్రీం అంటే ప్రాణం. చిన్నప్పట్నుంచి చల్లని ఐస్‌క్రీంల మధ్య సేదతీరాలని కలలు కనేది. ఇంతలో సర్వం చాక్లెట్‌మయమైన ప్రపంచం, జలపాతాలు, సరస్సులు కూడా చాక్లెట్లతో హాలీవుడ్‌లో ఓ సినిమా వచ్చింది. అది చూసిన మేరీకి అలాంటి ఓ ఐస్‌క్రీం ప్రపంచం వస్తే ఎంత బాగుంటుందనే ఆలోచన వచ్చింది. అనుకున్నదే తడవుగా ఆ ఆలోచన కార్యరూపంలో పెట్టింది. ఐస్‌క్రీం మ్యూజియం ఏర్పాటు చేసింది. ఈ మ్యూజియంలోకి వెళితే, ఎటు చూసినా ఐస్‌క్రీంలే కనిపిస్తాయి. వాటితో పాటు తినే గాలిబుడగలు కూడా ఉంటాయి. ఐస్‌క్రీం ఫౌంటెన్, ఐస్‌క్రీం బార్ లాంటి ఊయల, స్పూన్ ఆకారంలో ఉన్న సీసా లాంటి ఆటవస్తువులు చిన్నారులను ఎంతగానో ఆకట్టుకుంటున్నాయి. ఐస్‌క్రీంతో చేసిన శిల్పాలు, వెరైటీ ఐస్‌క్రీంల ఫోటోలు కూడా ఇందులో ఏర్పాటు చేశారు. ప్రస్తుతం న్యూయార్క్‌లో వేసవి కాలం కావడంతో ఈ చల్లని ప్రపంచంలోకి ప్రజలు భారీగా తరలి వస్తున్నారట.

## అద్దెకు ఆప్తులు దొరుకును




**పొ**ద్దున లేచిన దగ్గర నుంచి పడుకోబోయేవరకు ఎన్నో సమస్యలు, ఇబ్బందులే. స్నేహితులకో, కుటుంబ సభ్యులకో ఆ ఇబ్బందులు చెప్పుకుని సేదతీరుతారు కొందరు. కానీ ఈ బిజీ ప్రపంచంలో ఎదుటివారి సమస్యలు వినే ఓపిక, తీరిక ఎక్కడివి? అందుకే కష్టసుఖాలు వినడానికి ఆప్తుల్ని అద్దెకిచ్చే సేవలు ప్రారంభించింది ఓ సంస్థ. ఆశ్చర్యపోకండి! జపాన్‌లో ఇప్పటికే విద్యార్థులకు హోంవర్కు చేసిపెట్టడం, పెళ్ళిళ్ళకు, ఫంక్షన్లకు అతిథులుగా మనుషులను పంపించడం వంటి సేవలు కొన్ని సంస్థలు అందిస్తున్నాయి. అయితే మనిషి కష్టసుఖాలు, బాధలు పంచుకోవడానికి ఆప్తులు లేకపోవడంతో ఒత్తిడికి లోనవుతున్నారని భావించిన తకనోబు నిషిమొటో అనే ఓ వ్యక్తికి ఆప్తుల్ని అద్దెకివ్వాలనే ఆలోచన వచ్చిందట! ఈ ఆలోచనతోనే 'ఒస్సాన్' అనే వెబ్‌సైట్ రూపొందించాడు తకనోబు. ఇప్పటివరకు 45-55 మధ్య వయసున్న 60 మందిని ఎంపికచేసి ఆప్తులుగా నియమించాడు. వెబ్‌సైట్‌లో ఎలాంటివారు కావాలో ఎంచుకుని ప్రాంతం చెబితే చాలు. వాళ్ళే వచ్చి కస్టమర్లు చెప్పే మాటలు, సమస్యలు, ఇబ్బందులు, ఆలోచనలన్నీ ఓపిగ్గా వింటారు. 45 పైబడిన వారినే ఎందుకు పంపిస్తారంటే ఎదుటివాళ్ళ సమస్యలు అర్థం చేసుకోగల సామర్థ్యం, సలహాలిచ్చే నేర్పూ వారికి మాత్రమే ఉంటుందని అంటున్నాడు నిషిమొటో. భలే ఆలోచన కదూ!




## చుక్ చుక్ రైలు

**చు**క్ చుక్ రైలు వస్తోంది...దూరం దూరం జరగండి అంటూ పిల్లలు రైలాట ఆడుతుంటారు. కానీ ఈ రైలు వస్తోంటే దూరం జరగనవసరం లేదు. ఎందుకంటే ఆ రైలు అంత చిన్నది! ఆ రైలు నడిచే మార్గమూ అంతే! వివరమేంటో తెలుసుకుందామా!

కాలిఫోర్నియాలోని బంకర్ హిల్ ప్రాంతంలో హిల్ స్ట్రీట్ నుంచి లోయలో ఉన్న ఓలివ్ స్ట్రీట్‌కు వెళ్ళాలంటే ఓ బుల్లి రైలెక్కితే సరిపోతుంది. బుల్లి రైలంటున్నారు...ఎన్ని బోగీలుంటాయో అనుకుంటున్నారా! ఒకే ఒక్క బోగీ ఉంటుందీ రైల్లో. ఆ రైలు నడిచే మార్గం కూడా తక్కువేమీ కాదండోయ్! కొండపైకి కిందకీ 35 అడుగుల మార్గంలో ప్రయాణిస్తుంది. ఎంత దూరమో కదా!

'ఏంజెల్ ఫ్లైట్'గా పిలిచే ఈ మార్గాన్ని వందేళ్ళ క్రితం ఏర్పాటు చేశారు. ఈ రైలు మార్గం ఇప్పటివరకు నాలుగుసార్లు మూతపడింది. ప్రజల పోరాటంతో ఈ మార్గాన్ని పలుమార్లు తెరిచినా 2013లో మళ్ళీ మూసేశారు. ప్రస్తుతం ఈ రైల్వే మార్గాన్ని ఆధునీకరించి మరోసారి తెరిచేందుకు అధికారులు ఏర్పాట్లు చేస్తున్నారు.

## దిమ్మదిరిగే మజా!

**సెం**ట్రల్ చైనా, హెనాన్ రాష్ట్రం లోని లాజున్ పర్వత ప్రాంతమది. దాని ఎత్తు మూడు వేల అడుగులపైనే! అక్కడి నుంచి కిందికి చూస్తే గుండెలు జారిపోతాయి. నిటారుగా ఉండే ఈ పర్వతానికి వేలాడినట్లుగా ఓ ఆరడుగుల వెడల్పులో కాలినడక మార్గం ఉంది. అది కూడా కొండను తొలిచి, సిమెంటు పిల్లర్లు నిర్మించి ఏర్పాటు చేశారు! మామూలుగా కొంత ఎత్తుకు వెళ్ళి కిందికి చూస్తే కళ్ళు తిరుగుతాయి. అలాంటిది దాదాపు మూడు వేల అడుగుల ఎత్తులో కింద బలమైన ఆధారం లేకుండా, అడ్డంగా నిర్మించిన పిల్లర్ల ద్వారా వేలాడుతున్నట్లుగా నిర్మించిన ఈ నిర్మాణంపై గుడారాలు వేసుకొని నిద్రిస్తే ఎలా ఉంటుంది? చైనాలోని పర్యాటకులు ఇదే చేశారు. ప్రతి సంవత్సరం అక్కడకి వెళ్ళి విందు ఆరగించి నిద్రపోవడం వారికి ఆనవాయితీ అట. దాదాపు 6,562 అడుగుల పొడవు నిర్మించిన ఈ దారిపై దాదాపు పదివేల మంది నిద్రించారు. ఉదయాన్నే లేచి సూర్యోదయాన్ని వీక్షించారు.

**-నర్మద వాసిరెడ్డి**

# చల్లని తల్లి మన ఉల్లి



**ఉల్లి చేసే మేలు తల్లి కూడా చేయదు!**

**నిజంగా ఇది అక్షర లక్షలు విలువచేసే మాట.**

**పొట్టనిండా విటమిన్లు నింపుకున్న పాయ, మన ఉల్లిపాయ.**

**రక్తపుష్టి, కేశవృద్ధి, గుండె వ్యాధుల నివారిణి, కీళ్ళనొప్పుల నివారిణి, కీటక సంహారిణి, నిద్ర కారిణి, ఉష్ణ నివారిణి, నొప్పి నివారిణి, రక్త ప్రసరణ వాహినీ.. అబ్బో! ఇలా ఉల్లిదండకం చదివితే ఎంతకీ తెమల్దు.**

కొలెస్ట్రాల్ తగ్గించడమే కాదు జీర్ణక్రియను, షుగర్‌లెవెల్స్‌ను క్రమబద్ధీకరిస్తుంది ఉల్లి. బాక్టీరియా మన దరిజేరకుండా కాపాడుతుంది. ఉల్లిపాయ తినడం వల్ల మాత్రమేకాదు దానితో ఆరోగ్య సమస్యలెన్నింటినో దూరం చేసుకోవచ్చునంటున్నారు పరిశోధకులు.

దాదాపు ఐదువేలఏళ్ల నాటిది ఉల్లిపాయ చరిత్ర!

ఉల్లిపాయ ఆసియాలో పుట్టిందని కొందరంటే ప్రస్తుతం పాకిస్థాన్‌గా పిలుస్తున్న ప్రాంతంలో పుట్టిందని మరికొందరంటుంటారు. ఏదేమైనా ఆరోగ్యాన్ని చేకూర్చే ఉల్లి సర్వేసర్వత్రా లభ్యమవుతోంది. ఏ రూపంలో దీన్ని తిన్నాసరే వీటిలో ఉండే పదార్థాలు ఆరోగ్యాన్ని చేకూరుస్తాయి. అయితే ఎక్కువగా తినడం వల్ల నష్టమూ ఉంది. కాబట్టి శరీరానికి సరిపడ మితంగా ఉల్లిని తీసుకోవడం చాలా మంచిది. ఆ మంచేమిటో, ఆ లాభాలేంటో చదవండి!

### విటమిన్ల సముదాయం

యాంటీసెప్టిక్, యాంటీ బయాటిక్, యాంటీ మైక్రో బాక్టీరియల్ లక్షణాల నిలయం ఉల్లిపాయ. విటమిన్ సీ, బీ 12, బీ 6, విటమిన్ కె, బయోటిన్, క్రోమియం, కాల్షియం, ఫోలిక్ యాసిడ్, డైటరీ ఫైబర్ పుష్కలంగా ఉంటాయి. అందువల్ల రోజూవారి ఆహారంలో ఉల్లిపాయ తింటే మనకు ఎన్నో రకాల ప్రయోజనాలున్నాయి. తినడం వల్ల మాత్రమే కాదు, ఉల్లిని మనవెంట ఉంచుకుంటే చాలట! వైరస్, బాక్టీరియా వల్ల వచ్చే జబ్బులను మనదరిజేరనీయదట. టెస్టోస్టిరాన్, ఇన్సులిన్, గ్రోత్ హార్మోన్ వంటి హార్మోన్ల లక్షణాలు ఉల్లిలో ఉన్నాయి. అందుకే రక్తశుద్ధికీ, రక్తవృద్ధికీ ఉల్లి దోహదపడుతుంది.

### కొలెస్ట్రాల్ తగ్గుతుంది

శరీరంలోని కొలెస్ట్రాల్‌ను తగ్గించుకోవడానికి అనేక రకాల ప్రయత్నాలు చేసేకంటే, రోజూ పచ్చి ఉల్లిపాయ తింటే చాలు కొలెస్ట్రాల్ తగ్గించుకోవచ్చని ఆరోగ్య నిపుణులు సలహా ఇస్తున్నారు. ఉల్లిపాయలో క్రోమియం ఎక్కువ మోతాదులో ఉంటుంది. అది షుగర్ లెవల్స్‌ను క్రమబద్ధీకరించడమేకాదు టైప్-2 డయాబెటిస్‌ను నివారిస్తుంది. రోజూ పచ్చి ఉల్లిపాయ తింటే అధిక కొలెస్ట్రాల్‌ను అతి తక్కువ సమయంలోనే తగ్గించుకోవచ్చు. బ్లడ్ షుగర్ స్థాయిలనూ నియంత్రిస్తుంది. గ్లూకోజ్ శక్తిని పెంచుతుంది. అల్లిల్ ప్రోపిల్ డిసల్ఫాయిడ్ తగ్గిన బ్లడ్ షుగర్ స్థాయిలలో చాలా సహాయకారిగా కూడా ఉంటుంది.

### దగ్గు మాయం

ఉల్లిపాయను రెండు ముక్కలు చేసి ప్రతి పొరలోనూ ఒక టేబుల్‌స్పూన్ బ్రౌన్ షుగర్ అప్లయి చేయాలి. తర్వాత ఆ ముక్కల్ని పాయ రూపంలో దగ్గరకు నొక్కి ఒక జార్లో గంటసేపు ఉంచాలి. దాన్ని రోజుకు రెండుసార్లు వాసన చూస్తుంటే దగ్గు తగ్గుముఖం పడుతుంది. లేకపోతే ఉల్లిపాయ రసం, తేనె రెంటినీ సమ భాగాల్లో తీసుకుని బాగా గిలక్కొట్టి తాగితే గొంతు నొప్పి, దగ్గు తగ్గిపోతాయి. ఇతర ఇన్ఫెక్షన్లను కూడా ఇది నివారిస్తుంది.

### చెవినొప్పి నివారణ

చెవినొప్పి నివారణకు ఉల్లి బాగా పని చేస్తుంది. చెవులు గింగురుమంటున్నప్పుడు దూది మీద ఉల్లిరసం పిండి దాన్ని చెవిలో ఉంచుకుంటే నొప్పి తగ్గుతుంది లేదా ఉల్లి రసం వేడి చేసి చల్లార్చి చెవిలో వేస్తే చిన్నపిల్లలకు చెవి

## కీళ్లవాతానికి ఉల్లితో చెక్

తీసుకునే ఆహారంలో ఉల్లి అధికంగా ఉండేలా చూసుకుంటే కీళ్లవాతం ముప్పు నుంచి తప్పించుకోవచ్చని శాస్త్రజ్ఞులు ప్రకటించారు. ఆరోగ్యంగా ఉన్న వెయ్యిమంది కవలలపై లండన్‌లోని కింగ్స్ కళాశాల పరిశోధకుల అధ్వర్యంలో వారు తీసుకుంటున్న ఆహారాన్ని క్షుణ్ణంగా పరిశీలించారు. మిగిలిన వారితో పోలిస్తే ఆహారంతో పాటు ఉల్లి తీసుకున్న వారిలో కీళ్లవాతం ముప్పు లక్షణాలు తక్కువగా కనిపించినట్లు గుర్తించారు. ప్రస్తుత పరిస్థితుల్లో మధ్య వయసులో ఉన్న చాలా మంది కీళ్లవాతం బారిన పడుతున్నారు. మోకాళ్లు, వెన్నెముక, తుంటి భాగాల్లో నొప్పితో శారీరకంగానే కాదు, మానసికంగానూ సతమతమవుతున్నారు. ఇలాంటి మొండివ్యాధికి మెరుగైన చికిత్స అందుబాటులోకి తేవడానికి తాజా పరిశోధన ఫలితాలు ఉపయోగపడతాయని ఈ పరిశోధనకు నేతృత్వం వహించిన ఫ్రాన్సిస్ విలియమ్స్ తెలిపారు.



నొప్పి తగ్గిపోతుంది. ఉల్లిపాయ పేస్ట్‌ను నొప్పి ఉన్న ప్రదేశంలో పూసి, ఒక గుడ్డ చుట్టిఉంచడంవల్ల కూడా నొప్పి క్రమంగా నయమవుతుంది.

### గుండెకు మేలు

గుండె, రక్తనాళాలకు ఉల్లికాడలు ఎంతో మేలు చేస్తాయి. కొలెస్ట్రాల్ ఆక్సీకరణను తగ్గిస్తాయి. గుండె జబ్బుల ప్రమాదాన్ని తగ్గిస్తుంది. శరీరంలోని రక్తాన్ని పల్చగా చేసి కణాలన్నింటికీ ప్రసరణ చేసేందుకు ఉపయోగపడుతుంది. రక్తనాళాల్లో రక్తం గడ్డకట్టకుండా కాపాడుతుంది. రక్తనాళాల్లో రక్తం గడ్డకడితే గుండె లోపాలు లేదా కార్డియో వాస్కులార్ వ్యాధులకు దారి తీయవచ్చు. గుండె జబ్బులు, బీపీతో బాధపడే వారు రోజూ 100 గ్రాముల ఉల్లి తీసుకోవడం చాలా మంచిది. ఉల్లిపాయలోని సల్ఫర్ కాంపౌండ్ బ్లడ్ ప్రెజర్ స్థాయిని నియంత్రించి, బ్లడ్ కొలెస్ట్రాల్ లెవల్స్‌ను తగ్గిస్తుంది.

### జ్వర నివారిణి

జ్వరంగా ఉన్నప్పుడు ఉల్లిపాయ తింటే జ్వరం ఎక్కువవుతుందనే అపోహ చాలా మందిలో ఉంది. కానీ ఉల్లిపాయ హై బాడీ టెంపరేచర్‌ను తగ్గిస్తుంది. రెండు బాగాలుగా కట్‌చేసిన ఉల్లిపాయను గుజ్జుగా కానీ లేదా ఆ రెండుముక్కల్నిగానీ పాదాలకింద ఉంచుకోవాలి. సాక్సులు వేసుకుని రాత్రంతా అలాగే పడుకోవాలి. ఇలా చేస్తే జ్వరం త్వరగా తగ్గుతుంది. ఉల్లిపాయలు శరీరంలోని టాక్సిన్స్ జబ్బులను నివారిస్తుంది.

### వాంతులు తగ్గుతాయి

ఉల్లిపాయల్ని రుబ్బి దాంట్లోంచి రసాన్ని తీసుకోవాలి. ఇప్పుడు 'స్ట్రాంగ్ పుదీనా టీ' రెడీగా ఉంచుకోవాలి. ముందుగా రెండు చెంచాల ఉల్లి రసం తాగి, ఐదు నిమిషాల విరామం తర్వాత రెండు చెంచాల చల్లటి పుదీనా టీ తాగాలి. మరో ఐదు నిమిషాల తర్వాత మళ్ళీ ఇదే పద్ధతిలో ఉల్లిరసం, పుదీనా టీ రెండు చెంచాల చొప్పున విరామంతో సేవించాలి. ఇలా చేస్తే వాంతులు తగ్గిపోతాయి. అజీర్తి వల్ల వాంతులు, విరోచనాలు వస్తే అరకప్పు ఉల్లిపాయరసాన్ని గోరువెచ్చని నీటిలో కలిపి అప్పుడప్పుడు తాగితే వాంతులు, విరోచనాలు తగ్గుముఖం పడతాయి.





### రక్తస్రావాన్ని అరికట్టే ఉల్లి

ముక్కులోంచి రక్తం కారుతున్న వారు ఉల్లిపాయను కోసి ముక్కుదగ్గర పెట్టుకుని వాసన పీలిస్తే వెంటనే రక్తస్రావం ఆగిపోతుంది. పచ్చి ఉల్లిపాయను రోజువారీగా తీసుకుంటూ ఉంటే మహిళల్లో ఋతుక్రమం సక్రమంగా ఉంటుంది. ఏదైనా దెబ్బలు తగిలినప్పుడు కీటకాలు కుట్టినప్పుడు ఉల్లిపాయ రసాన్ని ఆ ప్రదేశంలో అప్లయి చేయాలి. ఇది రక్తస్రావాన్ని వెంటనే తగ్గిస్తుంది. గాయంచుట్టూ క్రిములు చేరకుండా కాపాడుతుంది. ఉల్లిపాయలు తినడంవల్ల రక్తపుష్టి కూడా కలుగుతుంది. ఉల్లిలోని ఐరన్‌ని మన శరీరం తేలికగా జీర్ణం చేసుకుంటుంది. కాబట్టి రక్తహీనతతో బాధపడే వాళ్లకు ఉల్లిపాయ చాలా మంచిది.

### పొట్టనొప్పి నివారణ

పిల్లల్లో పొట్టనొప్పి నివారించడానికి ఉల్లి మంచి దోహదకారి. అందుకు మనం చేయాల్సిందల్లా, కొంచెం నీళ్ళల్లో ఉల్లిపాయను వేసి ఉడికించాలి. ఆ ఉల్లినీటిని చల్లార్చి పిల్లలకు ఒక చెంచాడు తాగిస్తే తక్షణ రిలీఫ్ లభిస్తుంది. ఇలా గంటకొక్కసారి చెంచాడు ఉల్లినీరు తాగిస్తే నొప్పి నివారణవుతుంది. ఉల్లికాడలలో పెక్టిన్ (నీటిలో కరిగే కొల్లాయిడల్ కార్బోహైడ్రేట్) ముఖ్యంగా పెద్దపేగు కేన్సర్ అభివృద్ధి అవకాశాలను తగ్గిస్తుంది. ఉల్లిపాయలో స్థూలపోషకాలు ఉండడం వల్ల ఇది జీవక్రియ క్రమబద్ధీకరణకు మంచి ఆహారంగా ఉపయోగపడుతుంది. ఉల్లిపాయను నీళ్లలో వేడిచేసి ఆ నీటికి కొంచెం చక్కెర చేర్చి పిల్లలకు తాగిస్తే వారికి మంచి నిద్ర పడుతుంది.

### ఉల్లితో అందమైన జుట్టు

జుట్టు సంబంధిత సమస్యల ఉపశమనానికి ఉపయోగపడే మెరుగైన పదార్థాల్లో ఉల్లి ఒకటి. ఇందులోని పోషకాలు జుట్టును మరింత బలంగా మార్చి వాటి పెరుగుదలకు దోహదపడుతాయి. ముఖ్యంగా ఉల్లిలో ఉండే సల్ఫర్ మూలకం తల భాగంలో రక్తప్రసరణను మెరుగుపరుస్తుంది. తద్వారా తలలో మూసుకుపోయిన రంధ్రాలు తిరిగి తెరుచుకుంటాయి. ఇక ఉల్లిరసరం తలకు అప్లై చేయడం వల్ల జుట్టు బలంగా పెరుగుతుంది. జుట్టులో ఉన్న ఫంగస్‌ని ఉల్లి హరింపజేస్తుంది. చుండ్రును నివారించి తెల్లజుట్టును నల్లగా మారుస్తుంది. అలాగే జుట్టు ఊడిపోకుండా కాపాడుతుంది. ఇన్ని ప్రయోజనాలు కల్పించే ఈ ఉల్లిరసాన్ని వారంలో మూడుసార్లు తలకు పట్టిస్తే రెండునెలల్లో ఎన్నో ఫలితాలు పొందవచ్చు. ముందుగా ఉల్లిపాయలను చిన్న ముక్కలుగా కట్ చేసి వాటిని గ్రైండర్‌లో వేసి మెత్తగా రుబ్బుకోవాలి. అనంతరం ఈ ఉల్లి పేస్టును ఒక బుట్టలో తీసుకుని రసం పిండాలి. ఈ రసాన్ని తలకు పట్టించి ఐదు నిమిషాలపాటు మృదువుగా మసాజ్ చేయాలి, ఇలా చేసిన అనంతరం 45 నిమిషాల పాటు అలాగే ఉండాలి. ఇలా చేయడం వల్ల జుట్టు సమస్యలు త్వరగా తగ్గుతాయి. ఎందుకంటే ఉల్లిపాయ రసంలో క్యాటలైజ్ ఎంజైమ్‌లు పుష్కలంగా ఉంటాయి.

**- సంతోషి దహగాం**

## ఉల్లిని కోస్తే కంట నీరెందుకు?

ఉల్లిపాయలు తరుగుతున్నప్పుడు కళ్ల నుంచి నీళ్లు కారుతుంటాయనే విషయం తెలుసు కదా! ఇలా జరగడానికి హేతుబద్ధమైన కారణం ఉంది. మన కళ్లను మండించే ఒక పదార్థం ఉల్లిపాయలో ఉంటుంది. దీని పేరు ప్రొపిన్ సల్ఫినిన్. ఉల్లిపాయను కోయగానే ఈ పదార్థం గాలిలో కలిసి మన కళ్లకు తగులుతుంది. వెంటనే మన కళ్లు మండి కన్నీళ్లు ధారలా కారిపోతుంటాయి. ఎవరైనా చూస్తే మనం కన్నీరు పెట్టుకుని ఏడ్చినట్లు కన్పిస్తుంది. ఇలా కళ్ళ నుండి నీరు కారటం కూడా మంచిదేనని సైన్స్ చెబుతోంది. ఎందుకంటే సాధారణంగా గాలిలో ఉన్న ధూళికణాలు కళ్లలోకి చేరుతుంటాయి. మనం ఏడ్చినప్పుడు కారే నీళ్లతో పాటు ధూళికూడా బయటకు పోయి కళ్లు శుభ్రపడతాయి. అందుకే చాలా మంది కళ్ల నుంచి నీరు కారితే కళ్లకి మంచిదని చెప్తారు. ఇలా ఉల్లిపాయలు మన కళ్ళను కూడా శుభ్రపరిచేందుకు ఉపయోగపడుతున్నాయి కదూ!



# గౌరి

## నోబెల్ కథలు

-రవీంద్రనాథ్ ఠాగూర్



రవీంద్రనాథ్ ఠాగూర్ 7 మే 1861న కలకత్తాలో జన్మించారు. 1913వ సంవత్సరంలో సాహిత్యంలో నోబెల్ బహుమతి అందుకున్నారు. 80 ఏళ్ళ వయసులో 7 ఆగస్టు 1941న మరణించారు.

**చిన్న పట్టణంలో న్యాయవాదిగా పనిచేస్తున్న పరేష్‌కు ముందూవెనుకా ఎవరూ లేరు. అతనికి చిన్నతనంలోనే గౌరితో వివాహమైంది. సంపన్న కుటుంబంలో సుకుమారంగా పెరిగిన గౌరి చాలా నెమ్మదస్తురాలు. ఆత్మాభిమానం కలది. యుక్తవయసు రావడంతో ఆమెను కాపురానికి పంపక తప్పలేదు గౌరి తల్లిదండ్రులకు!**

స్వయంకృషితో ఇప్పుడిప్పుడే సమాజంలో తనకంటూ ఒక స్థానం సంపాదించుకుంటున్న పరేష్ ఆలోచనలు ఎప్పుడూ గౌరి చుట్టూనే తిరుగుతుండేవి. తన భార్యగా గౌరిని పరేష్ ఎప్పుడూ పూర్తిగా విశ్వసించలేదు. కొన్నిసార్లు అతను కోర్టు సమయం అయిపోకముందే ఇంటికి వచ్చేస్తుండేవాడు. పరేష్ అకస్మాత్తుగా ఎందుకు ఇంటికి వస్తున్నాడో గౌరికి అర్థమయ్యేది కాదు. పని వాళ్ళను కూడా ఎలాంటి కారణం లేకుండా తీసేస్తుండేవాడు. అతనింట్లో ఎక్కువ కాలం ఎవరూ పనిచేయలేకపోయేవారు. ఎవరైనా పనివాడు బాగా పని చేస్తున్నాడని, సహాయంగా ఉంటున్నాడని గౌరి అంటే చాలు అతన్ని వెంటనే పనిలోంచి తీసేసేవాడు. ఎంతో హుందాగా, గంభీరంగా ఉండే గౌరికి ఇలాంటి పనుల మూలంగా అభిమానం దెబ్బతిన్నట్టు అయ్యేది. అయితే ఆమె కోపానికి కానీ, అసంతృప్తికి కానీ ఏ మాత్రం ఫలితం ఉండేది కాదు. పరేష్ ఇంకా మొండితనంగా వ్యవహరించేవాడు.

రానురాను పరేష్‌లో గౌరిపట్ల ఉన్న అపనమ్మకం కాస్తా అనుమానంగా మారింది. పనమ్మాయిని గౌరి గురించి రహస్యంగా ఆరాలు అడగడం మొదలుపెట్టాడు. ఇదంతా గౌరి చెవిన పడింది. భరించలేకపోయింది. ఆమె అభిమానం దెబ్బతింది. తనలో తను కుమిలి పోయింది. ఫలితంగా భార్యాభర్తల మధ్య దూరం ఇంకా ఎక్కువయింది. తన ఉద్దేశం ఏమిటో గౌరి గ్రహించిందని అర్థం అయిన తర్వాత పరేష్ ఇంకా రెచ్చిపోయాడు. కప్పుకున్న ముసుగును తీసివేసి ఆమె మొహం మీదే దుర్భాషలాడడం మొదలు పెట్టాడు. అయినా ఆమె మౌనంగా సహిస్తూ వచ్చింది. ఆమె మౌనం అతడికి భరించలేనిదిగా తయారైంది. ఆమెపై కోపం, అనుమానం మరింత పెరగనారంభించాయి.

వైవాహిక జీవితంలో ఆనందం లోపించడంతో పిల్లలు లేని గౌరి ఓదార్పు కోసం భక్తిమార్గాన్ని ఆశ్రయించింది. ఆమె పరమానందస్వామిని తన ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించింది. తనకు భగవద్గీత బోధించవలసిందిగా గౌరి ఆయన్ని కోరింది. తన హృదయంలో పొంగి పొరలుతున్న స్త్రీ సహజ ప్రేమాభిమానాలన్నిటినీ ఆమె గురువు పాదాల చెంత గుమ్మరించింది.

పరమానందస్వామి పవిత్రతపై కానీ, నడవడికపై కానీ ఎవరికీ ఎలాంటి సందేహాలు లేవు. అందరూ ఆయనను ఆరాధిస్తారు. పరమానంద స్వామి గురించి ఎలాంటి మాట అనడానికి పరేష్‌కు అవకాశం లేకుండా పోయింది. గౌరి అతని శిష్యురాలిగా మారడం జీర్ణించుకోలేకపోయాడు పరేష్. అతని కోపం రోజురోజుకీ పెరిగి అతని హృదయంలో మానని పెద్ద పుండులా తయారయింది.

**1842 వరకు డైనోసార్ అనే పదమే తెలియదు. శిలాజ శాస్త్రజ్ఞుడు సర్ రిచర్డ్ ఓవెన్ భయంకర సరీసృపానికి డైనోసార్ అని నామకరణం చేశాడు.**



చివరకు పరమానందస్వామిపై దాచి పెట్టుకున్న అక్కసునంతా ఒకరోజు వెళ్ళగక్కాడు. అతను కపటి అని, దేవుడి పేరుతో వంచన చేస్తున్నాడని నిందించాడు. "కొంగజపం చేస్తున్న ఆ మోసగాడిని ప్రేమించడం లేదని నువ్వు ప్రమాణం చేయగలవా?" అని గౌరిని అడిగాడు.

గౌరి తోకతొక్కిన తాచులా లేచింది. ఆమె అభిమానం తీవ్రంగా గాయపడింది. ఆమె కూడా వెనక్కు తగ్గకుండా వ్యంగ్యంగా "ఒకవేళ ప్రేమిస్తే ఏం చేస్తారు?" అని అడిగింది. హతాశుడయ్యాడు పరేష్ ఆ ప్రశ్నకు. ఏం చేయాలో తెలియక ఆమెను ఇంట్లోపెట్టి, తాళం వేసి కోర్టుకి వెళ్ళిపోయాడు. జరిగిన పరిణామానికి తీవ్రంగా కలత పడింది గౌరి. ఆమె ఎలాగోలా ఇంటినుంచి బైటపడి పరమానంద ఆశ్రమానికి చేరుకుంది.

ఆ సమయంలో పరమానంద గదిలో ఒంటరిగా కూర్చుని మతగ్రంథాలు పఠిస్తున్నాడు. గౌరి ఉరమని పిడుగులా అకస్మాత్తుగా గురువు ముందు ప్రత్యక్షమయింది.

"నువ్వు.... ఇక్కడ....' గురువు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"నన్ను కాపాడండి స్వామీ. ఇంటిలోని ఈ అవమానాలన్నింటి నుంచీ నన్ను కాపాడండి. మీ పాదసేవ చేసుకుంటూ ఇక్కడే ఉండిపోతాను. మీ సేవకి నా జీవితం అంకితం చేయాలనుకుంటున్నాను. దానికి అనుమతించండి" గౌరి అడిగింది.

పరమానందస్వామి గౌరికి నచ్చచెప్పి ఇంటికి పంపించాడు. అయితే ఆ తర్వాత అతని పఠనం ఎప్పటిలా ముందుకు సాగలేదు.

పరేష్ ఇంటికి తిరిగివచ్చి తలుపులు తెరిచి ఉండడం గమనించి "ఇంటికి ఎవరొచ్చారు?" అని భార్యని అడిగాడు.

"ఎవరూ రాలేదు. నేనే మా గురువుగారి దగ్గరికి వెళ్ళి వచ్చాను" గౌరి చెప్పింది.

"ఎందుకు?" పరేష్ కోపంగా అడిగాడు.

"వెళ్ళాలనుకున్నాను కాబట్టి" గౌరి మొండిగా చెప్పింది.

ఆ రోజు నుంచీ పరేష్ ఇంటికి కాపలాదారుని పెట్టాడు. అతని ప్రవర్తన గురించి ఆ నోటా ఆ నోటా పట్నం అంతా పాకింది. అతడి అను



మానవు జబ్బు గురించి అందరూ విచిత్రంగా చెప్పుకోసాగారు.

తన శిష్యురాలికి జరుగుతున్న ఈ అవమానం గురించి, ఆమె పడుతున్న హింస గురించి పరమానందకు తెలుస్తూనే ఉంది. ఆయన ఆధ్యాత్మిక బోధనలకి, ధ్యానానికి కూడా అంతరాయం కలుగుతోంది. ఆయన ఆ ఊరిని విడిచిపెట్టి వెళ్ళిపోవాలని అనుకున్నాడు. అయితే తన శిష్యురాలిని ఆమె ఖర్మానికి ఆమెని వదిలిపెట్టి వెళ్ళడానికి ఆయనకు మనస్కరించలేదు. ఆమె రాత్రింబగళ్ళు ఈ వేదనని ఎలా భరిస్తోందో ఆయనకు అర్థం కాలేదు.

ఒకరోజు ఇంట్లో బందీగా ఉన్న గౌరికి ఒక లేఖ అందింది.

"అమ్మా,

ఎంతోమంది పవిత్ర స్త్రీలు దేవుడిసేవ కోసమని సంసార బంధనాల్ని త్యజించారు. ఈ ప్రాపంచిక జీవితంలోని ఘటనల వల్ల నీ మనసు దైవంపై లగ్నం కావడం లేదని గ్రహించాను. నిన్ను ఆ బంధనాల నుంచి తప్పించి దేవుడి పాదాల చెంతకు చేర్చడానికి సంకల్పించాను. నీవు సంసిద్ధంగా ఉంటే రేపు మధ్యాహ్నం రెండు గంటలకు మీ తోటలో నన్ను కలుసుకోగలవు".

గౌరి ఆ ఉత్తరాన్ని కొప్పులో దాచిపెట్టింది. మర్నాడు మధ్యాహ్నం స్నానానికి వెళ్ళబోతూ తల దువ్వుకోవడానికి జుట్టుముడి విప్పినప్పుడు ఆ ఉత్తరం లేకపోవడాన్ని గౌరి గమనించింది. అది మంచంమీద పడిపోయి భర్త చేతుల్లోకి ఏమన్నా వెళ్ళిందా? అన్న అనుమానం ఆమెను పీడించింది.

**అతడో న్యాయవాది. భార్యపట్ల అతడికి అపనమ్మకం. అదికాస్తా అనుమానంగా రూపుదాల్చింది.క్రమంగా పెరిగిపెద్దదై మహావృక్షంగా మారింది. ఆమెపై నిఘా పెట్టడం, ఆరాలు తీయడం, ఇంట్లో బంధించడం, ఆకస్మికంగా ఇంటికొచ్చి తనిఖీలు చేయడం.... ఇలా ఆ భర్త దిగజారిపోయాడు. మరి ఆ భార్య ఏం చేసింది? భర్తపై తిరగబడిందా? లేక తన పాతివ్రత్యాన్ని నిరూపించుకుందా?**

అయితే ఒక్కక్షణం పాటు భర్తకోపాన్ని తల్చుకుని ఆమె లోలోపల ఆనందించింది. అయితే తన విముక్తికి సంబంధించిన ఆ పవిత్రమైన ఉత్తరం ఏ అపవిత్రమైన హస్తాల్లో పడిందో అన్న ఆలోచన ఆమెను నిలవనివ్వలేదు.

ఆమె వేగంగా నడుచుకుంటూ తమ గదిలోకి వెళ్ళింది. అక్కడ పరేష్ నేలపై మూలుగుతూ పడి ఉన్నాడు. అతని కళ్ళు తేలవేసి ఉన్నాయి. నోటినుంచీ నురగవస్తోంది. బిగుసుకున్న అతని పిడికిలినుంచీ ఆమె ఉత్తరాన్ని తొలగించి డాక్టరు కోసం కబురు చేసింది.

డాక్టరు వచ్చి పరీక్షించాడు. మూర్ఛవ్యాధి వచ్చిందని చెప్పాడు. అతడు వచ్చేలోగానే పరేష్ మరణించాడు. అదేరోజు పరేష్ ఒక ముఖ్యమైన పని మీద బైటకు వెళ్ళాల్సి ఉంది. పరమానంద ఆ విషయం తెలుసుకునే మధ్యాహ్నం గౌరిని కలవడానికి నిర్ణయించాడు. గౌరికి అది అర్థమయింది. ఆయన ఎంత దిగజారిపోయాడు అనుకుంది గౌరి.

గౌరి కిటికీలోంచి బైటకు చూసింది. పరమానంద ఇంటి వెనుక ఉన్న తోటలో నిలబడి, ఇంటివైపు దొంగలాగా తొంగితొంగి చూస్తున్నాడు. ఆమెకు హఠాత్తుగా కళ్ళముందు మెరుపు మెరిసినట్టయింది. ఆ మెరుపులో ఆమెకు స్పష్టంగా పరమానంద ఎంతటి నీచానికి ఒడిగట్టాడో అర్థం అయింది.

"గౌరీ" పరమానంద పిలుస్తున్నాడు.

"వస్తున్నాను" గౌరి సమాధానమిచ్చింది.

పరేష్ స్నేహితులు అతని మరణవార్త విని చివరిచూపు కోసం ఇంటికి చేరుకున్నారు. అక్కడ వాళ్ళకు భర్త మృతదేహం పక్కనే చనిపోయి ఉన్న గౌరి కనబడింది. ఆమె విషం తాగింది. భర్తతోపాటు సతీసహగమనం చేయడంలో ఒక భార్యగా ఆమె చూపిన విశ్వాసం వాళ్ళని అబ్బురపరిచింది. మారిపోతున్న ఈ రోజుల్లో అలాంటి విశ్వాసాన్ని చూడగలగటం అరుదు.

అనువాదం: జి.లక్ష్మి e-mail: guttalakshmi62@gmail.com



# హద్దులు దాటిన కేజ్రీవాల్




- రాజశుక

**మోదీ, అమిత్ షాలు తనను చంపడానికి కుట్ర చేస్తున్నారంటూ అరవింద్ కేజ్రీవాల్ ఆరోపించడం సాధారణ విషయం కాదు.**

అరవింద్ కేజ్రీవాల్ నాయకత్వంలోని ఆమ్ ఆద్మీ పార్టీకి దేశ ఎన్నికల చరిత్రలోనే కనీ వినీ ఎరుగని మెజారిటీ లభించింది. మొత్తం 70 స్థానాల ఢిల్లీ శాసనసభలో ఆయన పార్టీకి 67 స్థానాలు లభించాయి. ఈ మెజారిటీ కేజ్రీవాల్‌లో ఆత్మవిశ్వాసాన్నీ, నిర్భయాన్నీ పెంచాల్సింది. కానీ, అది ఆయనలో సహజసిద్ధంగా ఉన్న అభద్రతనూ, ఆత్మన్యూనతనూ మరింతగా పెంచేసినట్టు కనిపిస్తోంది. తననీ, తన ప్రభుత్వాన్నీ ఎవరో ఏదో చేయబోతున్నట్టు ఆయనలో ఒక రకమైన భయాందోళనలు వ్యక్తమవుతున్నాయి. ముఖ్యంగా నరేంద్ర మోదీ, ఆయన మంత్రులు తన పార్టీనీ, ప్రభుత్వాన్నీ కబళించడానికి ఎత్తులు పైయెత్తులు వేస్తున్నట్టు ఆయన తరచూ పీడ కలలు కంటున్నారు. ఈ మధ్య ఆయన చేస్తున్న ప్రకటనలూ, వ్యాఖ్యలూ చూస్తుంటే, ఆయన మనస్తత్వంలో ఏదో మార్పు చేసుకుంటున్నట్టు అనుమానం కలుగుతోంది.

సుమారు తొమ్మిదిన్నర నిమిషాల యూట్యూబ్‌లో ఆయన ఇటీవల తన పార్టీ కార్యకర్తలను ఉద్దేశించి ప్రసంగిస్తూ, "మోదీ మనల్ని చూసి క్రమంగా నిస్సహాయ స్థితిలో కూరుకుపోతున్నట్టు విశ్వసనీయ వర్గాలు చెబుతున్నాయి. మన మీద ఆయన తీవ్ర ఆగ్రహంతో ఉన్నట్టు కూడా తెలుస్తోంది. మన విషయంలో ఆయన తార్కికంగా ఆలోచించలేకపోతున్నట్టు కనిపిస్తోంది. మన విషయంలో ఆయన అనాలోచిత నిర్ణయాలు తీసుకోవడం ఎక్కువైంది. ఈ వైఖరి దేశానికి ప్రమాదకరం. ఈ దేశం ఆయన చేతుల్లో సురక్షితంగా ఉంటుందా అనిపిస్తోంది. దీని గురించి ఆలోచిస్తుంటే నాకు నిద్ర కూడా పట్టడం లేదు" అని వ్యాఖ్యానించారు. ఇటీవలి కాలంలో ఆమ్ ఆద్మీ పార్టీ ఎమ్మెల్యేల మీదా, నాయకుల మీదా ఎక్కువ సంఖ్యలో కేసులు నమోదు కావడాన్ని దృష్టిలో పెట్టుకుని ఆయన ఈ వ్యాఖ్యలు చేసి ఉంటారు. ఆయన పార్టీకి చెందిన ఎమ్మెల్యేలలో పది మందిని వివిధ కారణాల మీద అరెస్టు చేశారు. మరో ఎమ్మెల్యే మీద ఆదాయ పన్ను శాఖాధికారులు దాడి చేశారు. మరో ఎంపీని పార్లమెంట్ నుంచి సస్పెండ్ చేశారు. మరో 21 మంది ఎమ్మెల్యేలు అనర్హత వేటు ఎదుర్కొనే అవకాశం ఉంది. కేజ్రీవాల్ వీటినన్నిటినీ కుట్రలు, కుతంత్రాలుగా కొట్టిపారేస్తున్నారు కానీ, ఆయన ప్రభుత్వంలోని న్యాయశాఖ మంత్రి జితేంద్ర సింగ్ తోమార్ ఓ నకిలీ డిగ్రీ కేసులో ఇరుక్కుని అరెస్టయ్యారనే సంగతి ఆయన మరచిపోతున్నారు. ఆ నకిలీ డిగ్రీ కేసులో ఆయన నిందితుడు కూడా.

వారికి ఏ రకమైన నష్టం జరిగినా, ఎటువంటి ఇబ్బంది ఎదురైనా అందుకు మోదీయే బాధ్యులన్నట్టుగా ఆయన, ఆయన పార్టీ నాయకులు విమర్శలు చేయడం చూస్తుంటే, ఆయన మోదీని చూసి అనవసరంగా, అతిగా జడుసుకుంటున్నట్టు కనిపిస్తోంది. నిజానికి ఆయనను చూసి మోదీ భయపడాల్సింది. "వాళ్లు(మోదీ, బీజేపీ అధ్యక్షుడు అమిత్ షా) మనల్ని చంపినా చంపొచ్చు. నన్ను కూడా చంపొచ్చు. వాళ్లేమైనా చేయగలరు. ఎందుకైనా మంచిది, మీ కుటుంబ సభ్యులతో ముందే చెప్పి ఉంచండి" అని కూడా ఆయన తన పార్టీ నాయకులు, ఎమ్మెల్యేలను హెచ్చరించారు. తనను చంపబోతున్నారంటూ ఓ రాజకీయ నాయకుడు గగ్గోలు పెడితే అంతకన్నా పెద్ద ప్రచారం మరొకటి ఉండదు. నిజానికి ఇటువంటి ఆరోపణ మీద మోదీ తక్షణం స్పందించాల్సి ఉంటుంది. ఒకవేళ మోదీ తనను చంపించబోతున్నారనే ఆరోపణలో ఆయనకే నమ్మకముంటే ఈ పాటికి పోలీస్ స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదు చేసేవారు. ఈ ఆరోపణను ఆయనే సీరియస్‌గా తీసుకోనట్టు కనిపిస్తోంది. ఒకవేళ ఆయన ఫిర్యాదులో ఆవగింజంతైనా నిజం లేదని తేలితే, ఆయన దేశ ప్రజలందరికీ క్షమాపణ చెప్పాల్సి ఉంటుంది. మోదీ ఈసారి "ఏదో అంటాడు పోతే పోనీలే" అని వదిలిపెట్టడం అంత శ్రేయస్కరంగా కనిపించడం లేదు. ఇది వరకు చేసిన విమర్శలు వేరు, ఇప్పుడు చేసిన ఆరోపణ వేరు. తనను చంపేందుకు ప్రయత్నిస్తున్నాడంటూ దేశ ప్రధాని మీద ఆరోపణలు చేయడం సాధారణ విషయం కాదు.

### తీవ్రస్థాయి ఆరోపణ

ఆయన ఇంతకు ముందు కూడా మోదీని



ఉన్మాది అనీ, పిరికివాడనీ వ్యాఖ్యానించారు. రక రకాల ఆరోపణలు చేశారు. కొన్ని రకాల విమర్శలు, ఆరోపణలు చేయడం రాజకీయ నాయకుల్లో సహ జమే కానీ, చంపడానికి ప్రయత్నిస్తున్నట్టు ఆరో పించడం మాత్రం చిన్న విషయం కాదు. తేలి కగా తీసిపారేయాల్సిన విషయమూ కాదు. అందు వల్ల మోదీ దీనిమీద స్పందించక తప్పదు. ఇక తన ఉప ముఖ్యమంత్రి మనీశ్ శిశోడియాను కూడా బీజేపీ ప్రభుత్వం ఏదో చేయబోతున్నట్టు ఆయన భయపడుతున్నారు. తనకు ధైర్యం ఎక్కు వని, వీటన్నిటికీ భయపడనని, తానేమీ పిరికి వాడిని కానని ఆయన తరచూ అనడం చూస్తుంటే, ఆయనకు ఈ లక్షణాలన్నీ ఉన్నాయనే అభిప్రాయం కలుగుతోంది.

ఓ ముఖ్యమంత్రిగా తనపై బరువు బాధ్య తలు ఎక్కువగా ఉన్నాయని, ప్రజలు తన నుంచి ఎన్నో ఆశిస్తున్నారని ఆయనకు బాగా తెలుసు. వీటినన్నిటినీ నిర్వర్తించగలనా లేనా అని ఆయన లోలోపల ఆందోళన చెందుతుండవచ్చు. మన సులో గూడుకట్టుకుని ఉన్న ఆ భయాలను ఆయన మరో విధంగా వ్యక్తం చేస్తుండవచ్చు. తన వైఫ ల్యాలను చూసి తనెవరైనా పదవి నుంచి తొల గించవచ్చనే అభిప్రాయం కూడా ఆయనలో పాతుకుపోయి ఉండొచ్చు. తన లోపాలను కప్పి పుచ్చి, వాటికి కారణాలను ఇతరులపైకి నెట్టే ప్రయత్నం చేస్తుండవచ్చు. మొత్తానికి తనెవరో లక్ష్యంగా చేసుకుంటున్నారన్న అభిప్రాయాన్ని ప్రజలకు కలగజేయడానికి ఆయన ప్రయత్నిస్తు న్నట్టు కనిపిస్తోంది. ఇవన్నీ కాకపోతే, ఏదో రాజ కీయ వ్యూహంతోనే మోదీ మీద అవాకులు చవా కులూ విసురుతుండవచ్చనుకోవాలి.

తనకంటే పైపదవుల్లో ఉన్నవారిని చూసినా, సంపన్నులను చూసినా కేజ్రీవాల్‌లో ఒక విధ మైన బెదురు, అభద్రత వ్యక్తమవుతుంటాయి. అయిదారేళ్ల క్రితం ఆయన అన్నా హజారేతో కలిసి అవినీతికి వ్యతిరేకంగా ఉద్యమం చేస్తున్నప్పుడు, సంపన్నుల మీదా, శక్తిమంతుల మీదా లేనిపోని విమర్శలు, ఆరోపణలు సంధిస్తుండేవారు. అప్పట్లో జనం ఆ విమర్శలు, ఆరోపణలను మెచ్చుకునే వారు. ఆ విమర్శలు, ఆరోపణలతో ఆయన జనాన్ని బాగా ఆకట్టుకునేవారు. ఇప్పుడాయన ప్రభుత్వంలో ఉన్నారు. ఇప్పుడలా విమర్శలు చేయగల స్థితిలో లేరు. పైగా ఆయన మీదా, ఆయన పార్టీ సభ్యుల మీదే విమర్శలు, ఆరోపణలు బాగా వెల్లువెత్తు తున్నాయి. తన ప్రశ్నలకు అంతా జవాబులు చెప్పాలని గానీ, తాను ఎవరికీ జవాబుదారీ కానని గానీ ఆయన భావించలేరు. అందుకనే ఆయన ఈ భూమి మీద తనంత నిజాయతీపరుడు లేడని చెప్పుకోవడానికి నానా ఇబ్బందులూ పడు తున్నారు. మొత్తానికి ఆయన తీవ్రస్థాయి మాన సిక ఒత్తిడిలో ఉన్నట్టు కనిపిస్తోంది.

### రాజకీయ వ్యూహమా?

కేజ్రీవాల్ ఓ వ్యూహం ప్రకారం వ్యవహరి స్తున్నట్టుంది. మోదీకి ఇప్పుడు మూడు వర్గాల శత్రువులున్నారు. అందులో ఒక వర్గానికి నితీశ్ కుమార్ సారథ్యం వహిస్తున్నారు. రెండో వర్గానికి సోనియా-రాహుల్ నాయకత్వంలోని కాంగ్రెస్ నాయకత్వం వహిస్తోంది. మూడో వర్గం కేజ్రీ వాల్ చేతుల్లో ఉంది. వచ్చే ఎన్నికల్లో బీజేపీ కనుక 180 స్థానాలు సంపాదించుకోలేని పక్షంలో ఏదో ఒక శత్రు వర్గం ముందుకు వచ్చే అవకాశం ఉంది. కేజ్రీవాల్ మాత్రం ఆ వర్గానికి నాయకత్వం వహించే అవకాశం లేదు. కారణం, ఆయనను కాంగ్రెస్ గానీ, మరే ఇతర పార్టీగానీ నమ్మే స్థితిలో లేదు. మిగిలిన ఏకైక ప్రత్యామ్నాయం కాంగ్రెస్ నాయకత్వంలో యూపీఏ-3 ఏర్పడడమే. లేక కాంగ్రెస్ మద్దతుతో నితీశ్ కుమార్ వర్గం ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. కేజ్రీవాల్‌కు మాత్రం జయలలిత, ములాయం సింగ్ యాదవ్, మాయా వతిలలో ఒక్కరు కూడా మద్దతునిచ్చే అవకాశం లేదు. ఈ ముగ్గురికీ 'అవినీతి' మకిలి అంటుకుని ఉంది.

మొత్తానికి బీజేపీయేతర ప్రభుత్వమంటూ ఏర్పడడం జరిగితే అందులో కేజ్రీవాల్ ఉండర న్నది ఖాయం. అట్లా వెలివేసినట్టు ఉండడానికి కేజ్రీవాల్ ఇష్టపడరు. కాంగ్రెస్‌తో పోటీగా ప్రభుత్వ ఏర్పాటు అవకాశాలను పెంచుకోవాలంటే, కాంగ్రెస్ నాయకుల కంటే ఎక్కువగా మోదీని విమర్శిం చడం తప్ప గత్యంతరం లేదన్నది కేజ్రీవాల్ అభి ప్రాయం కావచ్చు. బీజేపీ వ్యతిరేకి అనే ముద్ర తనకే ఉండాలంటే తాను మోదీ మీద తరచూ విమర్శలు, ఆరోపణలు గుప్పించక తప్పదని ఆయన భావిస్తున్నట్టుంది. ప్రధాన జాతీయ పక్ష మైన కాంగ్రెస్‌ను దెబ్బతీయాలంటే బీజేపీ మీద ఆ పార్టీ కన్నా ఎక్కువగా విమర్శలు సాగించా లన్న ఏకైక ధ్యేయంతో ఆయన మోదీ ప్రభుత్వం మీద విమర్శలు సాగిస్తున్నారు. అందుకనే ఆయన కాంగ్రెస్‌కు ఆదరణలేని పంజాబ్, గోవా, గుజ రాత్ వంటి రాష్ట్రాలలోకి తాను విస్తరించాలని యోచిస్తున్నారు. ప్రధాన ప్రతిపక్షంగా విస్తరించ డానికైనా ఆయనకు అభ్యంతరం లేదు!

> **తనను చంపేందుకు ప్రయత్నిస్తు న్నాడంటూ దేశ ప్రధానమంత్రి మీద ఆరోపణ చేశారు అరవింద్ కేజ్రీవాల్. ఇది సాధారణ విషయం కాదు. దేశ ఎన్నికల చరిత్రలో కనీవినీ ఎరుగని రీతిలో మెజార్టీ సంపాదించి ఢిల్లీ పగ్గాలు చేపట్టిన కేజ్రీవాల్ ఆత్మవిశ్వాసంతో ఉండాల్సింది పోయి అభద్రత, ఆత్మన్యూనతాభావాలకు గురవుతున్నారు! ఆయనలో ఎందుకీ భయాందోళనలు? కేవలం వార్తల్లో ఉండేందుకే ఈ ప్రచారమా?**

ఆయన తరచూ వార్తల్లో ఉండకపోతే ఇవన్నీ సాధ్యమయ్యే అవకాశం లేదు. అసలు ఏ ప్రచారమూ లేకుండా ఉండేకన్నా చెడు ప్రచారంతోనైనా కొన సాగాలనేది ఆయన అభిప్రాయం. అందుకనే ఆయన "మోదీ తనను చంపడానికి ప్రయత్నిస్తు న్నారు" అంటూ ప్రచారం మొదలుపెట్టారు. మోదీ తనను ఏ విధంగానూ పట్టించుకోవడం లేదని ఆయన బాధపడుతున్నారు. ఇటీవల జరిగిన అంతరాష్ట్ర మండలి సమావేశంలో మోదీ ఆయ నను ఏమాత్రం పట్టించుకోలేదు కూడా. మరో విషయమేమిటంటే, ఢిల్లీ మీద ఆయనకు పెద్దగా ఆసక్తి లేదు. ఢిల్లీ సీఎం పదవితో ఆయనకు తృప్తి కలగడం లేదు. ఢిల్లీ సీఎం పదవి ఆయన కళ్లకు ఆనడం లేదు. నిజానికి ఆయన ముఖ్యమంత్రి పదవిని కూడా చాలావరకూ ఉప ముఖ్యమంత్రి శిశోడియాకు వదిలేసినట్టు కనిపిస్తోంది. ఆయన ప్రస్తుతం ఇతర రాష్ట్రాల మీద దృష్టి కేంద్రీకరిస్తు న్నారు.

ఒక్క విషయం మాత్రం ఇక్కడ దృష్టిలో ఉంచుకోవాలి. ఢిల్లీలోనే ప్రజల ఆశయాలను నెర వేర్చలేని వ్యక్తి ఇతర రాష్ట్రాలలో విజయం సాధించడం జరిగే పని కాదు. ఒకవేళ ప్రజల ఆశయాలను విజయవంతంగా నెరవేర్చినా ఆయ నకు పెద్దగా ఒరిగేదేమీ లేదు. మహా అయితే, మోదీ వ్యతిరేక ఓట్లు చీలుతాయి. ఏతావతా, 2019లో ఆయన ప్రధాని అభ్యర్థి అయ్యే అవకాశం లేదు. ఆయన అక్కసు, కోపమంతా అదే!

నవ్య





# బామ్మ పుష్కర స్నానం

-సరసి

**'మడులడిగానా మాన్యాలడిగానా? ఒక పుష్కరస్నానం! మనవడివి నువ్వే నామాట వినకపోతే ఇంకెవరు వింటార్రా నాయనా?" అంది బామ్మ. నేనేం మాట్లాడలేదు.**

**"బతికినంత కాలం బతకను. ఏమో ఇదే నా ఆఖరి పుష్కరమేమో!".**

**"బామ్మా... సెంటిమెంటు మీద కొట్టకే. కిందటేడు కూడా నన్నిలాగే బ్లాక్‌మెయిల్ చేసి గోదావరి పుష్కరాలకు తీసికెళ్ల మన్నావు. తీరా తీసికెళ్లాక నన్నెన్ని తిప్పలు పెట్టావో గుర్తుందా?"**

"అవున్రా! వృద్ధాప్యం వస్తే నీకూ తెలుస్తుంది, ఆ బాధలేవిటో!"

"వృద్ధాప్యం బాధల గురించి చెప్పట్లేదు. తీరిగ్గా కూర్చొని చేజేతులా తెచ్చుకున్న కష్టాల గురించి చెబుతున్నా. 'ఇప్పుడే ఇల్లు కడిగా... మంచం దిగకండి' అంటూ మా ఆవిడ చెబుతున్నా వినిపించుకోకుండా మంచం దిగి నడవబోయావు. కాలు కాస్తా విరిగింది. ఆ కట్టు వల్లే కదా నడవడానికి లేకపోయిందీ. అందువల్ల అంబులెన్సులో తీసికెళ్లాల్సి వచ్చింది. ఖర్చుకి ఖర్చు, యాతనకి యాతన.."

"చాల్లెండింక.." అంటూ మధ్యలోకి మా ఆవిడొచ్చింది. కంచంలో బామ్మకి భోజనం తెచ్చి పెట్టింది.

తర్వాత తనూ నేనూ భోజనం చేస్తూ బామ్మని ఎక్కడికి తీసికెళ్లాలి, ఎలా తీసికెళ్లాలి అని ఆలోచనలో పడ్డాం. గోదావరి పుష్కరాలంటే, అప్పుడు రాజమండ్రిలో మావయ్యా వాళ్లు ఉన్నారు. ఇప్పుడు కృష్ణా పుష్కరాలకి బెజవాడలో బంధువులెవరున్నారు అని శోధన చేయసాగాం. అయితే బామ్మతో గోదావరి పుష్కరాల అనుభవం మాత్రం పదేపదే గుర్తుకు రాసాగింది.

బామ్మ పుట్టి పెరిగిందంతా రాజమండ్రిలోనే. అందుచేత గోదావరి పుష్కరాలు ఎప్పుడొస్తాయా అని ఏళ్ల తరబడి వేళ్లు మడుస్తూ లెక్కపెట్టుకునేది. ఆ నీళ్లూ, ఆ నేలా అన్నీ తనవేననీ, ఎవరు స్నానం చేసినా తన తర్వాతే చెయ్యాలనీ, ముందుగా తనకే ఆ హక్కు ఉందనీ ఆవిడ ఉద్దేశం. అందువల్ల బామ్మని ఎటువంటి పరిస్థితుల్లో రాజమండ్రి తీసికెళ్లక తప్పదని నిర్ణయం అయిపోయింది. అయితే పుష్కరాలకి పది రోజుల ముందు కాలు విరగ్గొట్టుకుని మంచంపట్టిన కారణంగా కారూ కాదు, రైలూ కాదు ఏకంగా అంబులెన్సే మాట్లాడాల్సొచ్చింది హైదరాబాదు నుంచి.

తెల్లవారుజామున నాలుగింటికి అంబులెన్సు, దానితో బాటు ఇద్దరు మనుషులూ వచ్చారు. అందరం కలిసి బామ్మని స్ట్రెచర్ మీదయితే పడుకోబెట్టాం గానీ మా మొదటి అంతస్తు నించి కిందికి తీసికెళ్లేసరికి మాకు చుక్కలు కనిపించాయి. ముందూ వెనకా ఇద్దరు పట్టుకున్నారే తప్ప మధ్యలో సహాయంగా మరో ఇద్దరు పట్టుకోడానికి మెట్లు సన్నగా ఉన్న కారణంగా సాధ్యపడలేదు. ముఖ్యంగా మెట్ల మధ్యలో మలుపు తిప్పాల్సిన చోట చాలా ఇబ్బంది పడాల్సొచ్చింది. దానికితోడు స్ట్రెచర్‌ని వాలుగా పట్టుకునే సరికి బామ్మ జారిపోసాగింది. నానాతంటాలు పడి ఎలాగైతేనేం జాగ్రత్తగా దింపి అంబులెన్సులోకెక్కించాం స్ట్రెచర్‌తో సహా.




భోజనం, మంచినీళ్లు, మందుల సరంజామాతో కదిలింది అంబులెన్సు. దార్లో రెండు మూడు చోట్ల ఆపి మేము టిఫిన్లు, టీలు సేవించాం. పనమ్మాయి బామ్మకి భోజనం పెట్టింది కానీ ఆమె తినలేదు. ఏమైనా తింటే ప్రయాణంలో కడుపులో తిప్పుతుందని ఆవిడ భయం. ఏం తినకపోవడం వల్ల నీరసం కమ్మి బామ్మ ఓ చోట కంగారు పెట్టేసింది. పిలిస్తే పలకలేదు. షుగరు డౌనైపోయిందన్నాడు డ్రైవరు. వెంటనే పంచదార నోట్లో పోసి నీళ్లు తాగించాం. పది నిమిషాలకి తేరుకుని కళ్లు తెరిచింది.

"బామ్మా, తినమంటే ఏం తినలేదు. ఎంత కంగారుపెట్టేశావో చూడు. దగ్గర కొచ్చేశాం. కాస్త ఓపిక తెచ్చుకోమరి" అంటూ బత్తాయిరసం గ్లాసులో పోసిచ్చా. అంబులెన్సు జిల్లాలు దాటి గోదావరి జలాల వద్దకు చేరింది. 'కొవ్వూరు వచ్చాం' అనగానే బామ్మకి ఎక్కడలేని బలం వచ్చేసింది.

రైల్ కం రోడ్డు బ్రిడ్జి మీద అంబులెన్సును ఆపమని చెప్పి ఓ రూపాయి నాణెం నా దగ్గర తీసుకుని మళ్లీ నా చేతికే ఇచ్చి గోదావరిలోకి విసరమని దణ్ణం పెట్టుకుంది.

రాజమండ్రిలో మావయ్యగారింటికి చేరేసరికి పిల్లాజెల్లా బంధువులంతా నిలబడి బామ్మకి ఘనస్వాగతం పలికారు.

మావయ్య ఇల్లు గోదావరి గట్టుకి ఓ ఫర్లాంగు దూరంలో మెయిన్‌రోడ్డు మీదే ఉంది. ఒకరోజు ముందు నుంచే యాత్రికుల కోలాహలం ప్రారంభమైపోయింది.

ఉదయం పుష్కర స్నానానికి గోదావరి గట్టు పొడవునా ఇసకేస్తే రాలని జనసందోహం. ఏ ఘాట్ చూసినా క్యూలు, బారులు తీరిన జనాలే! ఎక్కడ చూసినా పోలీసులూ, బారికేడ్లే. ఇంత రద్దీలో బామ్మని స్నానం చేయించడం ఎలా?

"బామ్మా! రోజూ అంటే కుదరదు. ఈ పన్నెండు రోజుల్లో ఏదో ఒక రోజు నిన్ను గోదావరికి తీసికెళ్లి స్నానం చేయిస్తాం. ఈలోగా రోజూ మేం స్నానం చేసి, తెచ్చిన నీళ్లతో ఇంటి దగ్గరే స్నానం చేద్దువుగాని... ఏం?" అన్నాను. "ఆ నీళ్లేగా సరే!" అంది బామ్మ.

కిటికీ దగ్గరే మంచం ఏర్పాటుచేయడం వల్ల రోడ్డు మీద స్నానం చేసి వచ్చిపోయే వాళ్లని చూస్తూ ఆనందించసాగింది.

ఉదయం లేదు. మధ్యాహ్నం లేదు. సాయంత్రం

లేదు.. జనాలు పొరుగూళ్ల నించి పిల్లాపాపలతో అలా వస్తూనే ఉన్నారు. స్నానాలు చేసి వెడుతూనే ఉన్నారు. ఎండనీ, ఉక్కబోతనీ లక్ష్య పెట్టడం లేదెవ్వరూ.

రెండో రోజున బామ్మ నన్ను పిలిచి "నా డబ్బులిలాతే!" అంది.

"నీ డబ్బులా?" ఆశ్చర్యపోయా. ఆమె ఎప్పుడూ ఇలా అడగలేదు.

"అవును.. నన్ను చూడటానికి వచ్చినవాళ్లు చీర కొనుక్కోమనో, పళ్లు కొనుక్కోమనో చేతిలో పెట్టిన డబ్బులన్నీ దాచమని ఇవ్వలేదా నీకిన్నాళ్లూ? అవీ?" అంది. నవ్వొచ్చింది నాకు. "సరే ఎంత కావాలి?" అన్నా. "ఓ వెయ్యి రూపాయలివ్వు. మిగతావి తర్వాత తీసుకుంటా!" అంది.

పుష్కరాల నిమిత్తం మావయ్యగారింటికి బంధువులు చాలామంది వచ్చారు. ఆడుతూ అల్లరిచేస్తున్న వాళ్ల పిల్లల్ని పిలిచి "ఒరే మీరంతా మన ఇంటిముందు బల్లవేసుకుని రోడ్డుమీద వెళ్లే భక్తులందరికీ చల్లటి మజ్జిగ పొయ్యండి రోజూ! వాళ్ల దాహం తీరిస్తే మీకు పుణ్యమే పుణ్యం! చదువు కూడా బాగా వస్తుంది. ఇదిగో!" అంటూ ఆ వెయ్యి రూపాయల్నీ వాళ్ల చేతిలో పెట్టింది.

అంతే! ఆ రోజునించి పిల్లల ఉత్సాహం అంతా ఇంతా కాదు. బయటనించి పెద్దగిన్నెతో పెరుగు కొనుక్కొచ్చి మజ్జిగచేసి, నిమ్మకాయలు పిండి ఇంటి గుమ్మం ముందు నిలబడి ఎండలో వెడుతున్న యాత్రీకులందర్నీ పిలిచి పిలిచి మరీ ఆ మజ్జిగ తాగించారు. ఇంట్లో అందరం రోజుకొకరు

**కానిస్టేబులు వారిదగ్గరకు దూసుకొచ్చాడు. ఏయ్.. ఏం చేస్తున్నారు? పవిత్ర జలాల్లో ఈ పాడుపనులు ఏమిటి? అంటూ లాఠీ ఝుళిపించాడు. కానిస్టేబులు హడావిడికి వాళ్ళంతా నిరుత్తరులయ్యారు. ఆ నలుగురూ స్ట్రెచర్‌ని కిందకి దింపారు. అంతలో ఇన్‌స్పెక్టర్ అక్కడికి చేరుకున్నాడు. డెడ్‌బాడీని పుష్కరాల రేవులో దింపుతారా? అంటూ లాఠీతో కొట్టాడు. డెడ్‌బాడీకి పుష్కరస్నానమా? అది నిజమేనా! వాళ్ళెందుకలా చేశారు?**



## విడాకులకు కారణం ఆ హీరోనా?

అమలాపాల్, విజయ్‌ల విడాకులకి కారణం కోలీవుడ్‌లో ఓ స్టార్ హీరో అన్న వార్త ఇప్పుడు కోలీవుడ్‌లో బాగా హల్‌చల్ చేస్తోంది. ఆ హీరోతో నటించవద్దని విజయ్ అమలకి చెప్పినా ఆమె వినకపోవడం వలనే గొడవ విడాకులకు దారితీసిందని అంటున్నారు. అమల ఆ హీరోతో సన్నిహితంగా ఉండడం భర్తతో పాటు ఇతర కుటుంబ సభ్యులకు కూడా నచ్చక పలుమార్లు హెచ్చరించారట కూడా! వారి హెచ్చరికలను అమలా లెక్కచేయలేదని కూడా చెబుతున్నారు. ఇంత గొడవ అయినా అమల ఆ హీరోతో మరో సినిమా చేస్తోందట!

వెయ్యి రూపాయల చొప్పున ఇచ్చి ఆ సేవా కార్యక్రమాన్ని 'స్పాన్సర్' చేశాం. నిజానికి పుష్కరాల అన్ని రోజులూ గోదావరి పరీవాహక ప్రాంతం అంతటా ఎంతోమంది దాతలు ఇటువంటి సేవలు చేసి, ఆతిథ్యం ఇచ్చి తరించారు.

రోజుకొక ఘాట్‌లో స్నానం చేసి ఎక్కడ ఖాళీగా ఉంటుందో, ఎక్కడైతే బామ్మని స్నానం చేయించవచ్చో అధ్యయనం చేశాం. చివరికి గోదావరి ఎగువన కాతేరు సమీపంలో ఒక ఘాట్ బావుందనిపించింది. అక్కడైతే జనం తక్కువ రావడమే కాదు. అంబులెన్సు కూడా నది సమీపం వరకూ వెళ్లే అవకాశం ఉంది.

కాస్త ఎండెక్కాక జనం పలచబడుతూ ఉండగా ఓ రోజు బయల్దేరాం. అనేకచోట్ల పోలీసులనూ, బారికేడ్లనూ తప్పించుకొని, కొన్నిచోట్ల అంబులెన్సు అన్న వంకతో విడిచిపెట్టగా ఎలాగో అలా ఆ రేవుకు చేరుకున్నాం. అమ్మయ్య.. బామ్మ కోరిక తీరుతుంది అని ఆనందిస్తున్న సమయంలో అనుకోని సంఘటన జరిగింది.

అంబులెన్సులోంచి స్ట్రెచర్ మీద బామ్మని దింపి నలుగురం నది వైపు తీసుకువెడుతూ ఉంటే హఠాత్తుగా ఎక్కడనించో ఓ పోలీసు కానిస్టేబుల్ పరిగెత్తుకొచ్చాడు.

"ఏయ్.. ఏం చేస్తున్నారు? పవిత్రమైన నీళ్లల్లో ఈ పాడుపనులేంటీ? లాఠీ ఝుళిపిస్తూ మీద కొచ్చాడు. ముందు మాకు అర్థం కాకపోయినా తర్వాత అర్థమైంది. నలుగురం సాయం పట్టి తెస్తూ కనిపించేసరికి మేమేదో శవాన్ని తెచ్చి నదిలో కలిపేస్తున్నామని అపోహపడ్డాడా పోలీస్! అది అర్థమయ్యేసరికి మామయ్యకి పిచ్చి కోపం వచ్చేసింది.

"ఏంటయ్యా, ఏమనుకుంటున్నావ్? పేషంటయ్యా! పేషంటుని స్నానం చేయిస్తే నీకేం వచ్చింది ఇబ్బందీ?" గట్టిగా ఎదిరించాడు ఆ పోలీస్‌ని. పోలీస్ కూడా తగ్గలేదు.

"పేషంటా? ఎందుకయ్యా అబద్ధాలూ? కింద లక్షలమంది స్నానాలు చేస్తున్నారు. ఇటువంటి పాపపు పనులు చెయ్యడానికి సిగ్గనిపించట్లా."

నేను మావయ్యనీ, ఆ పోలీస్‌నీ శాంతపరుస్తూ "బాబూ ఏమిటి? ఈమె కాలు విరిగి నడవలేకపోతోందని అంబులెన్సులో తెచ్చాం. కావాలంటే చూడు! బామ్మా!" అంటూ పిలిచాను పోలీసు కళ్లు తెరిపించాలని.

బామ్మ కళ్లు తెరవలేదు! పిలిస్తే పలకలేదు!! కుదిపినా చలనం లేదు!!! అదిరిపడ్డాం అందరం.

"బామ్మా..బామ్మా" పిలుస్తూనే ఉన్నాన్నేను.

"పొద్దుట్నించి కాఫీ కూడా తాగకుండా స్నానం చెయ్యాలని కూర్చుందిరా. నీరసం రాదామరి? షుగరు కూడా డౌనైందేమో" అన్నాడు మావయ్య.

ఒకసారి అనుభవమైనందున నేను ముందు జాగర్త చర్యగా తెచ్చిన పంచదార పొట్లాన్ని జేబులోంచి తీసి బామ్మ నోట్లో కుమ్మరించి నీళ్లు పోశా. గుటకెయ్యడానికి గొంతు రాస్తున్నా.

"నాటకాలాడుతున్నారా? ఉండండి చెబుతా!" అంటూ ఆ పోలీస్ దూరంగా ఉన్న ఇన్‌స్పెక్టర్ వద్దకు పరిగెట్టుకెళ్లాడు.

ఇన్‌స్పెక్టర్ హడావిడిగా వచ్చాడు. "వాటీస్ దిస్? చూస్తే చదువుకున్న వాళ్లల్లా ఉన్నారు. డెడ్ బాడీని పుష్కరాల రేవులో ఎలా కలుపుతారయ్యా? తియ్యండి! ఏ ప్రెస్సువాళ్లో చూశారంటే మా ఉద్యోగాలు పోతాయి! ఊ...క్విక్!" అంటూ అంబులెన్సు మీద లాఠీతో ఓ దెబ్బ కొట్టాడు.

బామ్మ బతికేఉందని వాళ్లకి చెప్పాలంటే ఆవిడ మాట్లాడాలి! వేరే మార్గం లేదు. ఆవిడ చూస్తే ఉలుకూ లేదు పలుకూ లేదు.

డ్రైవర్ ఇన్‌స్పెక్టర్‌కు ఏదో సర్దిచెప్పబోతున్నాడు. ఈలోగా నలుగురు పోలీసులొచ్చి బామ్మని మళ్లీ అంబులెన్సులోకి ఎక్కించడానికి స్ట్రెచర్ ఎత్తబోయారు. మావయ్యా నేనూ అడ్డుకుని వాళ్లని వెనక్కి తోసేశాం! ఈ ప్రయత్నంలో స్ట్రెచర్ ఒరిగిపోయి బామ్మ కింద గడ్డిలోకి జారిపోయింది! పడిపోతూనే "ఓరి దేవుడా" అంటూ గట్టిగా ఓ కేకపెట్టింది!

అప్పటివరకూ అది డెడ్‌బాడీయేనని ప్రగాఢ విశ్వాసంతో ఉన్న ఆ పోలీసులు ఒక్కసారిగా దాన్లోంచి ఓ శబ్దం గట్టిగా వచ్చేసరికి భయపడిపోయి కకావికలై దూరం పారిపోయారు!

బామ్మకి స్పృహ వచ్చినందుకు ఆనందపడుతూ ఆమెను మెల్లగా లేపి కూర్చోబెట్టాం. రెండు ముక్కల్లో జరిగిందంతా చెప్పాడు మావయ్య!

దూరంగా అచేతనావస్థలో నిలబడ్డ ఇన్‌స్పెక్టర్‌ని పిలిచింది బామ్మ చేత్తో సైగచేసి.

"ఇలారా నాయనా! నేను పోయాననుకున్నావా? భలేవాడివే! అంత సులభంగా పోతానా నేనూ? ఇప్పుడు పుష్కరస్నానం చేస్తా. ఇదేకాదు వచ్చే యేడు కృష్ణా పుష్కరాలొస్తాయి. ఆ స్నానం కూడా చేస్తా. ఏడు పుష్కరాలు చూసిన దాన్ని! మరో మూడూ చూస్తే పదీ అవుతాయి! ఆ తర్వాత ఆలోచిస్తా వెళ్లాలా వద్దా అని!" అంది నవ్వుతూ.

సంభ్రమాశ్చర్యాలనుంచి తేరుకొని ఆ ఇన్‌స్పెక్టరు అప్రయత్నంగా మోకాళ్ల మీద కూర్చుని రెండు చేతులూ జోడించాడు.

సెల్: 94405 42950






## మంత్రాల బరిణ

మనసంటూ ఉండాలే గాని
ఎలాపుట్టాయో తెలియనివ్వనివీ,
ఉన్నామంటూ తెలియబరిచేవీ,
అద్భుతాలు ఎన్నెన్నో!

వసంతం వస్తే
తోటనిండా పరుగులుతీసే
ఆకుపచ్చదనం అద్భుతం-
వానవేళ చినుకుల మీదుగా
వంగి పలకరించే
హరివిల్లు అద్భుతం-
శరత్కాలపు నది వంకల్లో, లంకల్లో
రెల్లు పొదల్లో సడిచేసే
మెత్తనిగాలి అద్భుతం-
హేమంతంలో మసకగా
మనదారిని మూసే
పొగమంచు అద్భుతం-
శిశిరంలో రాలిపడే పండుటాకుల
తడినేల వాసన అద్భుతం-
పోటెత్తే సముద్రం మీద
పున్నమిరేయి తళుకు వెన్నెల అద్భుతం!

•••

భూమికీ ఆకాశానికీ మధ్య
విస్తరించే పొరల పొరల బహుత్వం,
జడత్వం విడిచి మెల్లమెల్లగా
విప్పారే  చైతన్య పరిణామం,
తల్లిపక్కలో పడుకున్న
పసిబిడ్డ నవ్వు వెనక లేత కల,
ప్రేమికుల కళ్లలో భర్మహర్మ్యాల
మంత్రనగర నిర్మాణం,
రేపటి చూపుల యువ మనః కవాటాల మాటున
జడలు విచ్చే నవనవోత్సాహం,
ఆరుబయల రాత్రివేళ
మనిషి ఒంటరితనాన్ని జ్ఞాపకం చేసే
విశాలాకాశ నక్షత్ర నివహం,
మనసులో మనస్సుగా మసలిన చిరపరిచితులు
మనసం మంటల్లో మసికావడం,




అద్భుతమే - అద్భుతం!

•••

అంతులేని ఊహల
వన్నెవన్నెల నీ చే రుమాలులో
అందంగా అమరుకొన్న మంత్రాలబరిణ
జీవితమే - అద్భుతం!

-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ
సెల్: *98480 78079*

## మనమీదేసక్రోయ్!

సరసి








# ఫేవరెట్ సింగర్

**ఎదురుగా కూర్చున్న అమ్మాయిని పరిశీలనగా చూసి 'చెప్పండి, ఏంటి విషయం' అన్నాడు డిటెక్టివ్ శరత్. 'నా పేరు తులసి. నేను సింగర్‌ని. స్టేజిషోలు చేస్తా. సినిమా అవకాశాలూ వస్తున్నాయి. నాకు పేరు వస్తోంది. బిజీ అవుతున్నాను. కానీ ఎవరో నాకు భయంకరమైన మెసేజ్‌లు పంపుతున్నారు. స్నేహితులు మీ దగ్గరకు వెళ్లమన్నారు'.**

'పోలీస్ కంప్లెయింట్ ఇచ్చారా?'

'ఇచ్చాను. సెల్ మార్చమన్నారు. కానీ ప్రస్తుతం కుదరదు. అందుకే మీ దగ్గరకు వచ్చాను'.

'మెసేజ్‌లు చూపించండి' అడిగాడు శరత్.

ఆమె సెల్ అందించింది.

చూశాడు శరత్.

అన్నీ వేర్వేరు నెంబర్లే. లైంగికపరమైన మెసేజ్‌లు. దూషణలున్నాయి. తనకు అనుకూలంగా స్పందించకపోతే చంపుతానన్న బెదిరింపు కూడా ఉంది.

ఫోను నెంబర్లు రాసుకున్నాడు శరత్.

'ఈ మెసేజ్‌లు ఎప్పటినుంచి వస్తున్నాయి?' అడిగాడు.

'గుర్తులేదు. మొదట్లో సీరియస్‌గా పట్టించుకోలేదు కానీ మూడునెలలుగా తీవ్రత పెరిగింది. సెలబ్రిటీలకిలాంటి మెసేజ్‌లు రావటం సాధారణం అన్నారు ఫ్రెండ్స్. కానీ వాటి తీవ్రత బాగా పెరిగిపోయింది'.

'మీకెవరిమీదైనా అనుమానం ఉందా? ఎవరి ప్రేమనైనా తిరస్కరించారా?' అడిగాడు శరత్.

'కాలేజీలో కొందరు వెంటపడేవారు. పట్టించుకోలేదు. లవ్‌లెటర్లు రాసేవారు. చించేసేదాన్ని. కొందరు ఇంటివరకు ఫాలో అయ్యేవారు. ఆడపిల్లలకు ఇలాంటివన్నీ కామన్. కానీ ఇలా మెసేజ్‌లు పంపటం, బెదిరించటం నాకు కొత్త' అంది.

'నా అసిస్టెంట్ రాముకి వివరాలు ఇవ్వండి. మీరు నిశ్చింతగా ఉండండి' అన్నాడు శరత్. ఆమె వెళ్లిన తరువాత రాముతో అన్నాడు శరత్. 'ఆమె ప్రతి కదలిక గమనించమని నీ అసిస్టెంట్లకు చెప్పు' అన్నాడు.

'యెస్‌బాస్' అన్నాడు రాము.

సెల్‌ఫోన్లలో కాల్ డైవర్టింగ్ సౌకర్యం తరహాలోనే ఆండ్రాయిడ్ ఫోన్లున్నవారు గూగుల్ ప్లేస్టోర్ లోకెళ్ళి ఆప్ డౌన్లోడ్ చేసుకోవడంద్వారా మనకు వచ్చిన ప్రతి మెసేజ్‌నీ మరో ఫోనుకి, ఈమెయిల్‌కూ ఫార్వర్డ్ చేయవచ్చు. అందుకే తులసి సెల్‌లో ఆప్ డౌన్‌లోడ్ చేశాడు రాము.

'ఇప్పుడు ఆమెకు వచ్చిన ప్రతి మెసేజ్ మనకు అందుతుంది కదా?' అడిగాడు శరత్.

'వెంటనే అందుతుంది బాస్' అన్నాడు రాము.

అంతలోనే తులసి సెల్ నుంచి శరత్‌కి మెసేజ్ వచ్చింది. వెంటనే చూశాడు.

తన దగ్గరకు వచ్చినప్పుడు తులసిని ఏం చేస్తాడో ఆ మెసేజ్‌లో అశ్లీలంగా వర్ణించాడా వ్యక్తి. పంపిన వ్యక్తి నెంబరు రామూ నోట్ చేసుకుని తన అసిస్టెంట్‌కు ఫార్వర్డ్ చేశాడు. తన అసిస్టెంట్ నుంచి రాముకి ఐదునిమిషాల్లో ఫోను వచ్చింది.

'బాస్. అది ఫేక్ ఐడీ ఇచ్చి తీసుకున్న సిమ్. హైదరాబాద్‌లో ఫేక్ సిమ్స్ సరఫరా అతిపెద్ద వ్యాపారం. తీవ్రవాదులు ఇలాంటి ఫేక్ ఐడీ సిమ్‌లు వాడుతున్నారని పోలీసులు ఈ మధ్యే గుర్తుపట్టారు'.

శరత్ కాసేపు ఆలోచించి, 'ఈ మెసేజ్ వచ్చిన మొబైల్ లోకేషన్ తెలుసుకో' అన్నాడు.

'టోలీచౌకీ ఏరియా' అంటూ పది నిమిషాల్లో సమాచారం అందించాడు రాము.

'తులసి నేపథ్యం, ఆమె స్నేహితుల వివరాలు సేకరించు' చెప్పాడు శరత్.

'యెస్ బాస్' అన్నాడు రాము.

●●●

'తులసి మధ్యతరగతి కుటుంబీకురాలు. డిగ్రీ చదువుతూ సంగీతం నేర్చుకుంది. కాలేజీలో ఉండగానే టీవీల్లో పాడుతూ పేరు సంపాదించింది. ఇప్పుడు సినిమాలకు పాడుతోంది. రెండు మూడు పాటలు హిట్ అయ్యాయి' చెప్పాడు రాము.

'ఆమెకు సన్నిహితులెవరు?' అడిగాడు శరత్.

'బాస్... ఆమె ఎవరినైనా హద్దుల్లోనే ఉంచుతుంది. ఓ టీవీ ప్రొడ్యూసర్ చనువు తీసుకోబోతే ప్రోగ్రామ్ వదులుకుంది'.

'ఎవరా ప్రొడ్యూసర్?'

'సుందర్...'.

'నీ అసిస్టెంట్లను అతడిపై ఓ కన్నేసి ఉంచమను' చెప్పాడు శరత్.

'స్టేజిషోలకు వెళ్ళినప్పుడు, డబ్బు ఆశచూపి లొంగదీసుకునే ప్రయత్నంచేస్తే మరోసారి వారి 'షో'లకు రానని చెప్పేసింది. అయితే సంగీత దర్శకుడు ప్రదీప్ ఆమె బాయ్‌ఫ్రెండ్ అంటారు. టీవీ సీరియల్స్‌లో పాడేందుకు అతనే ఆమెకు ఎక్కువ అవకాశాలిచ్చాడు. సినిమా అవకాశాలు వచ్చాక ఆమె అతనికి దూరమైపోయిందట'

'సరే, ప్రదీప్‌ని కలుద్దాం' అన్నాడు శరత్ లేస్తూ.

●●●

'తులసి మంచి గాయని. నన్ను నిచ్చెనలా వాడుకుని వదిలేసింది. మా ఫీల్డులో ఇది సాధారణం. ఆమెకు పోటీగా ఇప్పుడు వనితను తెస్తున్నా. రెండేళ్లలో తులసిని దాటిపోతుంది చూడండి' అన్నాడు ప్రదీప్.

'ఇతడు మెసేజ్‌లు పంపే రకం కాదు. తన పద్ధతిలో ప్రతీకారం తీర్చుకుంటున్నాడు' రాముతో అన్నాడు శరత్. వీళ్లు ప్రదీప్‌ను కలిసిన సమయంలో ఫేక్ నెంబర్ల నుంచి తులసికి రెండు మూడు బెదిరింపు మెసేజ్‌లు వచ్చాయి. సిటీలో నాగారం, నాగోల్ ప్రాంతాల నుంచి ఈ మెసేజ్‌లు వచ్చాయి. తులసికి ఫోన్ చేశాడు శరత్.

'మీ స్టేజి షో వీడియోలున్నాయా?'

'కొన్ని ఉన్నాయి. పంపుతాను' అంది తులసి.

●●●

ఆ వీడియోలు జాగ్రత్తగా పరిశీలించటం ప్రారంభించాడు శరత్. జాగ్రత్తగా ప్రేక్షకులను గమనించసాగాడు. ఎవరినీ అనుమానించే వీలు లేకుండా ఉంది. ఆమె ఇచ్చిన వీడియోల్లో కొన్ని టీవీల్లో పాడిన పాటల వీడియోలూ ఉన్నాయి. అవి చూస్తుంటే, ఓ టీవీ వీడియోలో నీడలో ఉన్న వ్యక్తిపై పడ్డాయి శరత్ కళ్ళు. ఆ ప్రాంతాన్ని పెద్దదిగా చేసి చూశాడు. స్టూడియోలో పనిచేసే కుర్రాడిలా ఉన్నాడు. అతడు తెరను పక్కకు జరిపి మరీ తులసిని తదేకంగా చూస్తున్నాడు.

ప్రతి ఫ్రేమ్‌ను పట్టిపట్టి చూస్తుంటే ఆ విషయం తెలుస్తోంది. అతడిని మిగతా ఫుటేజ్ నుంచి వేరుచేసి, వీడియో ఎనలిస్టు వీణకు ఫోన్ చేశాడు శరత్.

●●●

'ఏమైనా తెలిసిందా?' అడిగింది తులసి.

'కచ్చితమైన ఆధారాలు దొరకలేదు కానీ అనుమానితులున్నారు, అంటూ టీవీ రికార్డింగ్ వీడియోలో తెరవెనుక భాగం వైపు జాగ్రత్తగా చూడమన్నాడు. ఆమె కళ్ళు పెద్దవయ్యాయి.

'ఇతడెవరో తెలుసా?'

తల అడ్డం ఊపింది. 'కానీ ఎందుకో భయంగా ఉంది. ఎంతమంది మనల్ని గమనిస్తూ ఉంటారో' అంది. ఆమె వెళ్లిన కాసేపటికి మళ్ళీ ఒక మెసేజ్ వచ్చింది.

**కాలేజీ రోజుల్నుంచే పాడుతూ గాయనిగా ఎదిగింది ఆమె. ఎన్నో స్టేజీ షోలు చేస్తోంది. సినిమా అవకాశాలు కూడా వస్తున్నాయి. దాంతోపాటు ఆమెకు అశ్లీల మెసేజ్ వేధింపులు కూడా మొదలయ్యాయి. అదెంత వరకూ వెళ్ళిందంటే అదుపులేనిస్థాయి వరకు వెళ్ళింది. విసుగెత్తి ఆమె డిటెక్టివ్ శరత్‌ను ఆశ్రయించింది. ఆ ఆగంతకుణ్ణి పట్టుకోవడానికి శరత్ ఏం చేశాడు?**



'ఇక నేను తాళలేను. ఇవాళ నిన్ను కలుస్తా. నువ్వు నా దానివి కాకపోతే ఇంకెవరికీ దక్కటానికి వీలులేదు' మెసేజ్ చదివేలోపు తులసి నుంచి ఫోన్ వచ్చింది శరత్‌కి.

'మెసేజ్ చూశాను. భయపడవద్దు' ధైర్యం చెప్పాడు శరత్.

ఇంతలో రాము ఎగ్జయిట్‌మెంట్‌తో అరిచాడు. 'బాస్... వాడు పొరపాటు చేశాడు. ఈసారి సిమ్ అడ్రసు సరిగ్గా ఇచ్చాడు'.

'వెంటనే లేచాడు శరత్'.

●●●

'ఇది నా నెంబరే. కానీ... నాదికాదు' కంగారుగా చెప్పింది కావ్య.

'మరెవరిది?'

"నేను నా ఫ్రెండు ఫ్రెండు నుంచి ఈ సిమ్ కొన్నాను. నా ఫ్రెండ్ పేరు ఫెర్నాండెజ్.

●●●

'కావ్య ఎప్పటినుంచో సిమ్ కావాలంటోంది. నా ఫ్రెండు జయ్ తన దగ్గర ఓ సిమ్ ఉందన్నాడు. కొన్నాను. అదిగో జయ్..' చూపించాడు ఫెర్నాండెజ్.

శరత్ ప్రశ్నవిని నవ్వాడు జయ్. 'సెల్‌తోసహా సిమ్‌ను చాలా చీప్‌గా అమ్మేశాడు. నేను కాస్త లాభంతో ఫెర్నాండెజ్‌కు ఇచ్చా. వాడు దాన్ని తన గర్ల్‌ఫ్రెండ్ పేరు మీదకు మార్పించాడు'.

'నీకు అమ్మిందెవరు?'

'శివ... మా ఇంటి పక్కనే ఉంటాడు. ఫన్నీ మాన్. రోజుకో సిమ్ మారుస్తాడు'

'మీ ఇల్లెక్కడ?' అడిగాడు శరత్.

●●●

'లేడు బాబూ. ఎటువెళ్తాడో, ఎక్కడికెళతాడో తెలియదు. టీవీలో బంగారం లాంటి ఉద్యోగం వదిలేసుకున్నాడు' చెప్పాడు ఇంటి ఓనరు. శరత్ ఆలోచనలు వేగంగా పనిచేయడం ప్రారంభించాయి.

'అతడి సెల్ నెంబరుగానీ, బండి నెంబరుగానీ తెలుసా?' అడిగాడు శరత్.

'లేదు'

బయటకు వస్తూ రాముకి ఫోను చేశాడు శరత్.

'రామూ....తులసి ఎక్కడుంది?'

'తులసి ఎగ్జిబిషన్‌కు వెళ్ళింది' చెప్పాడు రాము.

●●●

ఎగ్జిబిషన్ హడావుడిగా ఉంది. పిల్లల కేకలు, మైక్‌లో పాటలు, దుకాణాల వాళ్ళ అరుపులు, మాటల రణగొణ ధ్వని... గోలగోలగా ఉంది.

'తులసి జెయింట్‌వీల్ దగ్గర ఉంది' గేటు దగ్గరే శరత్‌ని కలిసి చెప్పాడు రాము అసిస్టెంట్. తిన్నగా జెయింట్‌వీల్ వైపు వెళ్లాడు. అక్కడ తులసిని వెతుకుతుంటే, వీడియో ఎనలిస్ట్ వీణ నుంచి ఫోను వచ్చింది శరత్‌కి.

'శరత్, నువ్వు చూపించిన అబ్బాయి, తులసి చేసిన ప్రతి కార్యక్రమం వీడియోలోనూ అన్నిచోట్లా స్టేజివెనుకే ఉన్నాడు, ఆమెను చూస్తూ కనిపించాడు' చెప్పింది వీణ.

'అతడి ఇమేజ్ వాట్సాప్‌లో వెంటనే నాకు పంపించు' చెప్పాడు శరత్.

ఇంతలో శరత్ దృష్టి తులసిపై పడింది. తులసి, మరో ఇద్దరు యువతులతో 'పెద్ద ఢిల్లీ' అప్పడం తింటోంది. ముగ్గురూ నవ్వుతున్నారు. ఆమె చుట్టూ ఉన్నవారిని గమనించసాగాడు శరత్.

'ఫొటో త్వరగా పంపు' వీణకు మెసేజ్ పెట్టాడు.

అంతలో తులసి, ఆమె స్నేహితురాళ్లు జెయింట్ వీల్ దగ్గరకు వచ్చి టికెట్లుకొని జెయింట్‌వీల్ ఎక్కారు. తులసి ఫ్రెండ్స్ ఇద్దరూ ఒక బాక్స్‌లో, తులసి ఒక్కతే ఇంకో బాక్స్‌లో కూర్చుంది.

జెయింట్‌వీల్ తిరగడం ప్రారంభించింది. తులసి కూర్చున్న డబ్బా కిందకు రాగానే అంతవరకూ అక్కడ నుంచుని అందరినీ డబ్బాల్లోకి ఎక్కిస్తున్న యువకుడు తులసి డబ్బాలోకి దూకాడు.

శరత్ అలర్టయ్యాడు. వీణ నుంచి మెసేజ్ వచ్చింది. యువకుడి ఫోటో పంపింది.

శరత్ ముఖంలోకి రక్తం పొంగివచ్చింది. ఒక్క దూకులో జెయింట్‌వీల్ ఫ్లాట్‌ఫారం చేరుకున్నాడు. అడ్డువచ్చిన వారిని తోసేశాడు. తుపాకీ తీసి పట్టుకున్నాడు. ఒక రౌండ్ తిరిగి కిందకు వస్తోంది. తులసిఎక్కిన డబ్బా. సిద్ధంగా నిలబడ్డాడు శరత్.

డబ్బా కిందకు రాగానే దాన్లోకి దూకాడు తుపాకీ సిద్ధంగా పట్టుకుని. అప్పటికే ఆ యువకుడు తులసి మెడచుట్టూ చేతులు బంధించి ఒత్తేస్తున్నాడు. తులసి కళ్ళు తేలేస్తోంది.

ఆలస్యం చేయలేదు. తుపాకీ పేల్చాడు శరత్.

సడెన్ బ్రేకు వేయటంతో 'కీచు'మంటూ ఆగింది జెయింట్‌వీల్.

●●●

'శివ ఉన్మాద మనస్తత్వం గల యువకుడు. అతడికి ఎందుకు నచ్చిందోగానీ తులసి వెంట పడ్డాడు. అతడు ఫ్లోర్ బాయ్. ఆమె విద్యావంతురాలు. అతన్ని పట్టించుకోలేదు. కానీ ఆమెమీద ఆశలు పెంచుకున్నాడు. ఆ ఆశ అతణ్ణి పూర్తిగా పిచ్చివాణ్ణి చేసింది. ఆమె టీవీ మారిపోతే అతడూ వెళ్ళాడు. అసభ్య మెసేజ్‌లు పంపాడు. ఆమెకు అసలు అతడెవరో తెలియదుగానీ, శివ మాత్రం ఆమె తనను మోసం చేసిందని ఊహించుకున్నాడు. ఆ ఊహ నిజమని నమ్మాడు. ఆమెను చంపాలనుకున్నాడు' కేసు పూర్వాపరాలు తెలియజేశాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ**
**సెల్: 98496 17392**

# హావేలీ




-ఎస్. ఘటికాచలరావు సెల్:90031 41474

**సుమోలోనుంచి దాదాపు దూకినట్టుగా దిగిన దివాకర్ వేగంగా వెళ్ళి గేటును తోశాడు. గేటుకు తాళం వేసి ఉండటం గమనించలేదతను.**

**గమనించిన తరువాత, "పగలగొట్టండ్రా ఈ తాళాన్ని" అని అరిచాడు గట్టిగా.**

**నలుగురిలో ఒకడు తుపాకీ తీసి దాన్ని కాల్చేశాడు. గొలుసు ఊడి తాళంతో సహా నేల మీద పడింది. ప్రహరీ తలుపుల్ని విసురుగా బార్లా తెరిచి దాదాపు పరిగెడుతున్నట్టు ముఖ ద్వారం వద్దకు చేరుకుని మూసి ఉన్న సింహద్వారం తలుపు బలంగా తోశాడు.**

అయితే అది లోపల గడియపెట్టి ఉండక పోవడం వల్ల వెంటనే వేగంగా తెరుచుకుంది. ఆ ఊపుకు దివాకర్ దాదాపుగా తూలి పడబోయి తమాయించుకున్నాడు.

లోపలంతా దుమ్ము, ధూళి పేరుకుపోయి నట్టుంది. అక్కడక్కడా బూజుపట్టి దాదాపు శిథిలావస్థలో ఉన్నట్టు అనిపిస్తోంది. మరికొన్నాళ్ళు పరామర్శించకపోతే కచ్చితంగా అదే గతి పడు తుంది.

రాజదర్బారులా ఉన్న పెద్ద హాలును చూసి అతను విపరీతమైన ఆశ్చర్యానికి లోనయ్యాడు. మైసూర్ మహారాజా ప్యాలెస్ చూసి ఉన్నాడు గానీ, అది నిజమైన మహారాజుల మందిరం కాబట్టి అంతటి హంగు ఆర్భాటాలతో కట్టించారనుకున్నాడు. అయితే ఈ మారుమూల గ్రామంలో కూడా వైభవంగా ఇంతటి దివ్యమైన మహల్ ఉండడం అతన్ని ఆశ్చర్యానికి గురిచేసింది.

కొద్ది క్షణాల్లో ఆశ్చర్యం నుంచి తేరుకుని "ఒక్క గది కూడా విడవకుండా అన్ని గదులూ, మూల మూలలా వెదకండిరా" అంటూ తను కూడా ఒక దిక్కుగా అడుగులేశాడు.

ఐదుగురూ తలో దిక్కుకు విడిపోయారు.

దివాకర్‌రెడ్డి దర్బారులోకి వెళ్ళాడు. కుడివైపున గది తాళం వేసి ఉంది. తుపాకి పేల్చి తాళం పగలగొట్టి లోనికి వెళ్తే మెట్లు కనిపించాయి. చాలా ఇరుకుగా కాస్తంత చీకటిగా ఉన్న ఆ మెట్లగుండా పైకెక్కి వెళ్తే అక్కడో గది ఉన్నట్టనిపించింది. గది తాళం వేయలేదు. తోసిచూస్తే తలుపు తెరుచు కోలేదు. చిన్నగా నిట్టూర్చి మెట్లు దిగి వస్తూండగా మెట్ల పక్కన అతనికి గోడమీద ఒక విచిత్రమైన ఆకారం కనిపించింది.

అదే మార్గంలో మెట్లెక్కేటప్పుడు కనబడనిది దిగేటప్పుడు ఎక్కణ్ణుంచి వచ్చిందో అర్థం కాలేదు. చీకటిగా ఉండడం వల్ల తనే సరిగ్గా గమనించ లేదేమో అనుకున్నాడు.

జపనీయుల డ్రాగన్ ఆకారంలో ఉన్న ఆ బొమ్మకు రెండు తలలున్నాయి. ఒకటి డ్రాగన్ తలైతే మరొకటి మామూలు బల్లి తలలాగుంది.

చూడ్డానికి కొద్దిగా భయం కలిగేలా ఉన్న ఆ ఆకారాన్ని చూస్తే ఏదో సందేహం కలిగింది. గోడకు వేలాడదీసినట్టుగా ఉన్న ఆ బొమ్మ నిజంగా వేలాడ దీశారా లేక గోడమీదే అతికించారా అన్న సందేహం కలిగేలా ఉంది. నేలమీది నుంచి అందేంత ఎత్తులో లేదు. కాబట్టి అదొక షో పీస్ అనుకున్నాడు.

పూర్తిగా కిందికి దిగి తానెక్కిన మెట్లవైపొక సారి చూసిన దివాకర్‌రెడ్డికి ఒక్కసారిగా ముచ్చె మటలు పోశాయి. తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. కారణం అంతక్రితం గోడమీద కన బడ్డ బొమ్మ ఇప్పుడక్కడ లేదు!

ఒక విధమైన భయం లీలగా అతని మన

**జరిగిన కథ**

అరకులోయ మార్గంలో ఒక కుగ్రామానికి సమీపంలో ఉంది పాడుబడిన హవేలీ. ఒక ప్పుడు గొప్పగా బతికిన మహారాజా కుటుంబం లోని వారంతా అదృశ్యమైపోవడం, అర్ధరాత్రిళ్ళు ఆ ప్యాలెస్‌లోంచి ఆర్తనాదాలు వినిపిస్తూ ఉండ టంతో, ఆ ఊరి ప్రజలు భయభ్రాంతులవు తారు. ప్యాలెస్‌వైపు కన్నెత్తి చూడ్డానికి భయ పడుతూ ఉంటారు. ఆ ఊరికి అతిథిగా వచ్చిన విష్ణు హవేలీ రహస్యం కనిపెట్టాలని నిర్ణ యించుకుంటాడు. చీకటివేళ ప్యాలెస్‌లో ప్రవే శించి, అక్కడ హత్యా దృశ్యం చూస్తాడు. ఆ శవం, ఆ మనుషులు క్షణాల్లో మాయం కావ డంతో దిగ్భ్రాంతికి గురవుతాడు. ఇంతలో క్వారీ కాంట్రాక్టర్ కొడుకు, అతడి మరో ఇద్దరు స్నేహి తులు ప్యాలెస్‌లో ప్రవేశించి అదృశ్యమైపోతారు. ఆ తర్వాత.....



సులో ప్రవేశించింది. తాను చూస్తున్నది నిజమేనా అన్న అనుమానం ఇంకా నివృత్తి కాలేదు. ఇలాంటి వింతలు ఇంకా ఈ హవేలీలో ఎన్నున్నాయో అని పించింది. మెల్లగా గోడవైపే చూస్తూ మళ్ళీ మెట్లెక్క సాగాడు. చివరిదాకా ఎక్కినా బొమ్మ కనబడలేదు.

అతనికి భయం అధికం కాసాగింది. పై మెట్టుదాకా వెళ్ళి వెనక్కు తిరిగి చూశాడు. గోడ మీద అసలు ఆ బొమ్మ ఉన్న ఛాయలే కనిపించ లేదు. అది బహుశా తనకు కలిగిన భ్రాంతి కావచ్చు అనుకుని మెట్లు దిగడం ప్రారంభించాడు. అయితే గోడమీదనుంచి దృష్టి మాత్రం మరల్చలేదు. చివరి మెట్టు వరకూ వచ్చినా ఏమీ కనబడక పోవ డంతో తను వచ్చిన అసలు పని మర్చిపోయి ఏవేవో పనులు చేస్తున్నట్టు అప్పుడు స్ఫురణ కొచ్చింది. మెల్లగా తల వెనుక చరుచుకుని చివరి మెట్టు దిగాడు.

అదే సమయంలో ఠక్కున మళ్ళీ ఆ ఆకారం కనిపించడంతో చిన్నగా కేకపెట్టి అక్కణ్ణుంచి బయ టికి పరిగెత్తాడు దివాకర్. లోపలికెళ్ళిన అను చరుల్లో ఇద్దరు హాల్లోకి వచ్చి వేరే గదుల్లోకి వెళ్తూ తన యజమాని అరవడం చూసి ఆవైపు వచ్చారు.

"ఏంటయ్యా?"

"ఇక్కడేవో మాయామర్మాలు చాలా ఉన్నట్టు న్నాయిరా. అయినా సరే భయపడకుండా అన్ని గదులూ వెదకాలి" అని బింకంగా వాళ్ళవైపు చూసి మరో దిక్కుగా వెళ్ళాడు దివాకర్. వెళ్తూ మళ్ళీ ఆ మెట్ల గదినే చూస్తూ ముందుకెళ్ళాడు. అతని అనుచరులిద్దరూ ఇప్పుడా మెట్ల గదిలోకి వెళ్ళారు.

కొద్ది క్షణాలకే అందులో ఒకడు "సార్" అంటూ అరిచాడు.

దివాకర్ వేగంగా అక్కడికి చేరుకున్నాడు. ఆ ఇద్దరూ గోడవైపే చూస్తున్నారు. అక్కడ గోడమీద రెండు తలల డ్రాగన్ బొమ్మ! దివాకర్‌రెడ్డి అవా క్కయ్యాడు.

"వాడు మెట్లెక్కే ముందు అక్కడలేదు సార్. ఇప్పుడెలా వచ్చిందో తెలియలేదు" అన్నాడు ఒకడు భయంగా దానివైపు చూస్తూ.

"ఏం చేశావు నువ్వు?" అడిగాడు.

"సోము మాత్రమే పైకెక్కాడు సర్. నేనిక్కడే





# అలాంటి కథలు రావడం లేదు

'సుప్రీం' సక్సెస్ తరువాత రాశీఖన్నాకు చాలా అవకాశాలు తలుపు తట్టాయట! కానీ తన రేంజ్‌కి తగిన కథలు కాకపోవడంతో వేటికీ ఓకే చెప్పలేదట! అసలు తనకు 'గీతాంజలి' లాంటి స్టోరీ చేయాలని కోరికగా ఉందట! అలాంటి కథలు రాకపోవడంతో వరుస సినిమాలు చేయడం లేదని చెప్పుకొచ్చింది. 'గీతాంజలి' లాంటి స్టోరీతో వస్తే ఎన్ని రోజులు కావాలన్నా కేటాయిస్తానని కూడా అంటోంది.

ఉన్నాను" అన్నాడు కిందిమెట్టు దగ్గర ఉన్నవాడు. వాడి పేరు సాంబ.

దివాకర్ చూశాడు. సాంబ చేతులు మెట్ల చివర నున్న కొయ్యగుబ్బ మీద ఉన్నాయి. చిన్నగా తల పంకించి "దానిమీద చెయ్యి తీయరా" అన్నాడు.

ఠక్కున వాడు గుబ్బ మీద నుంచి చెయ్యి తీశాడు.

ముగ్గురూ గోడవైపే చూస్తున్నారు. మార్పేమీ రాలేదు.

దివాకర్ ముందుకొచ్చి ఆ గుబ్బను పట్టుకుని మెల్లగా గుంజాడు. కాసేపటికి ఆ ఆకారం కను మరుగైంది. మళ్ళీ మెల్లగా గుంజాడు. ఆ ఆకారం మళ్ళీ గోడమీద ప్రత్యక్షమైంది. దివాకర్ ధైర్యం చేసి మెట్లెక్కి మెల్లగా ఆ బొమ్మలోని డ్రాగన్ తలను తాకాడు. కిర్రుమన్న శబ్దం వినిపించింది. ముగ్గురూ భయభ్రాంతులై చుట్టూ చూశారు.

మెట్లపైనున్న సోము "సార్, ఇక్కడేదో గది ఉంది" అన్నాడు ఆశ్చర్యంగా.

గబగబా మెట్లెక్కి ముగ్గురూ ఆ గదిలోనికి వెళ్ళారు.

విశాలమైన గది. అందులో రెండు కంప్యూటర్లు, ఒక ప్రింటర్, ఒక ప్రింటింగ్ మెషీన్, ఇంకా కాగితాల మోపులు ఉన్నాయి.

అక్కడ నేలమీద కొన్ని కాగితాలు చెల్లాచెదురుగా పడి ఉన్నాయి. చూస్తే అవన్నీ వెయ్యి రూపాయల కాగితాలు. ఆశ్చర్యంగా వాటివైపు చూస్తున్న దివాకర్‌కు అవన్నీ దొంగ నోట్లన్న విషయం అర్థమై పోయింది. అంతకుమించి, తన కొడుకు కనబడకుండా పోవడానికి కారణం కూడా లీలగా అర్థమైంది.

'ఈ గ్యాంగ్‌తో ఏవో సంబంధాలు పెట్టుకున్నందు వల్ల వాళ్ళమధ్య తలెత్తిన విభేదాల కారణంగానే వాడు కనబడకుండా పోయి ఉంటాడన్న అనుమానం కలిగింది. అయితే కచ్చితంగా నిర్ణయించుకోకుండా నిర్ధారణకు రాకూడదనుకున్నాడు.

ఓరకంటితో తన తోడుగా ఉన్న సోము, సాంబల వంక చూశాడు దివాకర్‌రెడ్డి. వాళ్ళిద్దరూ ఆ నోట్లవంకే ఆశ్చర్యంగానూ, ఆబగానూ చూస్తుండడం గమనించాడు.

తన అనుమానాన్ని నిర్ధారణగా మార్చి "ఇందువల్ల నన్నమాట రాఘవబాబు కనబడకుండా పోయింది. ఈ గ్యాంగ్ వాళ్ళే అతన్ని ఏమైనా చేసుంటారు. ఈ విషయం బయటికి తెలిస్తే చెప్పినవాళ్ళ గతి ఇక అంతేనేమో" అన్నాడు లోగొంతుకలో వాళ్ళిద్దరికీ మాత్రం వినబడేటట్టుగా. వాళ్ళిద్దరూ ఇప్పుడు భయంగా చూశారు ఆ నోట్ల వంక. తను కోరుకున్న మార్పు వాళ్ళ కళ్ళల్లో చూశాక తృప్తిపడ్డాడు దివాకర్.

ఇప్పుడతనికి ఆ డ్రాగన్ బొమ్మ మర్మం దాదాపుగా అర్థమైంది. ముగ్గురూ కిందికి దిగొచ్చారు. వచ్చేటప్పుడు దివాకర్ మెట్ల మీద బొమ్మలోని బల్లి తలను తాకాడు. మళ్ళీ కిర్రున శబ్దం వినబడింది. మెట్లెక్కి చూస్తే గది తలుపులు మూసుకుని ఉన్నాయి.

పూర్తిగా మెట్లు దిగి కిందికి వచ్చి కొయ్య గుబ్బను ఒకసారి మెల్లగా గుంజడంతో క్రమంగా డ్రాగన్ బొమ్మ అంతర్ధానమైంది. ఇంతసేపు తాము చూసిందంతా ఏదో మాయాబజార్, పాతాళభైరవి సినిమాలా అనిపించింది. కళ్ళు నులుముకుని ఇంకా ఆ భవంతిలో ఏయే వింతలున్నాయో అనుకుంటూ ముందుకు కదిలారు.

వేరే గదుల్లో తిరుగుతున్న మరో ఇద్దరు కూడా ఆ సమయానికి అక్కడికి వచ్చారు.

అందులో ఒకడు వగరుస్తూ "సార్, వెనకవైపు గదుల్లోకి వెంటనే రండి సార్" అంటూ తొందర పెట్టాడు. వాడి ఆదుర్దా చూసి కొద్దిగా కలత చెందిన దివాకర్ అది తన కొడుకు గురించిన సమాచారమై ఉంటుందేమోనని భయపడ్డాడు.

వెంటనే అందరూ కలిసి వేగంగా వెనకవైపు వెళ్ళారు. అక్కడ కూడా ఇదే మాదిరి మరో పెద్ద హాలు ఉంది. పక్కనే నాలుగైదు గదులు కూడా ఉన్నాయి.

ఒక గదిలో ఒక సూట్‌కేసులో ఏవేవో పొట్లాలు ఉన్నాయి. చూస్తే అవి డ్రగ్స్‌లా అనిపిస్తున్నాయి. అయోమయంగా ఒకరినొకరు చూసుకున్నారు.

పక్కనే ఉన్న మరో గదిలోనికి వెళ్ళారు. అక్కడ చీరలు, జాకెట్లు, దుపట్టాలు చిందరవందరగా పడి ఉన్నాయి. నేలమీద గాజుల ముక్కలు కనబడ్డాయి. అక్కడక్కడా రక్తపు మరకలు కూడా ఎండిపోయి ఉన్నాయి. ఏదో పెనుగులాట జరిగిన ఆనవాళ్ళుగా అవి ఉన్నాయి. అదే అయోమయంతో పక్క గదిలోకి వెళ్ళారు.

అక్కడ కొన్ని ప్యాంట్లు, చొక్కాలు, గాగుల్స్, చేతి గడియారాలు, చెప్పులు పడి ఉన్నాయి. ఆ గదుల్లో కూడా ఎండిన రక్తపు మరకలు ఉన్నాయి.

వాటిని చూసిన దివాకర్ మనసు గతి తప్పింది. ఒక విధమైన భయం మనసును ఆవహించింది. నిదానంగా అక్కడున్న దుస్తులన్నీ పరికించాడు.

ఒకచోట అతని దృష్టి ఆగిపోయింది. అది రాఘవ డ్రస్! అతని చేతి గడియారం! క్రితం పుట్టిన రోజుకు తను కొనిచ్చిన డైమండ్ స్టడెడ్ రిస్ట్ వాచ్!

వాటిని దగ్గరగా చూసి అక్కడే కుప్పకూలిపోయాడు దివాకర్. వాటన్నింటినీ చేతిలోనికి తీసుకుని మళ్ళీ మరోమారు జాగ్రత్తగా పరిశీలించాడు. సందేహం లేదు. అవన్నీ రాఘవకు చెందినవే. వెర్రివాడిలా దిక్కులు చూశాడు దివాకర్‌రెడ్డి. తమ యజమాని పరిస్థితి చూసి వాళ్ళకూ భయం పట్టుకుంది. ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

అక్కడి గదుల్లో అంతవరకూ చూసిన వాటి ఆధారంగా రవీంద్రవర్మ ఆధ్వర్యంలో ఆ హవేలీలో రకరకాల అసాంఘిక కార్యకలాపాలు నడుస్తున్నాయన్న సంగతి త్వరగానే అర్థమైపోయింది దివాకర్‌రెడ్డికి.

'అయితే అందుకు తన కొడుకు ప్రాణాలెందుకు తీయాల్సి వచ్చింది? వీళ్ళ మధ్య ప్రాణాలు తీసేంతగా బేధాభిప్రాయాలు, పగ ఎందుకొచ్చాయి. ఇక్కడ ఇన్ని విషయాలు నడుస్తున్నాయి. ఏ విషయంలో విభేదాలు వచ్చుంటాయి? ఎవరిని అడగాలి? రాఘవకు వీళ్ళతో ఎంత కాలంగా పరిచయం ఉంది? ఇంతకూ ఈ భవంతిలో మనుషులెవరూ కనబడడం లేదే? చూడబోతే ఇది పాడుబడిన బంగ్లాలాగుంది. మరి ఇవన్నీ ఇప్పుడు జరిగిన సంఘటనలా లేకపోతే జరిగి చాలా రోజులైందా? ఇంకా జరుగుతూనే ఉన్నాయా? జరుగుతూనే ఉండి ఉండాలి. అందుకు నిదర్శనం తన కొడుకు కనిపించకుండా పోవడం. ఇప్పుడిక్కడ అతనికి సంబంధించిన ఆనవాళ్ళు కనబడడం'.

ఆపై ఆలోచించలేకపోయాడు.

ఇక వేరే గదులన్నీ తిరిగే ఓపిక కూడా అతనిలో నశించింది. నీరసం ఆవహించింది. అయినా శక్తినంతా కూడదీసుకుని నిస్సత్తువగా మెల్లగా లేచాడక్కణ్ణుంచి. కొడుకు దుస్తులు, అతని చేతి గడియారం తీసుకుని మెల్లగా బయటికి నడిచాడు. ఈ భవంతి మర్మమేమిటో ఎవరికి తెలుస్తుంది? ఎవరిని అడగాలి అన్నదే అతని ఆలోచన. ఆలోచనల్లోనే సుమో కొండమీదికి చేరుకుంది.

వెనక్కు తిరిగి చూస్తే దూరంగా హవేలీ కనబడుతోంది. పక్కనే కాస్త దూరంగా చిన్న గ్రామం! ఏదో ఆలోచన వచ్చినవాడిలా దివాకర్ రక్కున సుమో డ్రైవర్ భుజం పట్టుకున్నాడు బండి ఆపమనేందుకు చిహ్నంగా. కీచుమన్న శబ్దంతో సుమో ఆగింది. సరిగ్గా పాక హోటల్ ముందు. హఠాత్తుగా బండి ఆగడంతో హోటల్ ఓనర్ మళ్ళీ వీళ్ళ వంక బిక్కుబిక్కుమంటూ చూడసాగాడు.

కొద్దిసేపు తీక్షణంగా గ్రామం వైపే చూసిన దివాకర్, డ్రైవర్‌కు గ్రామం వంక చేయి చూపాడు. అర్థం చేసుకున్న డ్రైవర్ వెంటనే సుమోను సర్రున గ్రామంలోనికి తిప్పాడు.

దుమ్ములేపుకుంటూ వచ్చి ఆగిన బండిని చూసిన గ్రామ ప్రజలు పదిమంది సుమోను చుట్టుముట్టారు. దివాకర్ దిగి అందరివంకా చూశాడు.

"మీలో ఎవరికైనా ఆ హవేలీ గురించి తెలుసా?"

రెండు నిమిషాల అనంతరం అతనడిగిన ప్రశ్న అక్కడ భయంకరమైన మౌనాన్ని ఆవిష్కరించింది. చుట్టూ చేరిన వాళ్ళు ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

అసహనంగా అందరివంకా చూస్తున్న అతనికి అంతకంతకూ మౌనాన్ని భరించడం కష్టమై "చెప్పండి" అంటూ బిగ్గరగా అరిచాడు దివాకర్‌రెడ్డి.

ఆ అరుపుతో ఉలిక్కిపడ్డారందరూ. అయినా ఎవరూ నోరు విప్పేట్టు కనబడలేదు.

"హవేలీ చూస్తే పాడుబడ్డదిలా ఉంది. అందులో జనసంచారమే లేదు. అయితే అక్కడెవరో తిరుగుతున్న ఆనవాళ్ళు ఉన్నాయి. ఎవరా రవీంద్రవర్మ? ఎక్కడున్నాడు? చెప్పండి" అంటూ మళ్ళీ గట్టిగా అరిచాడు. అయితే ఫలితం శూన్యం.

"వాడు నా కొడుకును చంపేశాడు" దాదాపుగా ఏడుపు కలగలసిన జీరగొంతుతో ఆక్రోశాన్ని అణుచుకోలేని పరిస్థితిలో అరిచాడు దివాకర్ రెడ్డి మళ్ళీ.

**కొడుకు జాడ కనిపెట్టేందుకు దృఢకాయులైన అనుచరుల్ని వెంటబెట్టుకుని ప్యాలెస్‌లోకి ప్రవేశించాడతను. ఆ ప్యాలెస్ అందం చూసి ఆశ్చర్యపోయాడు. చిన్న గ్రామంలో ఇంత గొప్ప మహారాజా ప్యాలెస్ ఉందా? అనుకున్నాడు. వాళ్ళందరూ తలో దిక్కూ వెళ్ళి అన్ని గదులూ వదలకుండా వెతకడం మొదలెట్టారు. చీకటి దారిలో మెట్లెక్కి పై అంతస్తులోకి వెళ్ళాడతను. అంతలోనే గోడమీద అతడికి ఏదో కనిపించింది. భయంతో కేకపెట్టాడు. ఇంతకీ అతడికి కనిపించినదేమిటి? ఎందుకలా కేక పెట్టాడు?**

గ్రామస్థుల్లో కొద్దిగా చలనం కలిగినట్టనిపించింది. గుసగుసలు మొదలయ్యాయి. అంతలో గుంపును చీల్చుకుని ఒక పెద్ద మనిషి ముందుకొచ్చాడు. చూస్తే దాదాపు యాభై ఏళ్ళ పైబడ్డవాడిలా కనిపిస్తున్నాడు.

"ఆ హవేలీలో ఎవరూ ఉండరయ్యా. అదంతా నీ భ్రమ".

అర్థం కానట్టు అయోమయంగా అతని వైపు చూశాడు దివాకర్.

"దాదాపు ఏడెనిమిది నెలల నుంచీ అక్కడెవరూ ఉండడం లేదు. దాని యజమాని రాజా విజయేంద్రవర్మ చనిపోయాక ఆయన కొడుకు రవీంద్రవర్మే అక్కడ ఒంటరిగా ఉంటూ ఉండేవాడు. అతను చనిపోయి కూడా దాదాపు ఆరు నెలలు కావస్తోంది. అయితే అప్పుడప్పుడు ఆ భవంతిలో నుంచి ఏవో అరుపులు, శబ్దాలు వినిపిస్తుంటాయి. ఏవో ఆత్మలని చెప్పుకుంటూ ఉంటారు. అంతే తప్ప అక్కడేం జరుగుతోందో ఎవరికీ తెలియదు. తెలుసుకోవాలని మీలాగా వచ్చిన ఒకరిద్దరు మళ్ళీ కనబడకుండా పోయారు. మీ అదృష్టం బాగుండి మీరు ముందుగా అక్కడికెళ్ళకుండా ఇక్కడికి వచ్చారు. మా మాట విని ఇటు నుంచి ఇటే ఊరికివెళ్ళండి. లేకుంటే ఆ ఆత్మలు మిమ్మల్ని కూడా పీక్కుతినేస్తాయి" అన్నాడు ఆ పెద్దాయన.

అతని మాటలు నమ్మశక్యం కాకున్నా భయం కలిగించాయి.

"రెండు రోజుల క్రితం ఎవరో రవీంద్రవర్మ అనే అతను మా అబ్బాయికి ఫోన్ చేసి ఇక్కడికి రమ్మన్నాడట. అలాంటిది అతనిక్కడ లేకుండా ఎలా పోతాడు?"

"మేం చెప్పాల్సింది చెప్పాం. ఆ తరువాత మీ ఇష్టం. చనిపోయిన మనిషి ఫోన్ చేశాడంటే ఎలా నమ్మడం? రాజా విజయేంద్రవర్మ మా దైవం. ఆయన గురించి, ఆయన కుటుంబం గురించి మాకు తెలీదా? అహర్నిశలూ ఇక్కడే ఉండే మాకు కాక బయట నుంచి వచ్చినవాళ్ళకు ఇక్కడి సంగతులు తెలుస్తాయా? రవీంద్రవర్మ మంచివాడు కాదన్న మాట నిజమే. అయితే అతను చనిపోయి కూడా ఆరు నెలలైంది. ఎలా ఫోన్ చేస్తాడు?" హేళనగా మాట్లాడాడు పెద్దాయన.

దివాకర్ ఏమీ మాట్లాడలేకపోయాడు.

"చూడు బాబూ, నా పేరు గోపాలరావు. ఎస్సైగా పని చేస్తున్నాను. ఈ గ్రామంలోనే ఉంటాను. ఈ మధ్యనే ఉద్యోగరీత్యా ఇక్కడికి వచ్చాను. ఇక్కడి వాళ్ళందరూ ఇక్కడి పొలాల్లో పనిచేసే కూలీలు, రైతులు. అందరూ రాజా విజయేంద్రవర్మ మనుషులే. ఒక రకంగా చెప్పాలంటే ఆయన కుటుంబమే ఇదంతా. కన్నబిడ్డల్లా చూసుకుంటున్న ఆయన పోయాక అధికారం కొడుకు రవీంద్రవర్మ చేతికొచ్చింది. కానీ అందులో అనురాగం, ఆప్యాయతలు కరువయ్యాయి. అతనికెన్నో దుష్టశక్తులతో

# సన్నీ అదృష్టమే అదృష్టం

పోర్న్ స్టార్‌గా అడుగుపెట్టినా బాలీవుడ్‌లో స్టార్ హీరోయిన్ రేంజ్‌కి చేరుకుంది సన్నీలియోన్. సన్నీ ఈ స్థాయికి రావడానికి కారణం ఆమె అదృష్టమే అంటారు ఆమె సన్నిహితులు. బాలీవుడ్‌లో స్టార్ హీరోలతో వరుసగా జతకడుతున్న సన్నీకి మరో బంపర్ ఆఫర్ దక్కింది. ఆమె జీవిత కథ ఆధారంగా బాలీవుడ్‌లో ఓ సినిమా రూపొందుతున్న సంగతి తెలిసిందే! ఈ సినిమాలో సన్నీ క్యారెక్టర్‌కు తగ్గ నటి ఎంతకీ దొరకక పోవడంతో ఆ క్యారెక్టర్‌ని సన్నీ చేత చేయించాలని దర్శకనిర్మాతలు డిసైడ్ అయ్యారట! ఈ విషయం సన్నీకి చెబితే ఎగిరి గంతేసి మరీ ఒప్పుకుందట! తన జీవిత కథలో తనే నటించడం అంటే మామూలు విషయం కాదు అని మురిసిపోతోందట! సన్నీ భర్త క్యారెక్టర్‌ని కూడా ఆమె భర్తే చేస్తుండడం మరో ట్విస్ట్.



సంబంధం ఉండేది. వాళ్ళనే అతను 'స్నేహితులు' అని పిలిచేవాడు. ఆ స్నేహితుల చేతుల్లో పడి ఎంతోమంది అమాయకులు బలయ్యారని చెప్పుకుంటారు. అతని పనులు నచ్చక నేను చేసిన ఫిర్యాదువల్లే పోలీసులు వచ్చి ఆ భవంతిలో సోదాలు చేశారు. ఎస్సై రమణమూర్తి ఆధ్వర్యంలో నలుగురైదుగురితో ఒక బృందం వచ్చి సోదాలు నిర్వహించింది. విచారణ చేపట్టింది. అయితే అందువల్ల ఏమీ ప్రయోజనం కలగలేదు. అందుక్కారణం అతనికున్న పరిచయాలు. దీనంతటికీ కారణం నేనేనని తెలుసుకుని అతను నా మీద కూడా కక్ష కట్టాడు. రెండు మూడు సార్లు దాడులు జరిపేందుకు ప్రయత్నించాడు. నాకేమైనా ఫరవాలేదు. అయితే నా కూతురు కూడా మిగతావాళ్ళలా నాశనమై పోగూడదన్న భయంతో అప్పట్నుంచీ నేను కూడా చూసీ చూడకుండా ఉండిపోయాను. డిపార్టుమెంట్లో ఉంటూ ఇలా చూస్తూ ఊరుకోవడం నాక్కూడా ఎబ్బెట్టుగా ఉండేది. ఏం చేద్దాం? బతకాలంటే అదొక్కటే మార్గం. ఇప్పుడిక ఎలాగూ అతను లేడు. కాబట్టి ఈ గ్రామంలో అందరూ హాయిగా ఉన్నారు" అన్నాడు చిన్నగా నిట్టూరుస్తూ.

అతని మాటలు విన్న దివాకర్ స్థాణువయ్యాడు. అవన్నీ నమ్మాలా వద్దా అన్న సంశయం మెదడును తొలిచేస్తోంది. అయితే మరి రాఘవ బాబుకు వచ్చిన ఫోన్ కాల్ ఎవరిది? ప్రస్తుతం దాన్ని ఆరా తీయాలి. దిక్కు తోచని స్థితిలో ఉండిపోయాడు దివాకర్.

ఇక అక్కడ ఉండి ప్రయోజనం లేదని అర్థమైపోయింది దివాకర్‌కు. వెంటనే తిరుగు ప్రయాణం కట్టాడు అనుచరగణంతో సహా.

అరకు చేరుకున్న వెంటనే ఇంటికి కూడా వెళ్ళకుండా ఎస్సై రమణమూర్తిని కలిసేందుకు వెళ్ళాడు దివాకర్. ఆ ప్రదేశంలో ఒక బిల్డర్‌గా, గ్రానైట్ కంపెనీ ఓనరుగా, పెద్దమనిషిగా దివాకర్ అందరికీ తెలుసు.

దివాకర్‌రెడ్డిని చూడగానే చిరునవ్వుతో ఎదురొచ్చి "రండి సార్. ఏమిటిలా వచ్చారు హఠాత్తుగా?" అన్నాడు రమణమూర్తి వినయంగా.

అతని రాక రమణమూర్తి మనసులో ఏదో సందేహాన్ని రేపుతోంది.

"మా అబ్బాయి రెండ్రోజులుగా ఇంటికి రాలేదు. ఎక్కడికెళ్ళాడో తెలియలేదు. మీరేమైనా సహాయం చెయ్యగలరేమోనని వచ్చాను" అన్నాడు.

"పాతికేళ్ళ కొడుకు ఇంటికి రాకపోవడమంటే స్నేహితులతో కలిసి తిరుగుతూ లైఫ్ ఎంజాయ్ చేస్తుంటాడు. డోంట్ వర్రీ సర్. వచ్చేస్తాడు".

**మధ్యయుగంలో జంతువుల్ని కూడా న్యాయస్థానానికి రప్పించి విచారించి మరణశిక్షలు విధించేవారు.**

'కనీసం ఫోనన్నా చెయ్యలేదే. అందుకే ఆందోళన".

"పోనీ ఎక్కడికెళ్ళాడో ఐడియా ఉందా?"

"వాళ్ళ ఫ్రెండెవరో రవీంద్రవర్మ అనే అతన్నుంచి ఫోనొస్తే వెళ్ళాడట. మా వాళ్ళు చెప్పారు" అన్నాడు ఓరగా రమణమూర్తి వంక చూస్తూ.

రవీంద్రవర్మ పేరు వినగానే అతను నిటారుగా అయ్యాడు. కొద్దిగా బెదిరిన వాడిలా చుట్టుపక్కల చూశాడు. ఇవేవీ దివాకర్ దృష్టిని దాటిపోలేదు.

"ఎక్కడైనా, ఎన్నిరోజులైనా తిరగనీ, నాకభ్యంతరం లేదు. కాస్త అప్పుడప్పుడు ఫోన్ చేస్తూ ఉంటే కాస్త ప్రశాంతంగా ఉంటుంది మనసుకు" అన్నాడు అతన్నే గమనిస్తూ.

"అవునవును... నిజమే..." అన్నాడు కాస్త తడబడుతూ.

"ఇక్కడ పక్కనే కొండలోయ ప్రాంతంలో రత్నగిరి అనే సంస్థానం ఉందట. నిజమేనా?" దివాకర్ నోట ఆ ప్రశ్న విన్న రమణమూర్తి నిజంగానే తన ఉలికిపాటును దాచుకోలేకపోయాడు.

"ఏంటలా భయపడుతున్నారు?" అన్నాడు దివాకర్ ఏమీ తెలియనట్టుగా.

"ఉందిగానీ, చాలామందికి దాని గురించి తెలియదు సర్. ప్రస్తుతానికి దాని గురించి తెలుసుకోకుండా ఉండటమే మంచిది".

"ఇంతకూ రవీంద్రవర్మ ఎవరు?"

"ఆ సంస్థానం యజమాని విజయేంద్ర వర్మకు లేక లేక కలిగిన కొడుకే".

"అయినా ఈ కాలంలో ఇంకా సంస్థానాలేమిటి?"



"మీరన్నది నిజమే. ఆ సంస్థానం యజమాని విజయేంద్రవర్మ. వెయ్యెకరాలకు పైగా సొంత జాగీరు తాతల కాలం నుంచి వస్తున్న వంశ పారంపర్య ఆస్తి. దాన్ని మొత్తం తన పేర కాకుండా సగానికి పైగా గ్రామ ప్రజల పేరున ఉంచాడు. అందువల్ల ఎవరూ ఏమీ అడగలేని పరిస్థితి. పైగా అక్కడి ప్రజలు ఏ విషయానికీ మన ప్రభుత్వాల మీద, ప్రభుత్వ అధికారుల మీద ఆధారపడరు. వాళ్ళ బాగోగులన్నీ చూసేది, అవసరాలను తీర్చేది విజయేంద్రవర్మ. నిజంగా అతనొక రాజు. వాళ్ళు ప్రజలు. అదొక రాజ్యంలా అనిపిస్తుంది".

"అయితే సమస్యేమిటంట?"

"ఆయన గతించాక అక్కడ కొన్ని అరాచక శక్తులు చేరి ఆ హవేలీని నాశనం చేశాయని చెప్తారు. అంతకు మించి వివరాలేవీ తెలియవు".

"మరి అక్కడేవో సోదాలు జరిగాయని చెప్తూ ఉంటే విన్నాను. దేనికట అవన్నీ".

"అక్కడేవో డ్రగ్స్ చేతులు మారుతున్నాయని ఒక పుకారు వచ్చింది. అందువల్ల అక్కడికి వెళ్ళి విచారణ జరపవలసి వచ్చింది".

"ఇంతకూ విచారణలో తేలిందేమిటి?"

"కేసు ఇంకా తేలలేదు".

అతను అసలు విషయం చెప్పడం లేదన్నది దివాకర్ అర్థం చేసుకున్నాడు. ఇక రెట్టించి ప్రయోజనం లేదని కూడా అర్థమైంది. తాను వాళ్ళ దృష్టిలో కేవలం ఒక ఛోటా వ్యాపారి. అందువల్ల సమాచారం పూర్తిగా రాదన్న విషయం అతనికి ముందే తెలుసు. బడాబడా వ్యాపారులు, నేతలకు తప్పితే మిగతావాళ్ళకు సమాచారం అందదన్న విషయం అతనికి తెలియనిది కాదు. అందువల్ల మౌనం వహించి అక్కణ్ణుంచి లేచాడు.

అయితే విచిత్రంగా రమణమూర్తి ప్రస్తుతం తనకు మితిమీరిన మర్యాదనిస్తున్నాడు. అతను లేవగానే అతనితోబాటుగా లేచి బయటివరకూ వచ్చి సాగనంపాడు.

***(ఇంకావుంది)***



## సరదాగా

### ఒక ప్రశ్న?

అర్ధరాత్రి.. హోరున వర్షం.. సమయం రెండు గంటలు. ఎటు చూసినా చిమ్మచీకటి. అంతటా నిశ్శబ్దం. వర్షంపడుతున్న శబ్దం మాత్రమే విని పిస్తోంది. వర్షపునీటితో రోడ్లు నదిని తలపిస్తు న్నాయి. ఇంతలో ఆ వీధిలోకి ఓ వాహనం ప్రవే శించింది. ఓ ఇంటిముందు ఆగింది. నెమ్మదిగా ఆ వాహనంలోంచి రఘు, వాణి దిగారు. ఆ ఇంటిని సమీపించారు. వారికి తెలుసు గేటుకు తాళం వేయలేదని! చప్పుడు చేయకుండా గేటుదాటి మెయిన్‌డోర్ దగ్గరకు చేరుకున్నారు. అంతేకాదు ఆ ఇంట్లో కుక్కలు గట్రా లేవని కూడా వాళ్ళకు తెలుసు. ఒకరినొకరు చూసుకుంటూ మెల్లగా తలుపు తీశారు. తలుపులకు తాళం కూడా లేదు. ఒక నిమిషం తరువాత ఇద్దరూ ఇంటిలోపల ఉన్నారు. రెండు అడుగులు వేశారో లేదో గాలికి తలుపు ధడాలున మూసుకుంది. ఆ శబ్దానికి వారి గుండె గొంతులోకి జారింది. తలుపు వేసి రానందుకు ఇద్దరూ తిట్టు కున్నారు. సైలెంటుగా వెనక్కి వెళ్ళి తలుపు వేసి వచ్చాడు రఘు. ఒక్క నిమిషం ఎటూ కదలకుండా అలా నిలబడిపోయారు, ఒకవేళ చప్పుడుకి ఇంట్లో నిద్రపోతున్నవాళ్ళు లేచారేమోనని! అలా జరిగితే ఇంకేమైనా ఉందా? ఇద్దరూ చప్పుడు చేయకుండా బెడ్రూంలోకి వెళ్ళారు. అక్కడ బెడ్‌పై పడుకున్న ఇద్దరూ మంచి నిద్రలో ఉన్నారు. పక్కగదిలోంచి ఓ ముసలావిడ గురక పెడుతోన్న శబ్దం విని పిస్తోంది. బాత్‌రూం తలుపు పక్కనే గోద్రెజ్ అల్మారా కనిపించింది. రఘు నిద్రపోతున్న వాళ్ళని గమనిస్తోంటే, వాణి అల్మారా తెరిచే పనిలో పడింది. ఇంతలో పెద్దగా అలారం మోగిన సౌండ్! వెంటనే అలారం వైపు దూకి దాన్ని ఆఫ్ చేశాడు రఘు. ఏమాత్రం శబ్దం చేయకుండా అల్మారా తెరిచి అందులో ఉన్న నోట్లకట్ట తీసుకుని రఘుకిచ్చింది వాణి. వెంటనే దాన్ని తీసుకుని బయటకు పరి గెత్తాడు రఘు. వాణి లోపలే ఉండిపోయింది. రఘు బయటికెళ్ళి, తనకోసమే ఎదురుచూస్తున్న వాహనం డ్రైవర్‌కి నోట్లు తీసి ఇచ్చాడు. వర్షంలో తడుస్తున్నా లెక్కచెయ్యలేదు. వాహనం డ్రైవర్ నోట్లు తీసుకోగానే ఒక్కక్షణం ఆలస్యం చేయకుండా రయ్యి మని వాహనాన్ని స్టార్ట్ చేసి ముందుకు దూకించాడు. రఘు అక్కడే ఉండిపోయాడు. వాహనం మలుపు తిరిగిందాకా చూసి మళ్ళీ వెనక్కి తిరిగి ఇంట్లోకి వెళ్ళాడు. అసలేం జరుగుతోంది అక్కడ? ఊహించ గలరా? చెప్పగలరా? ప్రయత్నించండి.

**-యండమూరి వీరేంద్రనాథ్**

---

**సమాధానం**

వర్షం పడుతున్న ఆ రాత్రి భార్యాభర్తలైన రఘు, వాణి సినిమాకి వెళ్ళారు. పిల్లలిద్దర్నీ రఘు వాళ్ళ అమ్మగారికి అప్పచెప్పారు. సినిమా అయ్యాక ఇంటికి క్యాబ్‌లో వచ్చారు. చిల్లర లేకపోవడంతో, పిల్లలు నిద్రలేస్తారన్న ఉద్దేశంతో చప్పుడు చేయకుండా ప్రవేశించి, డబ్బులు తీసుకుని డ్రైవర్‌కి ఇచ్చి ఇంట్లోకి వెళ్ళిపోయాడు రఘు. అదీ జరిగింది.

# అడపా దడపా నవ్వుల్బా

Jayadev












# కుంభకర్ణుని కథ: వానరుల వ్యథ

**యుద్ధం కోసం కుంభకర్ణుణ్ణి నిద్రలేపారు మంత్రులు. ఇష్టమైన ఆహారాన్ని అతనికి అందించి, ఆరగించమన్నారు. అప్పుడు అసలు విషయం చెప్పారు. రాముడు చేతిలో రావణుడు ఓడిపోయాడన్నారు. రాముణ్ణి గెలవాలంటే మీరే దిక్కని, అందుకే నిద్రలేపామని అన్నారు. రావణుని దగ్గరకు అతన్ని తోడుకుని వచ్చారు. జరిగిందంతా కుంభకర్ణునికి వివరించాడు రావణుడు. మహావీరులంతా మరణించారన్నాడు. ఒకనాటి సభలోని చర్చలూ, విభీషణుని సలహాలూ కుంభకర్ణునికి అప్పుడు గుర్తుకొచ్చాయి. ఆనాడు రాక్షసజాతి క్షేమం కోసం సీతాదేవిని రామునికి అప్పగించమన్నాడు విభీషణుడు. వినలేదు రావణుడు. ఈనాడు ఆ మాటనే వల్లెవేశాడు కుంభకర్ణుడు. అన్న వింటాడని ఆశించాడు. వినలేదు సరికదా అందుకు ఆగ్రహించాడు రావణుడు.**

"కుంభకర్ణా! పొరపాటో, గ్రహపాటో జరిగిందేదో జరిగిపోయింది. ఇప్పుడు నాకు నువ్వు నీతులు బోధించనక్కర్లేదు. మంచి చెడులు నాకన్నా నీకు బాగా తెలుసనుకోవడం అవివేకం. సీతను అపహరించి తెచ్చేశాను. తిరిగి ఇవ్వడం జరగదు. ఇంత జరిగాక భీరువులా కూర్చోలేను. చావో రేవో తేలిపోవాల్సిందే! అన్నను అని నా మీద నీకు ఏమాత్రం అభిమానం, అనురాగం ఉన్నా నాకోసం నువ్వు యుద్ధం చెయ్యి. లేదంటే నీ ఇష్టం. ఒక్కమాట గుర్తుపెట్టుకో! ఆపదలో ఉన్నప్పుడు ఆదుకునేవాడే బంధువు." అన్నాడు రావణుడు. తమ్ముణ్ణి చూడడం ఇష్టం లేనట్టుగా అటు తిరిగి నిల్చున్నాడు.

కానున్నది కాక మానదు. కావాలని మృత్యు కుహరం వైపు పరుగుదీస్తున్నవాణ్ణి ఆపినా ఆగడు. ఆపాలని ప్రయత్నించడం అవివేకం అనుకున్నాడు కుంభకర్ణుడు. ప్రస్తుత పరిస్థితికి తాను తగ్గి ప్రవర్తించడమే మంచిదనుకున్నాడు. రావణునితో అన్నాడిలా.

"అన్నా! నువ్వు ఇక భయపడనవసరం లేదు. ఇదిగో! ఇప్పుడే ఈ క్షణమే నేను యుద్ధరంగానికి బయల్దేరుతున్నాను. రాముడు నన్ను ఓడించడం కల్ల. గెలుపు మనదే."

ఆ మాటకి ఆనందంగా ఇటు తిరిగాడు రావణుడు. కుంభకర్ణుణ్ణి ప్రేమగా చూశాడు.

"యమునిలా యుద్ధరంగంలో ప్రవేశిస్తాను. ఆయుధాలు కూడా అక్కరలేదు. ఆ రామలక్ష్మణ, సుగ్రీవుల్ని బలమైన ఈ చేతులతో పిసికి పిసికి ముద్దలు చేస్తాను. ఆ ముద్దల్ని ఆకాశంలోకి విసురుతాను. ఆ వానర సైన్యాన్ని వందలు వేలాదిగా మింగి జీర్ణించుకుంటాను. కుంభకర్ణుడంటే నిద్రపోతు కాదు, మహావీరుడు అని నిరూపించుకుంటాను." అన్నాడు కుంభకర్ణుడు.

"భళా! తమ్ముడంటే నువ్వు! నీలా ఉండాలి." అన్నాడు రావణుడు. కుంభకర్ణుణ్ణి సమీపించాడు.

"తమ్ముడూ! ఆయుధాలు అవసరం లేదనకు. తీసుకెళ్ళు. శత్రువులు సామాన్యులు కారు. నా మాట విను." అన్నాడు రావణుడు.

"సరే" అన్నాడు కుంభకర్ణుడు. తన మాటను కాదనడం లేదు. తను చెప్పిందానికి 'సరే' అంటున్నాడు. తమ్ముడంటే కుంభకర్ణుడు అనుకున్నాడు రావణుడు. ఆనందించాడు. ఆ ఆనందంలో తన మెడలోని రత్నహారాన్ని తీసి, కుంభకర్ణుని మెడలో వేశాడు. అలాగే భుజకీర్తులూ, హారాలూ స్వయంగా అలంకరించాడు. పరిమళించే పుష్పమాలలూ, పట్టువస్త్రాలూ ఇచ్చి సత్కరించాడతన్ని.

చందనాన్ని పూసుకున్నాడు కుంభకర్ణుడు. స్వర్ణ కవచాన్ని ధరించాడు. అన్నను సమీపించాడు. అతనికి ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. ఆశీస్సులందుకున్నాడు. తమ్ముణ్ణి ఆశీర్వదిస్తూ అతన్ని గట్టిగా కౌగిలించుకున్నాడు రావణుడు.

"వెళ్ళిరా! విజయం సాధించి రా." అన్నాడు.

శూలాయుధాన్ని అందుకుని యుద్ధరంగానికి బయల్దేరాడు కుంభకర్ణుడు. రథ గజ తురగ పదాతి దళాలు శంఖ దుందుభులు మోగిస్తూ అతన్ని అనుసరించాయి. సైన్యసమేతంగా యుద్ధరంగానికి వెళుతున్న కుంభకర్ణునిపై పౌరులు లాజలూ, పువ్వులూ చల్లారు. జయజయధ్వానాలు చేశారు. ఆనందించాడు కుంభకర్ణుడు. అన్నాడిలా.

"పౌరులారా! మనకి ఎలాంటి అపకారం తలపెట్టని వానరసేనల జోలికి నేను పోను. నా జోలికి వస్తే మాత్రం వారిని వదలను. ఇకపోతే నా దృష్టంతా రామలక్ష్మణులపైనే! వారిని హతమార్చిగాని తిరిగి రాను."

"అంతే అంతే" అన్నారు పౌరులంతా. కరతాళ ధ్వనులు చేశారు.

ప్రాకారాన్ని సమీపించసాగాడు కుంభకర్ణుడు. అతను ప్రాకారాన్ని సమీపిస్తోంటే భూమి కంపించింది. ఉల్కలు రాలిపడ్డాయి. పక్షులు అప్రదక్షిణంగా తిరగసాగాయి. అపశకునాలవి. అయినా లక్ష్యపెట్టలేదు కుంభకర్ణుడు. ప్రాకారం దాటి సమరాంగణంలోనికి అడుగుపెట్టాడు. ఆకాశంలోనికి చొచ్చుకుని నిల్చున్న కుంభకర్ణుని భారీకాయాన్ని చూసి ఆశ్చర్యపోయాడు రాముడు. విభీషణుణ్ణి అడిగాడు.

"మిత్రమా! దీర్ఘకాయంతో, సైన్యాన్ని భయపెడుతున్న ఈ వీరుడెవడు?"

"అతడే కుంభకర్ణుడు. నా రెండవ అన్న. ఇంద్రుని ఓడించిన వాడు. ఇంత భారీకాయుడు ఈ భూమ్మీద మరొకడు లేడు. దైత్యులంతా తపశ్శక్తితో అజేయులైతే, ఈ కుంభకర్ణుడు స్వశక్తితోనే అజేయంగా నిలుస్తున్నాడు." అన్నాడు విభీషణుడు.

అలాగా అన్నట్టుగా చూశాడు రాముడు.

"కుంభకర్ణుని కథ చెబుతాను, విను స్వామీ" అన్నాడు విభీషణుడు. చెప్పసాగాడిలా.

"పుట్టడమే పెను ఆకలితో పుట్టాడు ఈ కుంభకర్ణుడు. పుడుతూనే చుట్టూ ఉన్న భూతజాలాన్ని మింగసాగాడు. అది చూసి లోకులు భయభ్రాంతులయ్యారు. వెళ్ళి ఇంద్రుణ్ణి ఆశ్రయించారు. అభయాన్నిచ్చి ఇంద్రుడు ఐరావతంపై వచ్చాడు. కుంభకర్ణుని మీద వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. దాని దెబ్బకి భూమి కంపించినట్టుగా అరిచాడు కుంభకర్ణుడు. కోపంతో ఎదురుగా ఉన్న ఐరావతం కోరనొకదాన్ని పీకి, దానితో ఇంద్రుణ్ణి పొడిచాడు. గుండెల్లో గుచ్చుకున్న కోరకి గిలగిలలాడిపోయాడు ఇంద్రుడు.

పెరిగి పెద్దవాడయ్యాడు కుంభకర్ణుడు. పెద్దవాడై ఆశ్రమాల్ని ధ్వంసం చేసి, మునులనూ, దేవగణాల్నీ హింసించసాగాడు. స్త్రీలను చెరపట్టసాగాడు. హింసనే శ్వాసగా చేసుకుని బతకసాగాడు. దేవతలది తట్టుకోలేకపోయారు. కుంభకర్ణుని అఘాయిత్యాలనూ, ఆగడాలనూ అరికట్టమంటూ మళ్ళీ ఇంద్రుణ్ణి ఆశ్రయించారు. తన నిస్సహాయత తెలియజేసి, వారితో పాటుగా వెళ్ళి బ్రహ్మను కలిశాడు ఇంద్రుడు. కుంభకర్ణుని ఆగడాలను చెప్పి, అతన్ని శిక్షించమని కోరాడు. అభయాన్నిచ్చాడు బ్రహ్మ. కుంభకర్ణుని చేర పిలిచాడు. వచ్చిన అతన్ని చూసి బ్రహ్మే గగుర్పాటుకి లోనయ్యాడు. చచ్చినట్టు పడి ఉండమని శపించాడు. ఫలితంగా బ్రహ్మ పాదాల ముందే కుంభకర్ణుడు కూలిపోయాడు. నిద్రలోనికి ఒరిగిపోయాడు. సంగతి తెలుసుకున్న రావణుడు పరుగున వచ్చాడక్కడికి.

'తాతా! చేజేతులా మనవడి ఉసురుతీయడం న్యాయమా? పూచి కాచే సమయాల్లో ఉమ్మెత్త మొక్కనైనా ఎవరూ పెరికి వేయరే! అలాంటిది మహాశూరుణ్ణి, వీరుణ్ణి ఇలా కూలగొట్టడం ధర్మం కాదు' అన్నాడు. ఏం మాట్లాడాలో బ్రహ్మకి తోచలేదు. ఆలోచనలో పడ్డాడు. అప్పుడు మళ్ళీ రావణుడు అడిగాడిలా.

'నీ శాపాన్ని నువ్వు వెనక్కి తీసుకోలేవు కాబట్టి ఓ పని చెయ్యి. కుంభకర్ణుని నిద్రకీ, తిండికీ విరామాన్ని అనుగ్రహించు.'

అప్పుడు సరేనన్నాడు బ్రహ్మ. అనుగ్రహించాడతన్ని.

'ఆరుమాసాలకు ఒకరోజు నిద్ర మేల్కొని ఈ కుంభకర్ణుడు అగ్నిలా భుజిస్తాడు.' అన్నాడు. అది మా రెండో అన్న చరిత్ర."

ముగించాడు విభీషణుడు.



కుంభకర్ణుని గురించి కూలంకషంగా తెలుసుకోవడంతో అతన్ని తేరిపారచూడసాగాడు రాముడు.

"రామా" పిలిచాడు విభీషణుడు. ఏమిటి అన్నట్టుగా చూశాడు రాముడు.

"నీ వీరత్వానికి రాక్షససైన్యం చాలా భాగం నశించింది. అంతటి సైన్యాన్ని పోగొట్టుకున్న రావణుడికి ఏం చేయాలో పాలుపోక నీతో యుద్ధానికి కుంభకర్ణుణ్ణి నిద్రలేపాడు." అన్నాడు విభీషణుడు. నవ్వాడు రాముడు.

"కుంభకర్ణుని భీకరాకారానికి మన వానరసైన్యం బెదిరిపోవచ్చు. వారు బెదరిపోకుండా అదొక బుట్టబొమ్మ అని ప్రచారం చేయడం మంచిది. ఏమంటావు?" అడిగాడు విభీషణుడు. రాముడు సమాధానం ఇవ్వనేలేదు. సైన్యంలో కలకలం మొదలైంది.

ఆరువందల ధనుస్సుల పొడవూ, నూరు ధనుస్సుల వెడల్పుతో ఉండి, రథచక్రాలంతటి కళ్ళతో యుద్ధరంగంలో నిలిచిన కుంభకర్ణుణ్ణి చూసి వానరులు భయంతో పరిగెత్తసాగారు. 'ఆగండి ఆగండి' అని అంగదుడు వారించినా ఎవరూ ఆగలేదు. పరుగు ఆపలేదు.

"వీరులారా! మీరిలా పరిగెత్తడం భావ్యమా? పరిగెత్తినంత మాత్రాన మృత్యువు నుంచి తప్పించుకోగలరా? భయపడుతున్నారు, పరిగెత్తిపోతున్నారని శత్రువు జాలి చూపిస్తాడనుకున్నారా? జాలి చూపించడుగాక చూపించడు. పైగా పిరికిపందలని అపనింద మోయాల్సి వస్తుంది. అపఖ్యాతితో జీవించడం మంచిదో, వీరస్వర్గాన్ని అలంకరించడం మంచిదో మీరే తేల్చుకోండి." అన్నాడు అంగదుడు. అతని మాటలు ఫలించాయి. వానరసైన్యం పరుగు ఆపి నిలిచింది. అదే అవకాశంగా అన్నాడిలా అంగదుడు.

"మీరు భయపడుతున్నట్టు మన ఎదుట ఉన్నది రాక్షసుడు ఎంత మాత్రం కాదు. అదొక బుట్టబొమ్మ. ఆ బొమ్మని పడగొట్టడం చాలా తేలిక. రండి! విజృంభించండి."

**వానరుల్ని శూలాయుధంతో పొడిచి పొడిచి చంపసాగాడు కుంభకర్ణుడు. శూలంతో గుచ్చి తీసి వారిని భక్షించసాగాడు. ఆ బీభత్సం చూసి సహించలేక ద్వివిదుడు యుద్ధానికి దిగాడు. కుంభకర్ణుడిపై అతడు విసిరిన కొండ గురితప్పడంతో హనుమ కలగజేసుకున్నాడు. ఆకాశం ఎత్తున శరీరాన్ని పెంచి యుద్ధం ఆరంభించాడు. అప్పుడు కుంభకర్ణుడు ఏం చేశాడు? వారిమధ్య యుద్ధం ఏ రీతిన సాగింది?**

బొమ్మట! పర్వాలేదైతే! దాన్ని పడగొట్టడం ఎంతసేపు? అనుకున్నారు వానరులు. పెద్దపెద్దచెట్లనూ, రాళ్ళనూ అందుకుని, కుంభకర్ణునిపై దాడి చేశారు. చెట్లతో మోదారతన్ని. రాళ్ళతో కొట్టారు. వాటికి కుంభకర్ణుడు కొంచెం కూడా చలించలేదు. పైగా అతనిపై ప్రయోగించిన ఆయుధాలన్నీ ముక్కలై ఎగరడాన్ని చూసి విస్తుపోయారు వానరులు. అలా విస్తుపోతున్న వానరుల్ని శూలాయుధంతో పొడిచి చంపసాగాడు కుంభకర్ణుడు. శూలాయుధానికి వందలు వేలాదిగా వానరులు గుచ్చుకుని హాహాకారాలు చేయసాగారు. హాహాకారాలు చేస్తున్న వానరుల్ని శూలం నుంచి వేరు చేసి, నోట్లో పెట్టుకుని మింగసాగాడు కుంభకర్ణుడు. ఆ బీభత్సాన్ని చూసి తట్టుకోలేకపోయాడు ద్వివిదుడు. కుంభకర్ణుణ్ణి మట్టుబెట్టేందుకు కొండనొకదాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు. దానిని కుంభకర్ణునిపైకి విసిరాడు. తప్పించుకున్నాడతను. దాంతో ఆ కొండ రాక్షససైన్యం మీద పడి చాలా మంది మరణించారు.

హనుమ కలుగజేసుకున్నాడప్పుడు. ఆకాశం ఎత్తున శరీరాన్ని పెంచాడు. దగ్గరగా ఉన్న చెట్లనీ, గుట్టలనీ అందుకుని వాటిని కుంభకర్ణునిపై విసరసాగాడు. వచ్చి పడుతున్న చెట్లనీ, గుట్టలనీ శూలాయుధంతో ముక్కలు చేయసాగాడు కుంభకర్ణుడు. చేసిన ముక్కల్ని అందుకుని వాటినే వానరసైన్యంపైకి ప్రయోగించసాగాడు. తనంత ఎత్తున ఉన్న కొండను చూశాడు హనుమ. దానిని పెకిలించాడు. కుంభకర్ణునిపైకి విసిరాడు. అంతెత్తు కొండ మీద పడడంతో కుంభకర్ణుడు చతికిలపడ్డాడు. గాయపడ్డాడు. శరీరం అంతా రక్తసిక్తం కావడంతో చూసుకుని రెచ్చిపోయాడు. చేతిలోని శూలాయుధాన్ని గురి చూసి హనుమపైకి విసిరాడు. వచ్చి గుండెల్లో గుచ్చుకున్నదది. దాంతో రక్తం కక్కుకుంటూ హనుమ నేలపై కూలిపోయాడు. హనుమ నేలనంటి పడి ఉండడాన్ని గమనించి, నీల, గవాక్ష, శరభ, గంధమాదన, ఋషభాదులు విజృంభించారు. పెద్దపెద్ద చెట్లనీ, రాళ్ళనూ కుంభకర్ణునిపైకి విసిరి, బాధించారతన్ని. పిడికిళ్ళతో పొడిచారు. కాళ్ళతో కుమ్మారు. తట్టుకున్నాడు కుంభకర్ణుడు. లేచి మోకాళ్ళు విసిరి, వారందరినీ గాయపరిచాడు. వానరవీరులంతా ఆ గాయాలకు స్పృహ కోల్పోయారు.

వీరులంతా నేలపాలవడాన్ని చూసి తట్టుకోలేకపోయారు వానరులు. కుంభకర్ణునిపైకి ఎక్కి అతన్ని పిడికిళ్ళతో పొడిచారు. గోళ్ళతో గిచ్చారు. కోరలతో చీల్చారు. చీకాకు కలిగించారు. భరించలేకపోయాడు కుంభకర్ణుడు. ఆగ్రహావేశాలతో ఊగిపోయాడు. రెండు చేతులూ జాచి దొరికిన కాడికి వానరుల్ని అందిపుచ్చుకుని వారినంతా అలాగే నోట పెట్టుకుని మింగసాగాడు. వానరులంతా కుంభకర్ణునికి ఆహారం కాసాగారు. కొందరు ఆహారం అవుతూ, మరికొందరు గాయాలపాలై నేల కూలుతూ వానరులంతా కుంభకర్ణుని చేతిలో అంతం అవుతోంటే...చూసి ఆనందించసాగారు రాక్షసులు. రణరంగాన ప్రవహిస్తున్న నెత్తురు శరీరానికి పూసుకుని, మాంసం ముద్దల్ని గాలిలోకి ఎగరేస్తూ వారంతా ఆటలాడుకోసాగారు.

**-అరణి**

## సౌభాగ్య చక్రం

ఆగస్టు 10 నుంచి
ఆగస్టు 16 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ప్రేమానుబంధాలు, ఆరోగ్యం, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ప్రియతముల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. విలువైన వస్తువుల కొనుగోలులో నాణ్యత గమనించాలి. 12,13,14 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. కీలక సమాచారం అందుకుంటారు. 15,16 తేదీల్లో చిన్నారులు, ప్రియతముల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. సృజనాత్మకంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, వేడుకలు, బదిలీలు, ఆర్థిక లావాదేవీలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. వేడుకలకు ఏర్పాట్లలో ఇబ్బందులు ఎదురవుతాయి. బృంద కార్యక్రమాలు ఉల్లాసం కలిగిస్తాయి. 12,13,14 తేదీల్లో ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థిక విషయాలు సమీక్షించుకుంటారు. ఆర్థిక సంస్థలతో పనులు పూర్తవుతాయి. 15,16 తేదీల్లో మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి శుభప్రదం.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన చర్చలు, వేడుకలు, విద్యా విషయాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సన్నిహితుల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఇంటర్వ్యూలలో నిరాశ ఎదురయ్యే అవకాశం ఉంది. వృత్తి, ఉద్యోగాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 12,13,14 తేదీల్లో సమావేశాల్లో పాల్గొంటారు. ప్రియతములతో సంభాషణలు ఉల్లాసం కలిగిస్తాయి. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. 15,16 తేదీల్లో ఆర్థికపరమైన చర్చలు ఫలించకపోవచ్చు. సోదరీసోదరుల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

స్పెక్యులేషన్లు, పెట్టుబడులు, షాపింగ్, విద్యా విషయాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల్లో అచితూచి వ్యవహరించాలి. ఫీజులు, బిల్లులు చెల్లింపుల్లో ఇబ్బందులు ఎదుర్కొంటారు. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. 12,13,14 తేదీల్లో వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయ రంగాల వారికి అనుకూల సమయం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. 15,16 తేదీల్లో షాపింగ్‌లో నాణ్యత గమనించాలి. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

విద్య, వృత్తి, వ్యాపారాలు, కొత్త ప్రాజెక్టులు, వేడుకలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులు. చేర్పుల కారణంగా అసౌకర్యానికి గురవుతారు. కుటుంబ వ్యవహారాలు ఆవేదన కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్ రంగంలోని వారు జాగ్రత్తలు పాటించాలి. 12,13,14 తేదీల్లో పొదుపు పథకాలు లాభిస్తాయి. వృత్తి విద్యా కోర్సుల్లో ప్రవేశం లభిస్తుంది. ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులు విజయం సాధిస్తారు. 15,16 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. వృత్తి, వ్యాపారాల్లో కొత్త వ్యూహాలు అమలు చేసి విజయం సాధిస్తారు.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, చిన్నారుల విషయాలు, జనసంబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో ఒక సమాచారం నిరాశ కలిగిస్తుంది. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. 12,13,14 తేదీల్లో మీ మనసు మార్పు కోరుకుంటుంది. రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి అనుకూలం. బదిలీలు, మార్పులకు సంబంధించిన సమాచారం అందుతుంది. 15,16 తేదీల్లో చిన్నారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభదాయకం.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

రియల్ ఎస్టేట్, బదిలీలు, విద్య, వృత్తి, వ్యాపారాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆర్థిక విషయాల్లో నిరుత్సాహంగా ఉంటుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. 12,13,14 తేదీల్లో సమావేశాలు, బృందకార్యక్రమాల్లో పాల్గొంటారు. విద్యా సంస్థలతో పనులు పూర్తవుతాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. విలువైన పత్రాలు అందుకుంటారు. 15,16 తేదీల్లో ఆర్థిక విషయాల్లో కుటుంబ సభ్యుల వైఖరి కలవరపెడుతుంది. బంధుమిత్రుల కలయికతో ఇల్లు సందడిగా ఉంటుంది.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, పెద్దలతో సమావేశాలు, కుటుంబ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో కొత్త పనుల ప్రారంభానికి తగిన సమయం కాదు. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. 12,13,14 తేదీల్లో అదనపు ఆదాయం సమకూర్చుకుంటారు. ఆర్థిక విషయాల్లో పెద్దల ప్రోత్సాహం లభిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 15,16 తేదీల్లో పెద్దలతో సమావేశాలు, చర్చల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. విద్యార్థులకు శుభప్రదం.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

ఆర్థికపరమైన సమావేశాలు, ప్రయాణాలు, విద్య, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో రాజకీయ, సినీ, బోధన, పర్యటన రంగాల వారి అంచనాలు తల్లకిందులయ్యే అవకాశం ఉంది. సమావేశాల్లో జాగ్రత్తగా వ్యవహరించాలి. 12, 13, 14 తేదీల్లో బంధుమిత్రులను కలుసుకుంటారు. కీలక సమాచారం అందుకుంటారు. విద్యార్థులకు అనుకూలం. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలించకపోవచ్చు. కొత్త వ్యూహాలు అమలు చేసి సత్ఫలితాలు సాధిస్తారు.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఆరోగ్యం, పెట్టుబడులు, షాపింగ్, విద్యా విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో సమావేశాలు, వేడుకల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. పెట్టుబడుల్లో నిదానం అవసరం. 12,13,14 తేదీల్లో రాజకీయ, సినీరంగాల వారికి అనుకూలం. ఆత్మావలోకనం చేసుకుంటారు. ప్రయాణాలు, ఉన్నత విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. 15,16 తేదీల్లో ఆరోగ్యం మందగిస్తుంది. పెట్టుబడులపై ఒక నిర్ణయానికి వస్తారు. గత అనుభవాలను నెమరు వేసుకుంటారు.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

దీర్ఘకాలిక పెట్టుబడులు, భాగస్వామ్యాలు, వేడుకలు, షాపింగ్‌లకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో పెద్దల కారణంగా చికాకులు ఎదుర్కొంటారు. గౌరవ ప్రతిష్ఠలకు భంగం కలిగే అవకాశం ఉంది. వివాహ నిర్ణయాల్లో తొందరపాటు తగదు. 12,13,14 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాలు, వేడుకల్లో కీలక పాత్ర పోషిస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 15,16 తేదీల్లో భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కుటుంబ సభ్యులతో ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి.



### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

విందులు, వేడుకలు, శ్రీవారు, శ్రీమతి విషయాలు, ఆర్థికపరమైన వ్యూహాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. బంధుమిత్రులతో విందుల్లో పాల్గొంటారు. 12,13,14 తేదీల్లో ఉన్నత పదవులు అందుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సహోద్యోగులు మొహమాట పెట్టే అవకాశం ఉంది. విందులు, వేడుకల్లో ఉల్లాసంగా పాల్గొంటారు.



## రాజమౌళి మెచ్చిన సినిమా

ప్రపంచమంతా ఆయన సినిమాను మెచ్చుకుంటుంటే ఆయనకి మాత్రం టాలీవుడ్‌లో ఇటీవలే విడుదలైన ఓ సినిమా తెగ నచ్చేసిందట! ఆ సినిమా పేరు పెళ్ళిచూపులు. చిన్న సినిమా అయినా తన మనసుకు బాగా నచ్చిందని రాజమౌళి అంటున్నారు. హీరో స్నేహితురాలు ప్రియదర్శిని పాత్ర మాటి మాటికి 'నా చావు నేను చస్తా, మీకెందుకు' డైలాగు తనకు చాలా చాలా బాగా నచ్చిందంటూ ట్వీట్ చేశాడు. దాంతో చిత్ర యూనిట్ పండగ చేసుకుంటోందట! మామూలుగానే ఈ సినిమాకు పాజిటివ్ టాక్ వచ్చింది. ఇక రాజమౌళి మెచ్చిన సినిమా అంటే దాని సక్సెస్ రేటు ఇంకా పెరుగుతుందని యూనిట్ సభ్యులు ఆనందంతో పండగ చేసుకుంటున్నారట.



## సుబ్బలక్ష్మికి రెహమాన్ నివాళి

ప్రముఖ గాయని సుబ్బులక్ష్మి ఎప్పుడో చనిపోయారుకదా? ఆమెకి రెహమాన్ ఇప్పుడు నివాళి అర్పించడం ఏమిటన్న అనుమానం వస్తోందా? సుబ్బులక్ష్మిగారి శత జయంతి వేడుకల సందర్భంగా ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యాలయంలో సంగీత దర్శకుడు ఏఆర్ రెహమాన్ పాటలు పాడనున్నారు. ఇదే ఆ ప్రముఖ గాయనికి రెహమాన్ అర్పించనున్న నివాళి. భారత స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ఆగస్టు 15వ తేదీన ఐరాసా ఆమెకు నివాళి అర్పించనున్నట్టు ఐరాస భారత రాయబారి తెలిపారు. 1966లో ఇదే రోజున ఇదే వేడుకలో సుబ్బులక్ష్మి ఐరాసాలో తన గాన మాధుర్యాన్ని వినిపించారు.




టాలీవుడ్‌లో ఉన్న క్రియేటివ్ డైరెక్టర్లలో కృష్ణవంశీ ఒకరు. ఆయన టాలీవుడ్‌కి వచ్చి చాలా ఏళ్ళే అయినా రెండు పదులకు మించి సినిమాలు తీయలేదు. అయినా ఆయన క్రేజ్ ఈ రోజుకీ ఏమాత్రం తగ్గలేదంటారు టాలీవుడ్ జనాలు. అలాంటి క్రియేటివ్ డైరెక్టర్ ఇటీవల చాలా ఓపెన్‌గా 'కొంతమంది'లా నక్క వినయాలు నటించడం తనకు చేతకాకపోవడం వలనే ఇన్ని సంవత్సరాలలో తక్కువ సినిమాలు చేశాననీ, నాతో సినిమాలు



## నక్క వినయాలు చేతకావట!

చేయడానికి నిర్మాతలు సిద్ధంగా లేరన్నది నూటికి నూరు పాళ్ళు అబద్ధం అంటూ కొట్టి పడేశారు. ఈ రోజుకీ తనతో సినిమా చేయడానికి చాలా మంది నిర్మాతలు ముందుకు వస్తున్నారని చెప్పుకొచ్చారు.

'కబాలి' చేసినందుకు గాను రజనీకాంత్‌కి ముట్టిన మొత్తం 80 కోట్లట! సినిమాకి మిశ్రమ స్పందన వస్తున్నా రజనీకి ఇంత మొత్తం ఎలా ఇచ్చారు? అనే అనుమానం వస్తోంది కదూ! ఈ



## రజనీ రెమ్యునరేషన్ 80 కోట్లు

సినిమాకు గాను రజనీకి మొదట 35 కోట్లు ఇచ్చారట! అనంతరం వసూళ్ళల్లో పర్సంటేజీ ఇస్తామని చెప్పారట! ఆ లెక్కన వసూళ్ళ మీద పర్సంటేజీ రూపంలో రజనీకి మరో 45 కోట్లు రానున్నాయట! అంటే ఈ సినిమా వల్ల రజనీకాంత్‌కి వచ్చింది 80 కోట్లుగా లెక్క కడుతున్నారు సినీ జనాలు.

## తెరపైకి కబాలి సీక్వెల్?



కొంతమంది దర్శకనిర్మాతలు తమ సినిమాలు ఫ్లాపయినా ఆ విషయాన్ని మరుగు పరచడానికి సినిమాకి సీక్వెల్ ఉంటుందంటూ ప్రచారం చేస్తుంటారు. ఈ విధంగా ఫ్లాప్ టాక్ ప్రభావం కొంత వరకైనా తగ్గుతుందన్నది ఒక స్ట్రాటజీ. సరిగ్గా ఈ స్ట్రాటజీనే ఫాలో అవుతున్నట్టుంది కబాలి నిర్మాత. కబాలికి సీక్వెల్ తీయడానికి తానూ, దర్శకుడూ సిద్ధంగా ఉన్నామనీ, అయితే రజనీ అంగీకరిస్తే త్వరలోనే సీక్వెల్ పనులు ప్రారంభిస్తామని ఇటీవల ఒక ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చారు. కబాలి ఫలితం ఏమిటో చిన్న పిల్లవాడిని అడిగినా చెప్పేస్తాడనీ, అలాంటిది ఇప్పుడు ఈ సీక్వెల్ మాటలకు అర్థమేమిటో? అని సినీ జనాలు విస్తుపోతున్నారు.

# ప్రయోగాలు చేయడం ఇష్టం!

సైజ్ జీరో అయినా... డబుల్ సైజ్ అయినా అనుష్క టాలెంట్ ముందు అవన్నీ బలాదూరే! లేడీ ఓరియెంటెడ్ చేసినా, చిలిపి అమ్మాయిగా చేసినా, అందంతో అలరించినా స్వీటీకి నూటికి నూరు శాతం మార్కులు పడాల్సిందే! గ్లామర్‌కైనా, చరిత్ర చెక్కిన శిల్పానికైనా కేరాఫ్ అడ్రస్‌గా నిలిచిందీ జేజమ్మ. చిలిపి తనంతో నవ్వించనూ గలదు... కత్తిపట్టి కదనరంగాన దూకనూ గలదు. 'సూపర్'గా తొలి సినిమా నుంచి సాగిపోతున్న అనుష్క సినీజీవిత విశేషాలు ఆమె మాటల్లోనే....

-అనుష



**'అరుంధతి' రాకపోయుంటే...**

'అరుంధతి' నా కెరీర్‌కి లాండ్‌మార్క్ లాంటిది. ఆ సినిమా చేయకపోయి ఉంటే కనుక ఇప్పటికీ పాటలకీ, గ్లామర్ పాత్రలకే పరిమితం అయి ఉండేదాన్నేమో! ఈ సినిమాతో అభిమానుల సంఖ్య బాగా పెరిగిపోయింది. అంతే కాదు లేడీ ఓరియెంటెడ్ సినిమాలకి అనుష్కే బెస్ట్ అనే పేరు కూడా సంపాదించుకోగలిగాను. మొదటి సినిమా 'సూపర్'తో కన్నా 'విక్రమార్కుడు' సినిమాతోనే ఎక్కువ గుర్తింపు లభించింది. ఆ సినిమా తరువాత ఇక వెనుతిరిగి చూసుకోవలసిన అవసరం లేకపోయింది.

**బిజీ బిజీగా...**

ఊపిరి పీల్చుకోలేనంత బిజీగా ఉంది జీవితం. నెలల పాటు కుటుంబానికి దూరంగా ఉండి పనిచేయవలసి వస్తోంది. 'బాహుబలి2', 'ఎస్ 3'(సింగం మూడో భాగం) సినిమాలతో బిజీగా ఉన్నాను. రెండు లేడీ ఓరియెంటెడ్ సినిమాలకు ఓకే చెప్పాను. అవి ప్రారంభం కావలసి ఉంది.

**బరువైన పాత్రలు...**

యువరాణి దేవసేన ఎంత బరువైన పాత్రో....నేను ధరించే నగలు అంతకన్నా బరువుగా ఉంటాయి. ఓ విధంగా చెప్పాలంటే ఇలాంటి పాత్రలు చేసి మెప్పించడం చాలా కష్టం. నగల భారంతో పాటు దుస్తులు కూడా బరువుగానే ఉంటాయి. ఇంత బరువుతో ఎండలో షూటింగ్ చేయడం కష్టం అనిపించినా, ఆ తరువాత లభించే ప్రేక్షకాదరణ తలుచుకుని ఆ కష్టాన్ని మర్చిపోతుంటాను. గ్లామర్ పాత్రలు చేయడం తేలికే కాకుండా సుఖంగా కూడా ఉంటుంది. నా అదృష్టం కొద్దీ నా కెరీర్‌లో విభిన్న రకాల క్యారెక్టర్లు చేసే అవకాశం నాకు లభించింది.

**లేడీ ఓరియెంటెడ్ సినిమాలు కష్టమే...**

కత్తి తిప్పడాలూ, యుద్ధం చేయడం వంటివి శారీరక శ్రమతో కూడినవే! సింపుల్‌గా సాగిపోయే క్యారెక్టర్లు చేయాలని నాకూ ఉంటుంది. అలా అనుకున్నప్పుడల్లా ఓ మంచి లేడీ ఓరియెంటెడ్ సబ్జెక్ట్ వస్తోంది. దాంతో మనసు మార్చుకుని అలాంటివే చేస్తున్నాను. కొంతకాలం ఇలాంటి పాత్రలకు దూరంగా ఉండాలని ఇటీవలే నిర్ణయించుకున్నాను. ఎంత మంచి పాత్ర వచ్చినా, ఎవరెంత ఒత్తిడి తీసుకు వచ్చినా సీరియస్‌గా ఉండే పాత్రలు చేయదల్చుకోలేదు.

**ఒత్తిడి ఎక్కువే...**

బరువైన పాత్రలు, లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చేస్తున్నప్పుడు ఒత్తిడి ఎక్కువగా ఉంటుంది. ప్రారంభంలో ఆ ఒత్తిడిని ఎలా తట్టుకోవాలో తెలిసేది కాదు. దీనికి ఓ చిట్కా కనుక్కున్నాను. కొద్దిగా తీరిక దొరికితే మంచి మంచి సామెతలను కలెక్ట్ చేసి ఓ బుక్‌లో రాసి పెట్టుకుంటున్నాను. బాగా ఒత్తిడి ఫీలయినప్పుడు వాటిని చదువుకుంటాను. దాంతో చాలావరకూ ఒత్తిడి నుంచి రిలీఫ్ లభిస్తోంది. కాకపోతే ఈ చిట్కా నా వరకూ బాగానే పనిచేస్తోంది. అందరినీ ఆచరించమని మాత్రం చెప్పలేను. దీని కోసం పెద్దగా కష్టపడక్కర్లేదు కాబట్టి మిగతావాళ్ళు కూడా ప్రయత్నించి చూడవచ్చు. ఒత్తిడి నుంచి రిలాక్స్ అయితే ఈ చిట్కాను ఫాలో అయిపోండి. లేకపోతే ఈ చిట్కాను మరిచిపోండి.

**కన్నీళ్ళు కార్చిన సందర్భాలు...**

హీరోయిన్లకు కష్టాలూ, కన్నీళ్ళూ

ఏం ఉంటాయని అందరూ అనుకుంటారు. మాకూ కష్టాలూ, కన్నీళ్ళూ ఉంటాయి. నేను చేసిన లేడీ ఓరియెంటెడ్ సినిమాలు చూసి ఆహో.. ఓహో అంటారు. కానీ దాని వెనుక ఉన్న కష్టం నాకు మాత్రమే తెలుసు. అలాంటి సినిమాలు చేసే సమయంలో మేకప్ కోసం గంటల తరబడి శ్రమ పడాల్సి వచ్చేది. దానికి తోడు షూటింగ్‌లోనూ కష్టమే ఉండేది! షూటింగ్ పూర్తి చేసి రాత్రికి ఇంటికి చేరితే ఒళ్ళంతా ఒకటే నొప్పులుగా ఉండేది. ఇంట్లో వారికి చెబితే బాధపడతారని నా గదిలో కూర్చుని ఏడ్చే దాన్ని. కుటుంబ సభ్యుల ముందు మాత్రం ఎప్పుడూ బ్యాలెన్స్ తప్పి ఏడవలేదు. ఒకటి రెండు సార్లు మాత్రం కన్నీళ్ళు ఆపుకోలేక పోయాను.



### కావాలనే చేశాను

ప్రయోగాలు చేయడం అంటే ఇష్టమే! కొన్ని సార్లు వాటితో కొన్ని ఇబ్బందులు కూడా ఉంటాయి. 'సైజ్‌జీరో' సినిమానే దీనికి మంచి ఉదాహరణ. ఈ సినిమా చేసే సమయంలో బరువు పెరగొద్దని అందరూ నన్ను వారించారు. సినిమా దర్శకనిర్మాతలు కూడా రిస్క్ తీసుకోవద్దని సలహా ఇచ్చారు. కానీ నేను రిస్క్ చేయాలనే నిర్ణయించుకుని బరువు పెరిగాను. బరువు పెరగడం తేలికే కానీ, తగ్గడం అంత సులభం కాదు. సడెన్‌గా బరువు తగ్గడం కూడా మంచిది కాదు. ఇదే విషయాన్ని బరువు పెరిగే ముందు డాక్టర్లు నాకు చాలా స్పష్టంగా చెప్పారు. సినిమా పూర్తయ్యాక పెరిగిన బరువు తగ్గడానికి కొన్ని నెలలు సమయం పడుతుంది. దానికి సిద్ధపడితేనే బరువు పెరగండని సలహా ఇచ్చారు. వారి సలహా అనుసరించే బరువు తగ్గుతున్నాను. చాలా మంది ఆపరేషన్ చేయించుకోవచ్చు కదా... ఎందుకింత కష్టపడడం అన్నారు. ఆపరేషన్ ద్వారా త్వరగా బరువు తగ్గుతాను కానీ ఆ తరువాత వచ్చే ఆరోగ్య సమస్యల నుంచి తప్పించుకోవడం కష్టం. అందుకే కృత్రిమ పద్ధతుల జోలికి పోలేదు.

### ఆహార నియమాలు

గతంలో పెద్దగా ఆహార నియమాలు పాటించేదాన్ని కాదు. అన్నిరకాలూ లాగించేస్తాను. అలాగని జంక్ ఫుడ్ జోలికి పెద్దగా పోను. ఉదయం బ్రేక్‌ఫాస్ట్ ఎట్టి పరిస్థితుల్లోనూ మిస్ కాను. ఆహారం ఎక్కువ తీసుకున్నా వ్యాయామం ద్వారా బ్యాలెన్స్ చేసుకునేదాన్ని. ఇప్పుడు మాత్రం వైద్యుల సలహా మేరకు ఆహార నియమాలు పాటిస్తున్నాను. మరీ కఠినమైన నియమాలు మాత్రం పాటించడం లేదు. ఎక్కడున్నా రాత్రి ఎనిమిది గంటల కల్లా డిన్నర్ ఫినిష్ చేయడం నాకు అలవాటు. అలాగే ఉదయం సమయంలో యోగా చేస్తాను. పై రెండు నియమాలు ఎట్టి పరిస్థితుల్లోనూ మిస్ చేసుకోను.

### డ్రింక్స్ అలవాటు లేదు

చాలామందికి కూల్‌డ్రింక్స్ తాగే అలవాటు ఉంటుంది. రకరకాల పళ్ళ ఫ్లేవర్లలో ఇవి లభిస్తుంటాయి. ఇవి ఆరోగ్యానికి అంత మంచిది కాదు. అలాగే సోడా కూడా. సోడా తాగితే లేనిపోని ఆరోగ్య సమస్యలు తలెత్తే అవకాశం ఉంది. అన్నిటికన్నా బెస్ట్ నీరే! వీలైనంత ఎక్కువ నీటిని తాగుతాను. నాకు తెలిసిన వారందరికీ కూడా ఎక్కువ నీరు తాగమని సలహా ఇస్తాను.

### నాలో నాకు నచ్చేది....

నా నవ్వు. అందరూ నన్ను అందగత్తె అంటూంటారు. నిజానికి శరీర ఆరోగ్యమే మనల్ని అందంగా ఉంచుతుంది. మనసును ఆనందంగా ఉంచుకోగలిగితే దాని ప్రభావం మన ముఖం మీద తప్పకుండా కనిపిస్తుంది. మనసులో రకరకాల కారణాలతో బాధపడుతూ పైకి అందంగా కనిపించాలంటే అస్సలు కుదరదు. కృత్రిమంగా తెచ్చుకున్న అందం ఎక్కువ సేపు ఉండదు కూడా. మనసును ప్రశాంతంగా ఉంచుకోగలిగితే చాలు అందరికన్నా అందంగా, ఆకర్షణీయంగా కనిపిస్తాం. ముఖం అందంగా కనిపించడానికి రకరకాల క్రీములు ఉపయోగిస్తుంటారు. ఇది అంత మంచి అలవాటు కాదు అన్నది నా అభిప్రాయం. కొన్ని రకాల క్రీముల కారణంగా చర్మ సౌందర్యం బాగా దెబ్బతింటుంది. వీటిని వాడే బదులు నీరు ఎక్కువగా తాగి చూడండి. చర్మం నిగనిగలాడుతూ ఉంటుంది.

### పెళ్ళి గురించి ఆలోచన లేదు

ఇప్పట్లో పెళ్ళి చేసుకునేటంత టైమ్ లేదు. ప్రస్తుతం చేతిలో ఉన్న సినిమాలు పూర్తయ్యేసరికి మూడు సంవత్సరాలు పడుతుంది. ఒప్పుకున్న సినిమాలు మరో రెండు ఉన్నాయి. ఇవి పూర్తి కావడానికి ఎలా లేదన్నా ఏడాది పడుతుంది. సో... మరో మూడు సంవత్సరాల వరకూ పెళ్ళి గురించి ఆలోచించే తీరిక లేదు. మా ఫ్యామిలీ మాత్రం ఒప్పుకోవడం లేదు. పెళ్ళి తరువాత కూడా సినిమాలు చేయవచ్చు కదా అంటున్నారు. ఇంకా దాని గురించి ఏమీ ఆలోచించలేదు.

-చిన్ని

## ఇల్లీకి మిగిలింది అవే

ఒకప్పుడు దక్షిణాదిన స్టార్ హీరోయిన్. అలాంటి హీరోయిన్ బాలీవుడ్‌కి వెళ్ళి జీరో అయిపోయింది. ఈ పాటికే ఆ హీరోయిన్ ఎవరో గుర్తుపట్టి ఉంటారు. ఇంకెవరు నడుం సుందరి ఇలియానా! బాలీవుడ్‌లో అరకొరా అవకాశాలు వస్తున్న సమయంలో విదేశీ లవర్‌తో టూర్లకు చెక్కెయ్యడంతో బాలీవుడ్ దర్శకనిర్మాతలు ఆమెను దాదాపు మరిచిపోయే పరిస్థితి వచ్చింది. విదేశీ మోజు నుంచి బయటపడి వాస్తవంలోకి వచ్చేసరికి ఒక్క ఆఫర్ కూడా లేకుండా పోయింది. ఇలా కాదు అనుకుని వరుసపెట్టి ఫోటోషూట్లు చేయించి ఫోటోలను విడుదల చేసినా లాభం లేకుండా పోయిందట! చివరికి ఇలియానా ఫోటోషూట్లతోనే కాలక్షేపం చేయవలసిన పరిస్థితి వచ్చేసిందట! చేజేతులా కెరీర్‌ని ఇంతలా నాశనం చేసుకున్న దక్షిణాది హీరోయిన్ ఇలియానా తప్ప మరొకరు ఉండరు అని ఆమె అభిమానులు సైతం ఆమె మీద విమర్శలు గుప్పిస్తున్నారు.



## ఇంటర్వ్యూ

**భక్త ప్రహ్లాద చిత్రంతో జాతీయస్థాయికి ఎదిగి నలభైతొమ్మిదేళ్ళ క్రితమే అవార్డు అందుకున్న నటి రోజారమణి. ఎస్వీ రంగారావుతో పోటాపోటీగా నటించి ఆబాలగోపాలాన్నీ మెప్పించారామె. పదమూడేళ్ళకే హీరోయిన్‌గా తొలి చిత్రానికి ఫిలింఫేర్ అవార్డు పొందారు. నలభైయేళ్ళుగా పలు భాషల్లో 130 చిత్రాల్లో నటించారు. 250 మంది నటీమణులకు డబ్బింగ్ చెప్పడమే కాదు, దాదాపు 50 అవార్డులు, రాష్ట్ర నంది పొందిన ఘనత కూడా సాధించారామె.**



# నిర్మాణంలో దర్శకుల అజాగ్రత్తవల్లే ఇన్ని ఫ్లాపులు

## -రోజా రమణి

కవులు, కళాకారులకు నిలయం రాజమండ్రి. మా మాతామహుల ఇంట అక్కడే జన్మించాను. మా నాన్నగారు సత్యం. అమ్మ మాలతీదేవి. మద్రాసులో 'సినిమారంగం' మాస పత్రికలో నాన్న సంపాదకులుగా పనిచేసేవారు. నాకు ముగ్గురు అన్నయ్యలు. మేం ముగ్గురు అక్కచెల్లెళ్ళం. అందరిలో చివరిదాన్ని నేనే.

### స్కూల్లో చేరాల్సిన రోజే షూటింగ్‌కి!

నా జీవితంలో జరిగిన ఒక అద్భుతం 'భక్త ప్రహ్లాద' చిత్రంలో అవకాశం లభించడం. 1966 అక్టోబరులో విజయదశమిరోజు పాఠశాలలో చేరాల్సినదాన్ని. కానీ 'భక్త ప్రహ్లాద' షూటింగ్‌కు వెళ్ళాను. ఏవీఎమ్ వారు ఆరోజే షూటింగ్ ప్రారంభించారు. 1967లో విడుదల చేశారు. ఏడాదికాలం కాంట్రాక్టు. చదువుకూడా చెప్పిస్తామన్నారు. ఏవీఎమ్ స్టూడియో వారే బాధ్యత తీసుకుని హిందీ, తెలుగు, ఇంగ్లీష లకు ముగ్గురు టీచర్లను నియమించారు. ఇలా ఏవీఎమ్ స్టూడియో నా పాఠశాలగా మారింది. పేరుకు పాఠశాలగానీ, షూటింగ్‌వల్ల రోజూ క్లాసులకు డుమ్మాలే! నాన్నకు సినిమా పరిచయాలు ఎక్కువ. అది నాకు కలిసొచ్చింది.

### బాలనటిగా 60 చిత్రాలు

భక్త ప్రహ్లాద చిత్రాన్ని తమిళ, కన్నడ, హిందీ భాషల్లో నిర్మించారు. అన్ని భాషల్లో నాదే ప్రహ్లాదుని పాత్ర. కామెడీ ట్రాక్, కొన్ని సీన్లు మాత్రం ఆ భాషా కమెడియన్స్‌ను ఉపయోగించి నేటివిటీకి తగ్గట్టు రీమేక్ చేశారు. ఈ ఒక్క చిత్రంతో అన్ని రాష్ట్రాల్లో నాపేరు మారుమోగిపోయింది. ఈ సినిమా తర్వాత బాలనటిగా తెలుగు, తమిళ భాషల్లో 'సత్తెకాలపు సత్తెయ్య', 'శ్రీదేవి', 'చిన్నారి పాపలు', శివాజీగణేశన్‌గారితో 'ఇరుమళకగాళ్', 'ఎంతంబి', 'ఎంగమామ', 'ఎదురొలి' చిత్రాల్లో నటించాను. ఇలా బాలనటిగా దాదాపు 60 చిత్రాలు చేశాను.

### పదమూడేళ్ళకే హీరోయిన్‌గా

పదమూడేళ్ళకే హీరోయిన్‌గా నటించాను. హీరోయిన్‌గా నా మొదటి చిత్రం 'చంబరత్తి' (1972). అంటే మలయాళంలో మందారపువ్వు. దీన్నే తెలుగులో 'కన్నెవయసు' (1973), తమిళంలో 'పరువకాలం' (1974)గా రీమేక్ చేశారు. తమిళంలో కమల్‌హాసన్, తెలుగులో శరత్‌బాబు నటించారు.

### రాష్ట్రపతితో కలిసి సినిమా చూశా

అప్పటి రాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు 'భక్తప్రహ్లాద' చిత్రం విడుదల తర్వాత నన్ను ఢిల్లీకి పిలిపించి నాతో కలిసి కూర్చుని ఆ చిత్రం చూసి నన్ను అభినందించారు. అన్నిటికన్నా ముఖ్య విశేషం ఏమిటంటే, 'చంబరత్తి'లో హీరోయిన్‌గా తొలి చిత్రానికే ఫిలింఫేర్ అవార్డు లభించింది. బొంబాయివెళ్ళి ప్రముఖ క్రికెటర్ అజిత్‌వాడేకర్ చేతులమీదుగా ఈ అవార్డు అందుకున్నాను. నాటి క్రీడాకారులు సునీల్‌గవాస్కర్, విశ్వనాథ్, బిషన్ సింగ్‌బేడి, ప్రసన్నశ్రీనివాస వెంకటరాఘవన్‌ల సమక్షంలో ఈ అవార్డు ఇచ్చారు. పద్నాలుగేళ్ళ వయసులో ఇలా అవార్డు అందుకుంటున్నప్పుడు ఆ క్రీడాకారులందరూ గౌరవపూర్వకంగా లేచి నిలబడి చప్పట్లు చరిచారు. ఇది నా జీవితంలో ఎన్నటికీ మరువలేను. ఆనాటి ఆనందం మాటల్లో చెప్పలేనిది. ఆ విధంగా చిత్ర పరిశ్రమలో నాకు ఒక మంచి స్థానం లభించింది. ఇంతకంటే ఏ

నటికైనా జీవితంలో ఇంకేం కావాలి చెప్పండి? అదేవిధంగా 'ఓ సీత కథ' చిత్రంలో ఉత్తమ నటిగా రాష్ట్ర ప్రభుత్వ నంది అవార్డు లభించింది. న్యూజెర్సీ వారి తెలుగు ఫైన్‌ఆర్ట్స్ కమ్యూనిటీ అవార్డు, ఫ్లోరిడావారి లైఫ్‌టైమ్ అచీవ్‌మెంట్ అవార్డు లభించాయి. దాదాపు 50 అవార్డులు అందుకున్నాను. నూరేళ్ళ చిత్రసీమ సంబరాల్లో మద్రాసులో మంత్రి అరుణ చేతుల మీదుగా ఉత్తమ నటి అవార్డు అందుకున్నాను.

### కమల్‌హాసన్‌తో

కమల్‌హాసన్ చిత్రాలు యాక్టింగ్ పరంగా, నిర్మాణపరంగా గౌరవప్రదంగా ఉండేవి. ఆయనంటే ప్రత్యేక గౌరవం. అతడొక నిఘంటువు. అంకిత భావం గల నటుడు. ఏకాగ్రత, హుందాతో కూడిన నటన కమల్‌హాసన్‌లో కనిపిస్తుంది. పాత్ర, గెటప్‌లో ప్రత్యేకత కనిపిస్తుంది. ఆర్టిస్టు ఇలా ఉండాలనిపిస్తుంది. ఆయన కథ ఎంపిక కూడా భిన్నమే. అందుకే అవి అన్ని భాషల్లోకీ రీమేక్ అవుతాయి. సాగరసంగమం, స్వాతిముత్యం, భారతీయుడు, నాయకుడు..ఇలా ఏ చిత్రమూ దేనికీ తీసిపోనివి. హేట్సాఫ్ టు కమల్. తెలుగులో 'సొమ్మొకడిది సోకొకడిది', మలయాళంలో 'మట్టోళ్‌సీత', 'ఆనందం పరమానందం', కన్నడంలో కోకిల, తమిళంలో 'పరువ కాలం' ఇలా పలు భాషల్లో ఆయనతో నటించాను.

### ఎన్టీఆర్‌తో

డ్రైవర్‌రాముడు, రామ్‌రహీమ్ చిత్రాల్లో ఎన్టీఆర్ చెల్లెలుగా నటించాను. 'ఏమని వర్ణించనూ, నీకంటి వెలుగును....అనే డ్రైవర్‌రాముడులో ఎన్టీఆర్ పాట ఇప్పటికీ ప్రతి చోటా వినిపిస్తూనే ఉంటుంది. హరికృష్ణగారి తొలి ప్రొడక్షన్ ఇది. 'తాతమ్మకల', 'సంసారం' చిత్రాల్లో ఎన్టీఆర్‌గారితో నా సన్నివేశాలు ఇప్పటికీ మరిచిపోలేను. నా చివరి చిత్రం 'రక్తబంధం'. చిరంజీవికి చెల్లెలు పాత్ర. 1980లో విడుదలైంది. తర్వాత పూర్తిగా డబ్బింగ్‌కే ప్రాధాన్యమిచ్చాను.

### చక్రపాణిగారితో ఒరియా చిత్రాలు

నటుడు, దర్శకుడు, నా జీవిత భాగస్వామి చక్రపాణిగారు 'ఆడపడుచు' చిత్రాన్ని ఒరియాలో 'పునర్‌మిలన్'గా నిర్మించారు. ఆ భాషలో ఇదే నా తొలి చిత్రం. తెలుగులో ఎన్టీఆర్, చంద్రకళ నటించారు. అన్నా నీ అనురాగం/ఎన్నో జన్మల పుణ్యఫలం... అనే ఆడబడుచులోని పాట నాకు బాగా నచ్చింది. 'పునర్‌మిలన్' చిత్రం ఆరంభంలోనే చక్రపాణిగారితో నా పెళ్ళిచూపుల సన్నివేశం చిత్రించారు. ఆ తర్వాత కాకతాళీయంగానే నా పెళ్ళి జరిగింది. ఈ చిత్రం తర్వాత ఆయన ఒరియాలో 'సతీఅనసూయ', 'సీతాలవకుశ', 'కవిసామ్రాట్ ఉపేంద్రభోంజో' వంటి నాలుగు చిత్రాల్లో నటించారు. నేను ఆయన కలిసి ఒరియాలో నటించిన చివరి చిత్రం 'సీతా లవకుశ'. అదేవిధంగా తెలుగులో 'ఆమె' చిత్రాన్ని ఒరియాలో 'సేజ్సోటి'గా చక్రపాణి దర్శకత్వంలో నిర్మించారు. 'సర్పంచ్‌బాబు' చిత్రానికి కూడా ఆయనే దర్శకత్వం.

తెలుగులో ఎన్టీఆర్‌గారు పౌరాణిక చిత్రాల్లో విభిన్న పాత్రల్లో ఎలా నటించారో ఒరియాలో కూడా చక్రపాణిగారు అదేవిధంగా విభిన్న పాత్రలు పోషించారు.

### డబ్బింగ్

నా సినీ జీవితంలో మరో మలుపు నటీమణులకు డబ్బింగ్ చెప్పడం. నా గొంతును ఎన్నోరకాలుగా మార్చి మాట్లాడగలశక్తి నాకుందని నిజంగా నాకే తెలియదు. 'నిర్దోషి' చిత్రంలో సుహాసినిగారికి వాయిస్ డబ్బింగ్ చేస్తావా అని మురళీమోహన్ గారు ఫోన్‌చేసి అడిగారు. తరుణ్ సాయంత్రం స్కూలు నుంచి వచ్చేవరకు ఖాళీగా ఉండేదాన్ని గనుక అంగీకరించాను. మొదటిసారే ఎమోషనల్ సీన్‌లో డబ్బింగ్ చెప్పాను. సరిగ్గా సరిపోయింది, అద్భుతంగా వచ్చిందన్నారంతా. అలా సుహాసిని నెంబర్ వన్ నటి అయింది. రమ్యకృష్ణ, మీనా, రోజా, రాధ, యమున, ఊహ, విజయశాంతి, శోభన, హిందీనటులు మీనాక్షీశేషాద్రి, శిల్పాషెట్టి, ఖుష్బూ, టబూ, దివ్యభారతి, దీప్తిభట్నాగర్ వంటివారికి డబ్బింగ్ చెప్పాను. ఇందుకు నేనెంతో గర్వంగా ఫీల్ అవుతున్నాను. ఇరవైయేళ్ళుగా 250 మందికి సుమారు 400 చిత్రాల్లో వాయిస్ ఇచ్చాను. ఇది నా వృత్తిగా మారిపోయింది.


కుటుంబసభ్యులతో..

### దర్శకుల చాకచక్యం

ఆనాటి దర్శకులు చాకచక్యంతో సినిమాలు నిర్మించేవారు. ఉరుకులు పరుగులు, దర్శకత్వ లోపాలు లేకుండా చిత్రాలు నిర్మించేవారు. ప్రేక్షకులు ఎంతగానో ఆదరించేవారు. ఇప్పుడు ట్రెండ్ మారింది. ఈ జనరేషన్‌కి ఆ చిత్రాలు, ఆ జనరేషన్‌కు ఈ చిత్రాలు నచ్చట్లేదు. టెక్నాలజీవల్లే అనుకోవడం కూడా పొరపాటే. అరిసెలు, బొబ్బట్లు, సున్నుండలు నాటి వంటలు. బర్గర్లు, పిజ్జాలు, కేకులు, ఫాస్ట్‌ఫుడ్ నేటి వంటలు. జనరేషన్‌ను బట్టే మనం కూడా మారుతున్నాం కదా! ఏది మంచో, ఏది చెడో మనం నిర్ణయించలేం. మంచి దర్శకులు ఆనాడూ ఉన్నారు, ఈనాడూ ఉన్నారు. ఆనాడు కొన్ని సన్నివేశాలు తియ్యడానికి పది రోజులు పట్టేది. ఇప్పుడు గంటల్లోనే పూర్తిచేస్తున్నారు. దర్శకులు నిర్మాణ జాగ్రత్తలు తీసుకోవడం లేదనిపిస్తోంది. అందుకే ఎక్కువ చిత్రాలు ఫ్లాప్ అవుతున్నాయి. తగిన జాగ్రత్తలతో మంచి కథ ఎంచుకుని నిర్మాణాత్మక చిత్రాలు తీస్తే పరిశ్రమ మూడు పువ్వులు, ఆరుకాయలుగా వర్ధిల్లుతుంది.

### కుటుంబం

ప్రముఖ దర్శకుడు, నటుడు చక్రపాణిగారితో 1981 అక్టోబరు 16న నా వివాహం జరిగింది. మాకు ఒక బాబు, ఒక పాప. బాబు తరుణ్. పాప అమూల్య. పాప అమెరికాలో ఇంటీరియర్ డిజైనర్ కోర్సు ప్రాజెక్టువర్క్ చేస్తోంది. మా వివాహం 30 యేళ్ళు పూర్తయిన సందర్భంగా బంధువులు, స్నేహితుల్ని పిలిచి మాకు తెలియకుండా పార్టీ ఎరేంజ్‌చేసి మా పిల్లలిద్దరూ మమ్మల్ని సర్‌ప్రైజ్ చేయడం, 'అంజలి' చిత్రంలో మా బాబు తరుణ్ నటనకు నాటి రాష్ట్రపతి ఆర్.వెంకట్రామన్ బెస్ట్ చైల్డ్ ఆర్టిస్టు అవార్డు ఇవ్వడం మరువలేని ఘట్టాలు. మూడేళ్ళక్రితం అమెరికా వెళ్ళి ఎంతో హాయిగా గడిపాం. నాకు ఇల్లే ఎంతో ముఖ్యం. మీ ఇంట్లో ఎంతమంది సభ్యులు అని అడిగితే రెండు పప్పీలతో కలిపి ఆరుగురం అని చెప్తాను. క్యూ, న్యూ వాటిపేర్లు. ఎప్పుడూ అవి మాతో ఎటాచై ఉంటాయి. ప్రముఖ సితార్ విద్వాంసుడు పండిట్ రవిశంకర్ అభిమానిని. రోజుకోసారైనా ఆయన సీడీ వింటాను.

### గాయని కావాలని కోరిక

గాయకురాలు కావాలనేది బాల్యం నుండీ నా కోరిక. దూరదర్శన్ చిత్రలహరి, నేషనల్ ఛానల్ 'రంగోలి' అంటే ఇష్టం. సంగీతం నేర్చుకోలేకపోయాను. అశ్రద్ధ అంతే. నా గొంతు బాగుంటుంది, సింగరైతే బాగుంటుందని ఎంతోమంది అంటారు. కానీ పెళ్ళయ్యాక డబ్బింగ్‌కి అంకితమయ్యాను. దానికి నేనేం బాధపడటం లేదు. నా జీవితం నాకెంతో తృప్తిగా ఉంది.

### లక్కీ నెంబర్ ఫైవ్

నా లక్కీ నెంబర్ ఫైవ్. ఎందుకంటే, మా కుటుంబంలో నేను ఐదో సంతానం. తెలుగులో నా పేరు ఐదు అక్షరాలు. 'భక్త ప్రహ్లాద' చిత్రం పేరులో ఉన్నదీ ఐదు అక్షరాలే. నేను ఆ చిత్రం కాంట్రాక్టుపై సంతకం చేసింది నా ఐదోయేటే. నా కారు నెంబరు ఐదు. మా అబ్బాయి పేరు ఇంగ్లీషులో ఐదు అక్షరాలే.

*-కె.హరనాథ్, సెల్: 97035 42598*

# ఇవన్నీ నిజాలే!

### బానిస బతుకులు

A ప్రపంచంలో రోజుకు 20 వేల టన్నుల చెత్తను డంప్ చేసే ఏకైక నగరం మెక్సికో! ఇక్కడున్న భారీ డంప్ యార్డ్‌లో బాలలతో సహా రెండువేలమందివి బానిస బతుకులే! ఇక్కడికొచ్చే శవాలమీది ఆభరణాలు, డబ్బు, నోట్లో బంగారు పళ్ళు, ఇతర విలువైన వస్తువులు సేకరించి గ్యాంగ్‌స్టర్లకు అప్పగించడమే వీళ్ళ పని!

•••

A సింగిల్ చైల్డ్ నిబంధన వల్ల చైనాలో యేటా వేలాదిమంది శిశు బాలికల్ని అనాథలుగా వదిలేస్తున్నారు.

•••

A భూగోళంమీద పదకొండు శాతం ఉపరితలాన్ని మాత్రమే పంటలు పండించేందుకు ఉపయోగించుకుంటున్నాం.

•••

A 19వ శతాబ్దానికి పూర్వం దంతవైద్యులు, మరణించిన సైనికుల పళ్ళను తొలగించి మరొకరికి ఉపయోగించేవారు.

•••

A 45 యేళ్ళ వయసువారు వారానికి 30 సార్లు భాగస్వామిని ముద్దుపెట్టుకుంటే 18-24 వయసువారు వారంలో 11 సార్లే భాగస్వామిని ముద్దుపెట్టుకుంటారని సర్వేలో తేలింది!

•••

A మధ్యయుగాల్లో మంత్రతంత్రాలకు పాల్పడేవారికి మరణశిక్ష విధించేవారు. ఆ విధంగా ఆరు లక్షల మంది ప్రాణాలు కోల్పోయారు.

•••

A అమెరికా సంయుక్త రాష్ట్రాల వ్యవస్థాపకులలో ఒకడు బెంజమిన్ ఫ్రాంక్లిన్. ప్రతిరోజూ పొద్దున్నే నగ్నంగా కిటికీ దగ్గర కూర్చుని గంటసేపు 'ఎయిర్ బాత్' చేసేవాడు. అది ఆరోగ్యానికి ఎంతో మంచిదని ఆయన భావించేవాడు.

•••

A Pius II పోప్‌గా బాధ్యతలు తీసుకోవడానికి ముందు జనాదరణ పొందిన శృంగార రచన చేశారు. ఆ పుస్తకం పేరు 'ది టేల్ ఆఫ్ టూ లవర్స్!'

•••

A స్పెయిన్‌కు చెందిన గొప్ప మూరిష్ పాలకుడు యాకుబ్ అల్ మన్సూర్ (1184-1199). సామాన్య ప్రజలు అతన్ని బ్లాక్ సుల్తాన్ అని పిలిచేవారు.

•••

A విపరీతమైన చలికారణంగా 1684లో థేమ్స్ నది రెండు నెలలపాటు రాయిలా గడ్డకట్టుకుపోయింది.

•••

A 1972లో భయంకరమైన మంచుతుఫాను కారణంగా, ఇరాన్‌లోని 200 గ్రామాలు ఎనిమిది మీటర్ల లోతున మంచులో కూరుకుపోయాయి!

•••

A భూమ్మీద అన్ని సముద్రతీరాల్లో ఉన్న ఇసుకరేణువులకంటే ఎక్కువ సంఖ్యలో విశ్వాంతరాళంలో నక్షత్రాలు వ్యాపించి ఉన్నాయి!

-చిన్నారి

## సుధామ పదగారడి-274

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | h | 3 | 4 | h | 5 | 6 |
| | h | 7 | 8 | | | | h | |
| 9 | 10 | h | | h | | 8 h | 11 | |
| h | 12 | | h | 13 | | | | h |
| 14 | 11 | h | h | | h | h | 15 | h |
| h | 16 | 15 | 17 | h | h | 18 h | | h |
| 19 | | h | | h | 20 | 19 h | 21 h | 22 |
| h | h | 23 | | 24 | | | h h | |
| 25 | | | h | 26 | | h | 27 | |

### ఆధారాలు

**అడ్డం**

1. పసిపిల్లలు కొట్టేది (3)
3. కోరిక మధ్యలో వదిలితే స్త్రీలు కట్టుకునేది (2)
5. మగవాడి మూతి మీద మొలిచేది (2)
7. ఆగస్టు 15 (5)
9. అటుగా వాయసము (2)
11. ఉపకారంలో ఘాటైనది (2)
12. మేఘము (2)
13. ఓ పర్వత శ్రేణి ఆరా, ఏడా అంటే ఏడా మాత్రం కాదు (4)
14. అటుగా వస్తూ ధేనువు చివరకు పోయింది (2)
15. చితి (2)
16. మందపవనం (4)
18. ... మాతరం! (2)
19. ఓడ దైనా కావచ్చు, చాకి దైనా కావచ్చు (2)
21. పువ్వు (2)
23. ఊదొత్తి (5)
25. కృష్ణుడే (3)
26. యంత్రం (2)
27. నిక్కరు (2)

**నిలువు**

1. మొగలిపువ్వు (3)
2. తిరగబడిన దుష్టురాలు (2)
3. ఆగ్రహం (2)
4. కుక్షినిండా అనే.. (4)
6. యుద్ధం (3)
8. మరక (2)
10. కల్పవృక్షం తోడిది కోరిన కోరికలు తీర్చేది (5)
11. కలకత్తా దేవత (5)
13. క్షుత్ (3)
17. గుండ్రంగా తిరిగే ఎద్దుతో నూనె తీసే యంత్రం (3)
19. జమదగ్ని భార్య (3)
20. రామునికి ఎంగిలి పండ్లిచ్చింది ఈ జాతి స్త్రీయే! (3)
22. ఎన్నికల్లో మునుపు ఎక్కువగా జరిగేది (ఆంగ్లపదం) (3)
23. తండ్రి (2)

### పదగారడి-273 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1మ | న | 2సు | ■ | 3ఆ | ■ | 4ఆ | ర | 5బి |
| హా | ■ | డ | ■ | స | ■ | న | ■ | ల్లు |
| త్మా | ■ | ■ | 6చ | రా | ల | ■ | ■ | డు |
| ■ | ■ | 7వి | ■ | ■ | ■ | 8శో | ■ | ■ |
| 9స | త్యా | గ్ర | హం | ■ | 10శు | భ | రా | త్రి |
| ■ | ■ | హం | ■ | ■ | ■ | నం | ■ | ■ |
| 11గ | గ్గ | ■ | 12ఆ | 13దు | ర్గ | ■ | ■ | 14అ |
| డ | ■ | 15కే | ■ | ప్ప | ■ | 16అం | ■ | రి |
| 17ప | ల్ల | కి | ■ | టి | ■ | 18గ | ర | ఫం |

Printed and Published by VEMURI RADHAKRISHNA, Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: A.N.JAGANNADHA SARMA

# ఇంత రెస్పాన్స్ ఊహించలేదు

## -రీతూ వర్మ

రీతూ వర్మ.... నిన్న మొన్నటి వరకూ ఈ పేరు టాలీవుడ్‌లో పెద్దగా వినిపించేది కాదు. 'ఎవడే సుబ్రమణ్యం' సినిమాతో వచ్చిన కొద్దిపాటి గుర్తింపు రీతు కెరీర్‌కి పెద్దగా ప్లస్ కాలేదు. కానీ 'పెళ్ళిచూపులు' మాత్రం ఆమె ఫేట్‌ను ఒక్కసారిగా మార్చివేసింది. ఇప్పుడు చాలా మంది నోట రీతూ వర్మ పేరే వినిపిస్తోంది. అనూహ్యంగా వచ్చిన ఈ గుర్తింపు గురించి రీతూ వర్మ మాటల్లోనే....



**'పెళ్ళిచూపులు' విజయాన్ని ముందే ఊహించారా?**

మంచి విజయం సాధిస్తుందని అనుకున్నాం కానీ, ఇంతటి ఘనవిజయాన్ని సాధిస్తుందని మాత్రం అనుకోలేదు. అనుకోకుండా వచ్చిన ఈ విజయం చెప్పలేనంత ఆనందాన్నిస్తోంది.

**ఈ సినిమాలో అవకాశం ఎలా వచ్చింది?**

గతంలో తరుణ్ భాస్కర్‌తో రెండు షార్ట్ ఫిలిమ్స్ చేశాను. అప్పుడే తను నాకు ఈ కథ గురించి చెప్పడం జరిగింది. కథ వినగానే బాగా నచ్చింది. కచ్చితంగా ఓ డిఫరెంట్ సినిమా అవుతుందని అప్పుడే అనిపించింది. అందుకే వెంటనే ఓకే చెప్పేశాను.

**రియల్ లైఫ్‌లో రీతూ చిత్రలాగే ఉంటుందా?**

అస్సలు ఉండదు. సినిమాలో చిత్ర చాలా ప్లాన్డ్‌గా ఉంటుంది. అన్నీ ప్రణాళికాబద్ధంగా జరగాలనుకునే మనస్తత్వం చిత్రది. నిజ జీవితంలో నేను అలా ఉండను. ఉండలేను కూడా. నా జీవితంలో ఏదీ ఓ ప్లాన్ ప్రకారం జరగలేదు. సినిమాల్లోకి వస్తానని ఎప్పుడూ అనుకోలేదు. గ్రాడ్యుయేషన్ పూర్తి కాగానే తరుణ్ షార్ట్ ఫిలింలో నటించమని అడిగాడు. సరదాగా అనిపించి ఓకే చెప్పాను. అలా నటనవైపు నా కెరీర్ మలుపు తిరిగింది. ఇప్పుడు నటనని సీరియస్‌గా తీసుకున్నాను. ఏ పని చేసినా సిన్సియర్‌గా చేయడం నాకు అలవాటు.



**విజయ్ దేవరకొండతో రెండవ సినిమా కదా ఇది?**

అవును. 'ఎవడే సుబ్రమణ్యం' చేసే సమయంలో తనతో నాకు పెద్దగా పరిచయం లేదు. కానీ ఈ సినిమాతో ఇద్దరం మంచి స్నేహితులం అయిపోయాం. ఇద్దరికీ ముందే పరిచయం ఉంది కాబట్టి కొత్తగా ఫీల్‌కాలేదు. అందుకే తెర మీద మా కెమిస్ట్రీ చాలా బాగుందన్న ప్రశంసలు వస్తున్నాయి.

**ఈ సినిమా షూటింగ్‌లో మరిచిపోలేని సంఘటన?**

తండ్రీ కూతురు మధ్య వచ్చే సెంటిమెంట్ సీన్ ఎప్పటికీ మరిచిపోలేను. రియల్ లైఫ్‌లో మా ఫాదర్‌తో నాకు ఎటాచ్‌మెంట్ ఎక్కువ. ఇంతకు ముందు ఎమోషనల్ సీన్లు చేసే సమయంలో గ్లిజరిన్ వాడేదాన్ని. ఈ సినిమాలో ఆ సన్నివేశం చేసేటప్పుడు గ్లిజరిన్ వాడకుండానే కన్నీళ్ళు వచ్చాయి. ఆ సన్నివేశం పూర్తయ్యాక చాలా బాగా వచ్చిందంటూ యూనిట్ మొత్తం అభినందించడం మరిచిపోలేని అనుభూతి.

**గత సినిమాల కన్నా ఈ సినిమాలో చాలా అందంగా కనిపించారు. ప్రత్యేకమైన జాగ్రత్తలు ఏమైనా తీసుకున్నారా?**

ఈ మాట చాలామంది నోటి నుంచి వచ్చింది. నేను అందంగా కనిపించడానికి కారణం డ్రెస్సింగే! క్రెడిట్ అంతా తరుణ్ భాస్కర్‌గారిదే! నా డ్రెస్సింగ్ విషయంలో తను చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. ఈ సినిమాలో నన్ను చూసినవారు హీరోయిన్‌గా కాకుండా పక్కింటి అమ్మాయిగా ఫీలయ్యారు. గతంలో ఈ విధంగా ఎప్పుడూ ఎవ్వరూ ఫీలయినట్టు నా దృష్టికి రాలేదు. నిజజీవితంలో ఎంత సింపుల్‌గా ఉంటానో, తెర మీద కూడా అలాగే కనిపించేసరికి ప్రేక్షకులు కొత్తగా ఫీలయ్యారు.

**సినిమా గురించి మీ పేరెంట్స్ ఫీలింగ్స్?**

గతంలో నా సినిమాలను నేను ఒక్కదాన్నే చూసేదాన్ని. ఈ సారి మా పేరెంట్స్‌తో పాటు కలిసి చూశాను. సినిమా చూస్తున్నంత సేపూ వారి ఫీలింగ్స్ గమనించడమే సరిపోయింది. ఇద్దరూ చాలా బాగా ఎంజాయ్ చేశారు. బయటికి వచ్చేటప్పుడు చాలా బాగా చేశావు అన్నారు. ఎంతమంది పొగిడినా కలగని ఆనందం వారి మాటలతో కలిగింది.

**ప్రస్తుతం టాలీవుడ్‌లో అంగీకరించిన సినిమాలు?**

కథలు అయితే వింటున్నాను. వేటికీ ఓకే చెప్పలేదు. తమిళంలో చేసిన ద్విభాషా సినిమా త్వరలోనే విడుదల కాబోతోంది. తమిళంలో రెండు సినిమాలకు ఓకే చెప్పాను.

-దేవి

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు

# పుస్తకముల పట్టిక

(Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్**

పేజ్ లైక్ చేయండి.



Like us to follow :

**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram

| | | |
|---|---|---|
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

